# భారతి

సచిత్ర మాసపత్రిక



సంపాదకుడు :
శి. శంభుప్రసాద్

సంపుటము ౧౮, సంచిక ౧



# ప్రకటన

ఈ క్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈ నెల భారతి (1941 సం. జనవరి నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమునకగు చందా మాకు చేరునట్లు ఈ నెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపు లేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1941 సం ఫిబ్రవరి 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. కావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయమును వెంటనే తెలియ

జేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

A 10. H 71, 72, 74. K 11. N 4. P28. R 24. S 28, 30, 33, 36, 37, 39, 79, 95, 97, 98, 99. V 13, 32. Z 3.

ఆంధ్రపత్రికా ముద్రాలయము
మదరాసు.

# భారతి—అష్టాదశ సంపుటము. భా—౧.

## వ్యాసముల అకారాది సూచి



జరాభారము

[చిత్రకారుడు : శ్రీ దాసరి వీరయ్య]



సంపుటము 18
సంచిక 1

# భారతి

విక్రమ పుష్యము
జనవరి 1941

## స్వవిషయము

భారతి యీ సంచికతో పదిహేడేండ్లు గడచి పద్దెనిమిదవ యేట ప్రవేశిస్తున్నది.

కాగా, ఇది భారతికి పుట్టినరోజు పండుగ. ఈ శుభావసరంలో అది ప్రకృతి సహజమైన కోరికగా క్రొత్తక్రొత్త విలాసాలతో, నవ నవోన్మేషములైన రూపరేఖలతో అలంకరించుకొని, విగ్రహపుష్టికి తోడు విషయపుష్టినికూడా ఇతోధికంగా సంతరించుకొని ఆంధ్రమహాశయులను మిను మిక్కిలిగా ఆప్యాయపెట్టవలెనని సంకల్పించుకొన్నది. చిరాయుస్సంపాదకమైన ఆశీస్సులకోసము ఆంధ్రమహాజనులను అర్థిస్తున్నది

... ... ...

భారతి ఇన్నేండ్లుగా కాలవాహినిలోని అనేక అంతరాయాలను ఎదుర్కొని, నిబ్బరంగా నిలిచి, తొలినాటి ఆ ఏకైక లక్ష్యంతోనే ఆంధ్రమహాజనసేవ, ఆంధ్రసారస్వత సేవలు చేస్తున్నదంటే అందుకు మాపాఠకుల, మా రచయితల అవ్యాజ ఆదరాభిమానాలే కారణమని మనసువిడచి చెప్పుతున్నాము. ఇందుకు వారికి మా కృతజ్ఞతా వందనాలు సమర్పిస్తున్నాము. ఇదివరకే కాదు, ఇప్పుడే కాదు, ఏనాటికీగూడా ఆ ఆదరాభిమానాలే మాకూ, మాభారతికీ ఏడుగడ.

... ... ...

ఒక యేడు గడచి యింకొక యేడు పుట్టినప్పుడల్లా స్వవిషయాలను పాఠకుల మ్రోల ఏకరువుపెట్టడము పత్రికలకు పరిపాటియయిన విషయము. సంప్రదాయాలను సంత్యజించడము శ్రేయస్కాములకు ధర్మము కాదు మరి.

... ... ...

కాలవాహినిలో ఒకయేడు గడవడమన్నా, క్రొత్తయేడు పుట్టడమన్నా రెండూ సహజసిద్ధమైన విషయాలే. ఈపరివర్తనము నాటకరంగముమీద ఒక అంకము పూర్తియై ఇంకొక అంకానికి తెరలేవడము లాంటిదే. ప్రకృతి నియమమే అది. కాని ఆ క్రొత్తఅంకము ప్రేక్షకులకు ఆప్యాయంగానే ఉంటుందో,

అన్యథాగానే ఉంటుందో ఇదమిత్థంగా చెప్పడానికి ఎవరికీ అలవికాని పని.

కాగా: మనము చేయగలిగినదల్లా ఒక్కటే. ఫలితాలతో ప్రమేయం పెట్టుకోక, కేవల శుభాకాంక్షతో కర్మల నాచరించడమే. అనుకొన్నవి అనుకొన్నట్లుగానే ఫలితాలు కలుగునని పూచీ దొరకడము దుర్లభమైనపని. ఈ రీతిగా అనుకొన్న పనులు అనుకొన్నట్లుగా జరగక కార్య వైఫల్య మేర్పడినప్పుడు ఆకార్య వైఫల్యము అగోచరమైన ఏదో ఒక మహాశక్తి చర్యగా భావించడంకద్దు. అలాగ దైవికశక్తికి దానిని అంటగట్టడంకంటె ఆకార్యసాధనలో మనము తొక్కిన పోకడలే, మన మనుసరించిన పద్ధతులే లోపభూయిష్ఠములేమోనని మెందు కనుకోరాదు? నిజానికి, మనలను కార్యరంగానికి దించే కోరికలనుబట్టీ, ఆదర్శాలను బట్టీ మాత్రమే స్థూలంగా మన కౌశలాన్ని గాని, మన ప్రజ్ఞాపాటవాన్నిగాని నిర్ధరించడానికి వీలులేదు.

ఎవరికివారు గడచిపోయిన తమతమ కార్యకలాపాలను కాస్త ఓపికతో సింహావలోకనం చేసుకొంటేనూ, ఆత్మావలోకన చేసుకోగలిగితేనూ ఈసత్యం నగ్నంగా గోచరింపకపోదు. కాని యీ ఆత్మావలోకనం చేసుకొనేవా రెంతమంది ఉంటారు?

కాబట్టి మేముకూడా ఈపత్రికా నిర్వహణంలో ఎన్నో పొరపాట్లు చేసి ఉంటామని ఒప్పుకోకతప్పదు. ఆ నిర్వహణకార్యక్రమంలో ఎన్నో లోటుపాట్లు ఉండిఉండ తాయని కూడా అంగీకరింపక తప్పదు. అప్పటప్పట మా వ్రాతలుకూడా ఏలవలేశమో మా పాఠకులనూ, మా రచయితలనూ నొప్పించి యుండనూవచ్చు. కాని ఒక్కసంగతి మాత్రము నిజమని హృదయస్ఫూర్తిగా చెప్పతున్నాము. ఆ పొరపాట్లు కాని, ఆ లోటుపాట్లుకాని, ఆ నొప్పింపు వ్రాతలు కాని మేము హృదయపూర్వకంగా, చేయదలచి చేసినవిమాత్రం కావని చెప్పతున్న మా మాటలను మా పాఠకమహాశయులును, మారచయితలును విశ్వసింపగోరుతున్నాము.

... ... ...

ఇన్నాళ్లుగా మాపట్లనూ, మాపత్రికపట్లనూ చూపుతూ వచ్చిన ఆదరాభిమాన సహకారాలనే ఇకముందు కూడా చూపుతూ వుండవలసిందని మా రచయితలనూ, మాపాఠకులనూ సాంజలిబంధంగా కోరుతున్నాము.

నూతన సంవత్సరంలో సకలాంధ్ర ప్రపంచానికీ సుఖసంపదలను ఆకాంక్షిస్తున్నాము.

# బానిసల సముద్రము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

బానిసగూడెముపజ్జను
పయోరాశి యెందులకో
పయోరాశి వీచివాత్య
పరువులిడుట యెందులకో.

బానిసతన మొకడు వదలి
బహుచర్చావిషయంబులు
శవనము, దేవుడు, సంఘము, జ
గత్తు నడిచెడు వ్యవహారంబులు.

సాయంవాహ్యాళి యిట్లు
చర్చాలుబ్ధులకును బానిసలకు
రివ్వుమంచు జలధివాత్య
కవ్వించెను వాదివోలె.

అతడు సైనికప్రతినిధి
ఎదురులేని హిరణ్యాక్షుడు
సదురులేని కంసరాజు
బెదురు లేని దశకంఠుడు.

భార్యతోడ వాహ్యాళికి
వచ్చెను, పయోరాశివాత్యకు
విచలత్సికతామయధూమ్యకు
ప్రతినిధి సతిపై ప్రణయమొ!

ఒక్క వెర్రి గాలి వీచి
చిక్కపట్టుకోసీయక
పెళపెళ నాయమ చీరయు
నెగిరెను తెరచాపవోలె.

బానిసతనమునుగూడ పటా
పటా బ్రద్దలుచేసెడి
ప్రకృతిసిద్ధమైన వాంఛ
పరిమళించె వారికనుల.

అంతట ప్రతినిధి కన్నుల
అగ్గిలేదు-బుగ్గిలేదు
ప్రక్కను ప్రేలాడుకత్తి
పరపర గొంతులు కోసెను.

పాతిక ముప్పది శవముల
ప్రవహించిన నెత్తురుతో
బుద్ధి వచ్చినట్లు గాలి
సద్దుమణగి యూరకుండె.

గంట కడచె మరల నట్లె
గాలి ధురాగతి వీచెను.
శవనము, దేవుడు, సంఘము, జ
గత్తు చర్చాసంగతి సాగెను.

బానిసగూడెముపజ్జను
పయోరాశి యుందులకా
పయోరాశివీచివాత్య
పరువు లిడుట యుందులకా.

# ఆంధ్రభాషా, వాఙ్మయములు

## ప్రాకృత సంపర్కము

నన్నయ్యకు పూర్వము ఆంధ్రభాషా, వాఙ్మయములే లేవా?



ఆంధ్రభాషయంతయు - దేశ్యముతో సహా - సంస్కృత ప్రాకృత జన్యమేనా?

శ్రీ కోరాడ రామకృష్ణయ్య

మన దేశమునకును, నందలి జనులకును నాంధ్ర, తెలుగు అను రెండు నామము లగపడుచున్నవి. అట్లగుటకు గారణ మేమి యని కొంత విచారింపవలసియున్నది. ఈ రెంటిలో నాంధ్రపదమే చారిత్రకనిదర్శనములను బట్టి ప్రాచీనముగా గనబడును. 'తెలుగు' అంతకంటె ప్రాచీనము కాకపోదు గాని తగిన సాక్ష్యనిదర్శనము లగపడవు.

ఆంధ్రులు ఐతరేయబ్రాహ్మణ కాలము నాటికే దేశీయులగు ననార్యజనుల సంపర్కము గలిగిన యార్యులలో నొక తెగగా నుండినట్లు గనబడుచున్నది. వీరు కృష్ణాగోదావరీ మధ్యదేశమున నెలకొని యొక మహాసామ్రాజ్యమును స్థాపించి హిందూదేశపాలకు లైనారు. కృష్ణానదీ ప్రాంతమునందలి అమరావతి, జగ్గయ్యపేట మొదలగు ప్రదేశములందును, పశ్చిమదేశమున నాసిక్ ప్రాంతమునను గల బౌద్ధస్తూపములు, శాసనములు మొదలగునవియే యీ యాంధ్రరాజుల మహావైభవమును చాటుచున్నవి. ఈ మిశ్రజాతియగు నాంధ్రుల మహావైభవముతో గూడిన పాలకత్వము మూలముననే యీ దేశమునకు, ఈ భాషకు నా పేరు గలుగుట తటస్థించినది.

కాని యా కాలపు టాంధ్రరాజుల శాసనములన్నియు ప్రాకృతముననే యుండుటచేత ఇప్పటి మన యాంధ్రము ఆ శాసనముల ప్రాకృతరూపమేనా యను సందేహము కలుగకపోదు. అట్లే తలచినవారును గొందఱు కలరు. కాని మన తెలుగుభాష యా ప్రాకృతముతో బోల్చిచూచినచో వీని కేవిధమగు సన్నిహితసంబంధము నున్నట్లగపడదు. ఆంధ్రరాజు లా కాలమున ప్రాకృతభాషకు దేశమున గల ప్రాబల్యముచేత దానినే రాజభాషగాను, మతభాషగాను నుపయోగించి శాసనముల నందు రచింపించియుందురేగాని, నిత్యవ్యవహారమున నీ దేశమునందలి జనులుగాని, యా రాజులుగాని ప్రాకృతభాష నుపయోగించి రనుట యెంతమాత్రమును సంభావ్యము కాదు. అప్పటికే ఆంధ్ర ద్రావిడములు ప్రాకృతములకంటె భిన్నభాషలుగా దలంపబడినవని భరతుని నాట్యశాస్త్రమును బట్టియు కుమారిలభట్టు తంత్రవార్తికాదులను బట్టియు తెలియుచున్నది.

కుమారిలు డా కాలమున సంస్కృత వైయాకరణులు పాంపు, చోర్, వయిరు మొదలగు ద్రావిడభాషాపదములకు సంస్కృత వ్యుత్పత్తులను కల్పించి యెట్లు అర్థకల్పనము చేయుచుండిరో చూపుటయే కాక, రాజన్ శబ్దము ఆంధ్రమున సంస్కృతమునందువలెగాక క్షత్రియపరముగాగూడ వ్యవహరింపబడుచుండెనని చెప్పి, వీనిని మ్లేచ్ఛభాషలుగా గ్రహించుటచే నివి ప్రాకృత వికారములని యాతని కాలమున దలంపబడెనని చెప్పుట కవకాశ మెంతమాత్రము నగపడదు.

కాని నన్నయకాలమువఱకును 'తెలుగు' ఆంధ్రపరముగా వాడబడినట్లు కానరాదు. రాజరాజు భారతమును దెనుగున రచింపు మనుటయు, నన్నయ "దెనుంగునన్ మహాభారత సంహితా

శచనబంధురు" డనుటయు తెల్లంబే కదా. అయితే ఇంతకాలమునుండియు దెనుగుభాష లేదనుట యుక్తము కాదుగదా. క్రీ. శ. ౭-వ శతాబ్దినుండి ఇది చాళుక్య చోళరాజుల శాసనములలో గానవచ్చుచునేయున్నను, అంతకుపూర్వపుశాసనములు తెలుగున లేకుండుటచేతను, ఆకాలపు శాసనములన్నియు ప్రాకృతసంస్కృతములందే యుండుటచేతను మన ప్రాచీనలక్షణకర్తలే గాక, ఆధునికభాషాపరిశోధకులలో గొందఱుకూడ ఆంధ్రము సంస్కృత ప్రాకృతభాషా భవమేగాని తద్భవభిన్నంబగు స్వతంత్రభాష కాదని తలచుట కవకాశ మేర్పడినది. ప్రాచీనలక్షణకర్తలు తత్సమ తద్భవవ్యతిరిక్తమగు 'దేశ్య' మనునది కొంత గలదని యైన దలచియుండ డాక్టరు చిలుకూరు నారాయణరావు ప్రభృతులగు నాంధ్రభాషా చరిత్రకారులు, ఈదేశ్య మనునదికూడ సంస్కృతప్రాకృతజన్యమే కాని వేఱు కాదనియు, దక్షిణదేశమున ప్రాకృతభాషారూపములు కాని స్వతంత్రభాష లనునవి లేనేలేవనియు నిరూపింప యత్నించియున్నారు. ఇట్లు తెలుగుతోపాటు తత్సజాతీయము లనదగిన తమిళకన్నడాదులను నితర దక్షిణదేశభాషలుగూడ ఆర్యభాషారూపములే గాని, దేశీయములగు స్వతంత్రభాషలు కావనవలసి వచ్చుచున్నది.

క్రీస్తుశకప్రారంభకాలమునకే తొల్కాప్పియ నార్ మొదలగువారిచే వ్యాకృతమై, విశేషప్రాచీన వాఙ్మయముతో గూడి భిన్నసంప్రదాయములంగల తమిళమునకును, నాకాలపు ప్రాకృతములకును సాజాత్య సంబంధమును కల్పించుట కేవలసాహసముగా గనబడక మానదు. క్రీ. శ. ఏడవశతాబ్దికి పూర్వ మాంధ్రమున శాసనములు లేకపోవుట ఆభాషయే లేదనుటకు గారణముగా జెప్పువారి వాదము కేవలనిరాధారము. అట్లే కానిచో క్రీస్తుశకారంభకాలమునందలి శాసనము లన్నియు ప్రాకృతమునందే యుండుటచేత నాకాలమున సంస్కృతభాష దేశమున లేదనవలసియుండును గదా. వాస్తవమున నాకాలమున బౌద్ధమతమునకును, ప్రాకృతభాషకును ప్రాబల్యము హెచ్చుగా నుండుటచేత నితరభాష లడుగంటినవి. లేదా, మరల వానికి రాజావలంబనము కలుగువఱకును మఱుగుపడియున్నవని చెప్పవలసియుండును. ౪-వ శతాబ్దినుండి సంస్కృత శాసనములును, ౭-వ శతాబ్దినుండి చోడచాళుక్యరాజుల యవలంబనమున తెలుగునందలి శాసనములును బొడ సూపజొచ్చినవి.

కాని ప్రాకృతభిన్నమును, దేశీయమునగు నాంధ్రభాషా స్వరూపచిహ్నములు ౭-వ శతాబ్దికి పూర్వమే అప్పటి సంస్కృత ప్రాకృతశాసనములలోని దేశీయములగు గ్రామనామములలోను, మఱి యితర పదములలోను మనము గుర్తించుట కవకాశము లేక పోలేదు. ముఖ్యముగా దక్షిణదేశభాషలకు ప్రత్యేకములు, సహజములును నై, ప్రాకృతభాషలలో ఆనాటికి బొత్తుగా లేనివగు ఱ కార, శకటరేఫలతో గూడిన పదము లనేకము లాప్రాచీనశాసనములలో గానవచ్చుటయే యీభాషల ప్రత్యేక వ్యక్తిత్వమును స్థిరపఱచుచున్నది. క్రీ. శ. ౬, ౭ శతాబ్దులకు పూర్వమునను, దరువాతనుగూడ నాగరలిపిలో వ్రాయబడిన సంస్కృతశాసనములలో నీదేశమునందలి గ్రామనామములను జేర్కొనవలసివచ్చుటకు సంస్కృతభాషలో లేని ఱకార ళకారములు నాగరలిపినదుమ ప్రవేశ పెట్టవలసివచ్చినది. నన్నయార్యుని కాలమున కీభాషలో 'ఱ'కార మంతరించి తత్స్థానమున 'డ'కారము నిలిచిన దని యాయాపదముల వ్యవహారమునుబట్టియు, తమిళకన్నడములలో నావర్ణమే యింకను నిలిచియుండుటనుబట్టియు మనము గ్రహింపవచ్చును. తమిళమున 'తిరునాథకున్రు' శాసనము క్రీ. శ. ౪-వ శతాబ్ది నాటి దని తలంపబడుచున్నది. అందు 'ఐంబత్తేఱ' అనుపదము 'ఱ' కారముతో గూడినది. తరువాతి తెలుగులో 'ఏబదియేడవ' అను నర్థముగలదై యున్నది. ఆనంద గోత్రజుడగు అత్తివర్మ గోరంట్లతామ్రశాసనమున క్రిష్ణబెణ్ణాతటమునందలి 'తాన్తికొన్త' అను గ్రామము పేర్కొనబడినది. ఇది ఇప్పటి గుడివాడతాలూకాలోని 'తాడికొండ' గ్రామము. రెండవ సింహవర్మ బుచ్చిరెడ్డి పాలెపుశాసనములలో 'విలువట్టిగ్రామము' పేర్కొన బడినది. శివస్కందవర్మ (II) ఓంగోడుశాసనమున 'కర్మరాష్ట్ర'మందలి పెనుకపఱ్ఱు గ్రామము పేర్కొన

బడినది. విషమసిద్ధి చీపురుపల్లి, తిమ్మాపురం శాసనములలో 'పటికివిషయే' అనియు, 'కాళోచుంకొన్న గ్రామస్థ' అనియు వ్రాయబడియున్నది. విక్రమేంద్రవర్మ చిక్కుళ్ల శాసనములలో "కెందులూరవాసకాల్ శిగోస్తంనామగ్రామం దత్తం" అని యున్నది. ఇట్లే నన్నయకు బూర్వమున గల శాసనములు పెక్కింటిలో చోఱ, పుళోలు, ఱిస్సి - మొదలగుపదము లనేకములు 'ఱ'కారసహితములు గలవు. ఇట్టివి వందలకొలదిశబ్దములు ఇతర ద్రావిడభాషాపదములతో సజాతీయములై కనబడుచుండ నివియన్నియు ప్రాకృతభవము లనుట యుక్తముగా గనబడదు. ఇంతేగాక నాగార్జునకొండసమీపమున దొరకిన యిక్ష్వాకులనాటి ప్రాకృతశాసనములలో 'మహాతలవర' శబ్ద మొకబిరుదముగా వాడబడియున్నది. ఇది తమిళమునందలి 'తలైవర్' శబ్దమునకును, తెలుగు 'తలవరి' (తలారి) శబ్దమునకును సంబంధించినదే యైనచో నానాటికే దేశభాషా శబ్దములు ప్రాకృతమునను గానవచ్చుచున్నవని తలంపవలయును.

క్రీ. శ. రెండవశతాబ్దినాటి 'టాలమీ' యను యవన దేశీయుడు 'ట్రిలింగాన్' అను దేశమును పేర్కొనియుండుటచేత నాకాలమున కాంధ్రదేశమున కీపేరు కూడ కలదని మనము నిశ్చయింపవచ్చును.

ఈకారణము లన్నిటిచేతను దక్షిణదేశభాషలన్నియు నుత్తరహిందుస్థాన భాషలవలెనే ప్రాకృతభవములని తలచుట యుక్తముగా గనబడదనియు, నా వాదమును బురస్కరించుకొని యీ భాషలలోని మూలధాతువులను, శబ్దములను, వ్యాకరణ ప్రక్రియానంతను, క్రియారూపములు, విభక్తి రూపములు మొదలగువానిని సంస్కృత ప్రాకృతములనుండియో, అది సాధ్యము కానపుడాధునిక ఉత్తరహిందూస్థానభాషలనుండియో యేర్పడినట్లు చూపయత్నించుట కొంత హాస్యాస్పదముగగూడ గన్పడునని యెంచదగియున్నది.

దక్షిణదేశ భాషల పరస్పర సంబంధమును గూర్చి పోప్, కాల్డ్వెల్లు, గ్రియర్సన్ మొదలగువా రిదివరలో విశేషపరిశ్రమ చేసినారు. ఈభాషా కుటుంబము స్వతంత్ర కుటుంబముగా నెంచబడవలయు ననుభావ మిటీవల నేర్పడియున్నది. కాని శ్రీ డాక్టరు నారాయణరావుగారి వాదముప్రకారమివి మరల నార్యభాషావర్గములో జేర్పబడవలసియుండును. వారీవాదమును బురస్కరించికొని ఆంధ్రభాషాచరిత్రము విషయమై చేసిన యపారమగు పరిశ్రమను ఆంధ్రలోకమే గాక యితర దక్షిణదేశభాషా పండిత లోకమంతయు గూడ గ్రహింపవలసిన యావశ్యకత యెంతేనియు గలదు. సంస్కృత వ్యాకరణఫక్కి ననుసరించి, తత్సాదృశ్య ప్రభావమున ప్రత్యయాంత భాషాదృక్పథము నుండి తమదృష్టిని మరల్చుకొనలేక కాల్డ్వెల్లు పండితునివలెనే మన డాక్టరుగారును కు, డు, ము, రు మొదలగునవి ధాతువులపై వచ్చు ప్రత్యయములు సంస్కృతమునందలి 'కృ' మొదలగు ధాతువులను జేర్చుటచే నేర్పడిన వనియు, నింక నితర క్రియా ప్రత్యయములు, విభక్తి ప్రత్యయములు మొదలగున వన్నియుగూడ సంస్కృత ప్రత్యయములనుండియో, ప్రాకృతాధునిక భాషాదుల ప్రత్యయముల నుండియో యేర్పడినట్లును జూపయత్నించినారేగాని, యీదక్షిణదేశ భాష లింకను 'సంశ్లిష్టపదరూప భాషలుగానే' యున్నవని గ్రహింపరైరి. ఆర్యభాషాతత్త్వ దృష్టితో చూచినపుడు ప్రత్యయములవలె గనబడు ద్రావిడభాషలలోని రూపములన్నియు సంస్కృతాదులలోవలెగాక చాల వఱకు సులభముగ ప్రత్యేకపదములయొక్క యవశిష్టరూపము లనియు, నవి సంకేతమాత్రములుగాక ప్రత్యేకము నర్థవత్తులే యనియు, ఇంచుక పరిశీలించినచో, మనము గుర్తింపగలుగుదుము. సంస్కృతభాషా వ్యాకరణముల ప్రభావమునుబట్టి యీ దక్షిణదేశభాషల సహజస్థితి మఱుగునబడిపోయిన ట్లయినది. ఆశబ్దజాలము, వ్యాకరణపద్ధతి, సంకేతములు నిందును ప్రవేశింపజేయబడుటచే నీభాషల సహజపరిణామక్రమమును జూపు మార్గము మరుగునబడిపోయినది.

కావున నార్యభాషాసంప్రదాయమార్గమును వదలి, ద్రావిడభాషాసంప్రదాయదృష్టితో నాంధ్రభాషాపరిణామక్రమము నన్వేషించినగాని ఈభాషయొక్క ప్రాచీనచరిత్రమును మనము గుర్తింపలేము.

ఇట్లాంధ్రభాషాచరిత్ర దక్షిణదేశభాషాసంప్రదాయానుకూలముగా రచింపబడవలసియున్నది. దేశీయపదముల వ్యుత్పత్తిక్రమమును దెలుపు నిఘంటువుకూడ నత్యావశ్యకము. దేశీయపదజాలమును బ్రోవుచేసి, వానినితరసన్నిహితభాషారూపములతో బోల్చిచూచినచో నీభాషల పరిణామక్రమమును దెలుపు స్వరసూత్రముల (Phonetic laws) నేర్పాటుచేసికొనుట కవకాశము కలుగును. సంస్కృతపదములు తెలుగులోనికి వచ్చునపుడు గలుగు వికారములను వివరించుట కాంధ్రలాక్షణికులలో గొందరు యత్నించిరిగాని, దేశ్యపదముల వ్యుత్పత్తినిగాని, వాని పరిణామక్రమమునుగాని సాధించుటకు వలయు ప్రయత్నము జరిగినట్లగపడదు. కావున నితరదక్షిణదేశభాషల సహాయమున ఛందోవ్యాకరణపదపరికరాదుల విషయమున నాంధ్రభాషలోని దేశిస్వరూపమును నిరూపించవలసిన యావశ్యకత కలదు. శ్రీపీఠికాపురాధీశ్వరుని యుదారపోషణమున వెలువడుచున్న సూర్యరాయాంధ్రనిఘంటువీకార్యమున దోడ్పడవలసినదే. అందు సజాతీయద్రావిడభాషాపదము లచ్చటచ్చట జూపబడినను, తత్సమతద్భవరూపములకే ఎక్కువ ప్రాధాన్యము జూపబడినట్లున్నది. ఈనిఘంటువు త్వరలో పూర్తిగా వెలువడి యాంధ్రభాషాభివృద్ధికి దోడ్పడు నని యాశించుచున్నాను.

మనదేశమున నీభాషాతత్వపరిశీలనమును బ్రారంభించినవారిలో బ్రధానముగా శ్రీ కె. వి. లక్ష్మణరావుగారిని, శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారిని పేర్కొనవలసియున్నది. లక్ష్మణరావుగా రచిరకాలములోనే గతించుటయు, శ్రీరామమూర్తిపంతులుగారి పరిశ్రమ యాంధ్రభాషాచరిత్రనిర్మాణమునందుకంటె భాషాసంస్కరణమువిషయమున ఎక్కువ వ్యయమగుటయు తటస్థించుటచే నపారమగు నామహనీయుల భాషాపాండిత్యమునకు దగిన ఫలితములు చేకూరకపోవుట యాంధ్రలోకమున కొక్క దురదృష్టమే యనవలసియున్నది. ఇటీవలనే వీరుకూడ దివంగతులయినందుకు దుఃఖింపని యాంధ్రభాషాభిమాని యుండడు. ఆమహనీయుని కార్యదీక్ష, తాను నిర్వహింపదలచిన పనినిగూర్చిన వ్యగ్రోత్సాహము, అపారమగు భాషాపాండిత్యమునకు దోడు ఆధునికభాషాతత్వపరిశోధనాపద్ధతులయందు నిరూఢప్రజ్ఞ, భాషాభిమానమును మించిన దేశాభిమానము, ఆధునికపరిస్థితుల కనుకూలమగు దేశభాషావాఙ్మయరీతులనుసంస్కరించుటయందు తీవ్రాభిలాష, ధారణాశక్తి, వాదపటిమ మొదలగునవి ఆయన యుపన్యాసములను వినువారిని ముగ్ధులను జేయకమానవు. మన దేశములో భాషాతత్త్వ పరిశోధన విషయమున నీ మహనీయు డొక నూతనయుగమును స్థాపించినా డనవచ్చును.

ఆంధ్రభాషా వాఙ్మయము లతిదీనస్థితిలో నున్న సమయమున వాని యభ్యుదయమునకు దోడ్పడిన విదేశీయులలో ఛార్లస్ ఫిలిప్ బ్రౌన్ దొరగారిని పేర్కొనక తప్పదు. ఆయన అనేకపండితుల నాదరించి, వారి సాయమున భారతాద్యనేక గ్రంథముల పాఠములనేర్చి, నిర్ణయించి ముద్రింపించి ప్రకటనచేసినాడు. ఆంధ్రభాషకు వ్యాకరణము, నిఘంటువు మొదలగువానిని రచించి, శాసన సంచయముచేసి, ఆంధ్రభాషకు మహోపకారము చేసిన విదేశీయపండితు డీతడు.

ఇటీవల బయలుదేరిన శాసనములనుబట్టి ఆంధ్రభాష, ఆంధ్ర వాఙ్మయము నన్నయతోడనే బయలుదేరిన వన్నవారి వాదము ఖండింపబడినది. శ్రీ లక్ష్మణరావు గారు శాసన పరిశోధన విషయమునే గాక ఆంధ్రద్రావిడములకు గల సంబంధమును బ్రతిపాదింపయత్నించినారు. ఆంధ్రభాషాచరిత్ర నిర్మాణమునకు ప్రాచీన శాసనములను సేకరించుటఅత్యావశ్యకము. ఈవిషయమున రాజమహేంద్రవరములోని ఆంధ్రచారిత్రక పరిశోధకమండలివారు, తెలింగానా లక్ష్మణరాయ పరిశోధకమండలివారు, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, భారతి, తిరుపతిదేవస్థానమువారు చేయుచున్న భాషాసేవ కాంధ్రులు తన్నిర్వాహకులపట్ల కృతజ్ఞులు కాకతప్పదు. వీని సహాయమున నన్నయకు పూర్వపు ఆంధ్రభాషావాఙ్మయస్థితిని దెలిసికొనవలయును. శైవవాఙ్మయమునను, పాల్కురికి గ్రంథములను దెలుపబడిన జానుదెనుగును, సామాన్య జనవ్యవహారమున పాటల రూపమున నుండిన వాఙ్మయశా

లను సేకరించి వాని తత్త్వమును, ప్రాచీనతను కనిపెట్టి, ఆంధ్రవాఙ్మయముయొక్క ప్రాచీనస్థితిగతులను, ఇతర దక్షిణదేశవాఙ్మయములతోడి పోలికలను నారయవలయును. చారిత్రకవిధానముతో గూడిన నూతన దృక్పథముతో భాషాచరిత్రము, వాఙ్మయచరిత్రములు రచింపబడవలసియున్నవి.

నూతన చారిత్రక పద్ధతుల సాహిత్యవిమర్శనము కూడ కొంత కొనలుసాగుచున్నది. శ్రీ వీరేశలింగం పంతులుగారీ నూతనయుగమునకు దారిచూపిరి. నూతన పద్ధతుల సాహిత్యవిమర్శనమునకు డా. సి. రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారము, వంగూరివారి వాఙ్మయచరిత్రము మొదలగునవి దారితీసినవి. సమగ్రమగు ఆంధ్రవాఙ్మయచరిత్రనిర్మాణమున కాంధ్రవిశ్వవిద్యాలయము ప్రోత్సహించుచున్నది. మిగిలియున్న తాళపత్రగ్రంథములలోని పాఠము లన్నిటితో సమగ్రమైన భారతము - నన్నయ భాగమైనను - పునఃప్రకటనము నొందవలసియున్నది. శ్రీ లక్ష్మణరావుగారు ప్రారంభించినదియు, శ్రీ దేశోద్ధారకులు కీ. శే. నాగేశ్వరరావుగారి యాదరమును బడసి పెంపొందినదియు నగు ఆంధ్రవిజ్ఞానసర్వస్వమును పూర్తిచేయు భారమాంధ్రులపై గలదు. ఆంధ్రసారస్వత మాధునిక ప్రకృతిశాస్త్రవిజ్ఞానమునుగూర్చిన గ్రంథములచే పెంపొందింపబడవలసియున్నది. ఆంధ్రవాఙ్మయమున నూతనయుగ మారంభమైనది. నూతనభావములు, నవ్యకవిత యనేకరీతుల పొడసూపుచున్నవి. వానిని మనము నిరసింపరాదు. గుణము గ్రహించి యానందింపవలయును. వీనినుండియే యుద్గ్రంథములు బయలుదేరును.

ఆంధ్రభాషాభ్యుదయసూచనలు పొడకట్టుచున్నవి. "పురాణమిత్యేవ న సాధు సర్వం." ఇది యొక సంధియుగము. పూర్వోత్తరసమన్వయదృష్టి పెంపొందవలయును. అట్టిదృష్టి నొసగి ఆంధ్రులందరు దేశభాషాభ్యుదయమును, ఆంధ్రరాష్ట్రమును సాధింపగల్గుటకు దగిన యుత్సాహమును భగవానుడు ప్రసాదించుగాక!





# వెఱ్ఱి నాగన్న



[ క థా ని క ]

## శ్రీ శివరాజు వెంకటసుబ్బారావు

["స్థాపితమైన అన్యాయంవల్ల ఆమోదింపబడిందే న్యాయం"—అనటోల్ ఫ్రాన్స్]

సాయంత్రం నాలుగింటికి మామూలు ప్రకారం చక్రాలబండితోసుకుంటూ, పీథమ్మట అమ్మకానికి బైలుదేరాడు నాగన్న. అది వొచ్చేపొయ్యే బళ్లతోనూ, కార్లతోనూ రద్దీగా వుండే బజార్లాంటి వీథి. అందులో అమ్మకాని కమర్చబడ్డ దుకాణా లుండడమేకాకుండా, కొనుక్కునే వాళ్లు కాపరంవున్న ఇళ్లుకూడా వున్నాయి.

"పటకాలు, జోళ్లు, టోపీలు, కర్ర సామాన్లు, చైనాబొమ్మలు..." అని పాడుకుంటూ, నాగన్న రోడ్లమీద నడిచేవాళ్లనీ, అరుగులమీద కూలబడ్డవాళ్లనీ ఎరుగున్న వాడవడంవల్ల వాళ్లకేసి తల వంకిస్తూ, "ఏవన్నా కొంటారా" అనే ప్రశ్నార్థకమైన చూపులు చూస్తూ నడవడం మొదలెట్టాడు. నాగన్నపాట నిత్యమూ పటకాలతో ప్రారంభమవుతుంది. మిగతా వస్తువులు వొకటి రెండుమాత్రం ఆకర్షణకోసం వుంచి, వాటిని గురించి తగ్గుకంఠంలో చివ్వర పాడతాడు. ఆపాటలో అప్పుడప్పుడు అతనిదగ్గర లేని సామానుల తాలూకు నామాలుకూడా వినిపిస్తాయి.

"పటకాలు, జోళ్లు, టోపీలు, చైనా బొమ్మలు, జర్మనీసామాన్లూ..."

నేడు యూరపులో జరిగే మహాసంగ్రామాన్ని గురించి నాగన్న కేమీ తెలియదని చెప్పొచ్చు. జర్మనీసామాన్ల అమ్మకంలో అపారమైన ఆకర్షణశక్తు లున్నాయని మొదలే తెలియదు.

చైనా, జర్మనీలు నాగన్నదృష్టిలో తన పాటకు కొత్త లయ కల్పించాయి. మళ్లా మార్చి పాడాడు.

"జర్మనీసామాన్లు, చైనాబొమ్మలు, పటకాలు, జోళ్లు."

ఇంతలో ౧౪-వ నంబరు డాబాలోంచి సైపిస్టు జాన్ భార్య మేరీ పిల్లాడికి పటకాలు కొనడానికి బైటికొచ్చింది. బండిలోంచి వో పటకా చేత్తో తీసుకుని "ఎల్లా యిస్తావ్?" అంది.

"ఆరణాలు"

"ఇచ్చే మాట చెప్పు"

"మీా రెప్పుడేనా బేరమాడారా? ఏదో బీదవాణ్ణి-యుద్ధంరోజులు..." అన్నాడు నాగన్న, అప్రయత్నంగా దృష్టిని ౪౯-వ నంబరు పోలీసువైపు మరలుస్తూ. ౪౯-వ నంబరుపోలీసు లారీ, రిక్షాల వెనకాల మాయమయ్యాడు.

"ఉండు, సైజు సరిపోతుందేమో చూసి వొస్తా" అని మేరీ పటకాతో లోపలి కెళ్లింది.

నాగన్న వెనకాలనుంచి "కదులు" అని వో శబ్దం వినిపించింది.

నలభైయేళ్లనుంచి నాగన్న చేసే పని కదలడమే! ఇంటినుంచి ఇంటికీ, వీధినుంచి వీధికీ, ఊరినుంచి వూరికీ కదలికదిలి, నాగన్న ముసలికాళ్లు కదుములు కట్టాయి. ఆశబ్దం దగ్గరికి సమీపించి మళ్లా "కదులు" అంది. నాగన్న వెనక్కి తిరిగిచూశాడు. ఆశబ్దానికి సృష్టికర్త ౨౯-వ నంబరుపోలీసు.

ఇంతలో మేరీ వొచ్చి సైజు కుదిరిందని, డబ్బుకోసం మళ్లీ లోపలి కెళ్లింది. చిరిగిన లాగూ ధరించిన వో ముసలాడు నాగన్న బండిని కుతూహలంగా పరీక్షించి "ఈపటకా యెంత?" అన్నాడు.

"ఇప్పుడే ఆవిడ ఆరణాలకి తీసుకుంది. ఇంకా నాలుగురోజుల్లో కొత్తరకాలు తీసుకొస్తా - మంచి చైనాబొమ్మలు, జర్మనీ సామాన్లు..."

నాగన్న భుజంపైన బరువైన హస్తం వాలింది. దాని యజమాని ౨౯-వ నంబరు పోలీసు.

"కదుల్తావా, కదలవా?" అన్నాడు శాంతిపోషకుడు.

"కదుల్తా, బాబుగారూ...ఆవిడ డబ్బులివ్వంగానే. కదల కేంజేస్తానూ..."

"కాదు, ముందు కదిలి మాట్లాడు. నడిరోడ్డుమీద నీకు అమ్మకం యేమిటి?"

"కోంపడకండి. ఇంకెప్పుడూ రా నిల్లా. మొన్నదినం అమ్ముకుంటి నీడ, ఆ పోలీసాయన యేమీ అనలేదు సరిగందా, పావలా యెట్టి పటకా కొన్నాడు."

"అవన్నీ అనవసరం. ముందు కదులు."

"డబ్బులు తీసుకోనీవయ్యా. నీక్కూడా కావాలంటే సవగ్గా యిత్తా"

"డబ్బుల్ గిబ్బుల్ జాంతానై. కదులు. ఇంకా యేమున్నాయ్, అమ్మకానికి?"

"మీ నోటంట సల్లంగా రావాల మాట. అల్లా అడకండి. భలే భలే చైనా బొమ్మలు, జర్మనీసామాన్లు..."

"ఏవీ చూపించు"

"ఏంటి?"

"అవే"

"అంటే?"

"అవే సామాన్లు" అన్నాడు ౨౯-వ నంబరుపోలీసు. 'జర్మనీ' అన్న పేరు ఉచ్చరించడానికి అర్హత లేదని పోలీసుకి తెలుసు. అతను ఆపేరు అనడంలో చూపిన అయిష్టాన్ని నాగన్న గుర్తించకపోలేదు. యుద్ధపు రోజుల్లో 'జర్మనీ' అనడంలో ప్రమాదం వుందని ౨౯-వ నంబరుపోలీసు పడ్డ బాధ వల్ల గ్రహించుకున్నాడు. అతని కింతటి గ్రాహ్యశక్తి నిచ్చింది పాండిత్యం కాదు; అది పామరత్వానికి సహజమైన మూఢదృష్టి.

"అవేనా ? అవేం లేవండి. ఇదిగో ఇది చూశారూ?" అని కంగారుపడుతూ, పోలీసుల కాకర్షణీయమైనవి తుపాకీలుకదా అనుకుని, బండిలోంచి పిల్లలు పేల్చుకునే తుపాకీని పైకి తీసి పోలీసుకి అర్పించుకున్నాడు.

పోలీసుసంశయం స్థిరపడింది. గూఢచారుడో, ద్రోహో—నాగన్న యీ రెండింటిలో యెవడో వొకడు. ౪౯-వ నంబరు పోలీసు ఆ పనిలోకి యుద్ధపు అవసరాన్ని బట్టి కొత్తగా ప్రవేశించాడు. అతను సోదాచేసి కనిపెట్టిన యీ నేరానికి గవర్నమెంటు అతని వుపకారాన్ని గుర్తించి ఆదరిస్తుంది. అంచేత "కదులు జైలుకి" అన్నాడు.

నాగన్నకి మతి చలించింది తాత్కాలికంగా.

"ఎందుకు?"

"ఈ తుపాకీ జర్మనీదేనా?"

"ఈ తుపాకీ జర్మనీది; యీ బండి జర్మనీది; నేను జర్మనీవాడిని ; నువ్వు జర్మనీ వాడవు; మనమంతా జర్మనీవాళ్లం..." అంటూ రామదాసు జైలులోని వున్మాదంలా మొదలెట్టాడు నాగన్న.

౪౯-వ నంబరుపోలీసు నోటుబుక్కు పైకి తీసి,—

"నీ పేరు?"

"జర్మనీ... కాదు, వుండండి. ఆ, నాగన్న"

"పద జైలుకి"

"ఆగవయ్యా. పిచ్చాడిని పట్టుకు మహా దబాయిస్తున్నావేం? వాడి మొహం వాడికేం తెలుసు, యేదో అమ్ముకునేవాడు! ఆ మాటకొస్తే నీకుమట్టుకు యేం తెలుసు?" అన్నాడు ధీమాతో వొక మధ్యవర్తి. అప్పటికప్పుడే నాగన్నబండిచుట్టూ కేక లేస్తూ అమ్ముకునే ఎనమండుగురు పిల్లలు, నలుగురు ముసలాళ్లు, యిద్దరు ముష్టివాళ్లూ మూగి యెగతాళిగా చూస్తున్నారు యీ దృశ్యాన్ని. వీథిలోజరిగే నాటకం చూడడానికి అన్నిరకాల మానవులకూ సమానమైన సరదా, వుత్సాహం వుంటుంది. రోడ్డు మీద హత్య, డీకొట్టడం, మాటలపోటీ, కొట్లు తగలడడం, కారుకింద సైకిలు పడడం—వీట్లో యేది జరుగుతున్నా ధర్మాత్ములు యివ్వబోయే పైసాలని సహితం వదులుకుని, చూడడానికి ముష్టివాళ్లు యెగబడతారు. ఇల్లాంటిఘట్టాలు లేకపోతే చాలామందికి కడుపునిండదు.

నాగన్ననిర్దోషిత్వాన్ని సమర్థించడాని కొచ్చిన మధ్యవర్తిని అంతా ఆశ్చర్యంతో చూశారు. నంబరు ౪౯ మళ్లా నోటుబుక్కు పైకితీసి, మధ్యవర్తిని పేరు చెప్పమన్నాడు.

"రాసుకో, చెపతా. మధుకరం, ప్లీడర్" అని అడ్రస్సుతోసహా సెలవిచ్చాడు.

"మీరుకూడా పదండి" అన్నాడు నంబరు ౪౯.

"ఛీ"

"డబ్బులు తీసుకోనిండీ... మరి నాబండి విషయం?" అన్నాడు నాగన్న, పోలీసు అతన్ని భుజంపట్టుకు లాక్కుపోతూంటే.

నాగన్నని ఆరాత్రి జైల్లో వుంచారు. మర్నాడు ఉదయం ప్లీడరు మధుకరం అతన్ని సమీపించి, జరిగిందంతా అసత్యం లేకుండా చెప్పమన్నాడు. నాగన్న అంతా చెప్పాడు.

"నాదగ్గర దాచి లాభంలేదు. 'నాకు జర్మనీ అంటే ఇష్టం' అని అన్నావా లేదా?"

"రామరామ!"

"ఛత్! నోరుముయ్! అన్నా నని ఒప్పుకో"

"అనందే?"

న్యాయవాదిసహితం అని వుంటాడని నమ్ముతూంటే అతను కాదని యెల్లా అన గలడు? నాగన్న మొదట 'జర్మనీ' అన్న పేరు వో పెధవావిడదగ్గరనుంచి విన్నాడు. ఆవిడ యెప్పుడూ "జర్మనీ సిల్వర్ సామాన్లు వున్నాయూ" అని అడిగేది. ఒకప్పుడు స్త్రీ లోకం కల్పించిన 'జర్మన్ సిల్వర్' అన్నమాట యిప్పుడు నాగన్న పీకముందు వురితాడై కని పించింది. పైగా ప్లీడరు తను అని వుంటా డన్న వాక్యం అనకుండానే అన్నట్లు వొప్పు కోటంలో వుంది న్యాయమంతా. అతనికి మెల్లిగా న్యాయం బోధపడుతోంది. ఏ నేరం చెయ్యకపోవడం, కోర్టులో చేశానని వొప్పు కోవడం, చెయ్యలేదని న్యాయవాదులు వాదించడం, అతన్ని విముక్తుణ్ణిచెయ్యడం— యిదీ అతనికి బోధపడ్డ న్యాయం, అంచేత వొప్పుకున్నాడు.

ఆదినం నాగన్న కేసు విచారణ అరంభ మైంది. ౪౯-వ నంబరుపోలీసు జరిగిందంతా చెప్పి, నాగన్న తనని మొగతాళిచెయ్యడం కోసమే తుపాకీ చూపించాడనీ, మేరీతో "యుద్ధంరోజులు" అని అన్నాడనీ నిదర్శ నాలుగా చెప్పాడు.

చివరికి నాగన్నని చెప్పమన్నారు.

"నువ్వు మేరీతో యెందుకన్నావ్?" అన్నాడు కిరీటంతరఫు న్యాయవాది.

"ఏమని?" అన్నాడు నాగన్న.

"అదే"

"అంటే?"

"నువ్వు యేది అనడంవల్ల యిక్కడి కొచ్చావో అది"

"నే నిక్కడి కెందుకొచ్చానో యింత వరకూ నాకు తెలియదు. ప్రొద్దున్న మా మధుకరంగారు చెప్పినదాకా..."

అంతా మధుకరంకేసి చూశారు. మధుకరం నాగన్నకేసి చూసి "తప్పు. చెప్పద్దు" అన్నట్లుగా వేలు ఆడించాడు. నాగన్న మాట్లాడలేదు.

కిరీటంవైపుప్లీడరు మేజిస్ట్రేటు కేసి "చెప్పనా" అన్నట్లుగా చూశాడు. మేజి స్ట్రేటు తలపంకించాడు.

"నువ్వు 'నేను జర్మనీవాడను' అని అన్నావా లేదా?" అని బిగ్గరగా అడిగాడు.

"నేను, నేను జర్మనీవాడను అని అన్నాను. నేను..." అని నాగన్న తబ్బిబ్బుపడ్డాడు. అస లతని వుద్దేశం "జర్మనీవాడను అని అన లేదు" అని అనాలని. కోర్టువాతావరణంలో ద్రోహులు, దొంగలు — వీళ్లచేతకూడా సత్యం చెప్పించే శక్తి వుంది.

అంతా బిగ్గరగా నవ్వారు. యథార్థం బైటపడింది. నేరం స్థిరపడింది. శిక్ష: అయిదు రూపాయలు జుల్మానా, తొమ్మిదిదినాలు జైలువాసం.

౨

నాగన్న తొమ్మిదిదినాలు తన సామాన్ల బండి యేమైందా అని ఆలోచించుకుంటూ గడిపాడు. ప్లీడరు మధుకరం చాలా జాలి గుండెకలవాడు. నాగన్నకి అయిదురూపా యలు ధర్మంచేశాడు, జుల్మానా యిచ్చుకో లేడని.

"ఐతే, నా సామాన్ల బండిగతి?"

"దానికేం, అది క్షేమంగా వుంటుంది"

"బాబూ, మీరు చేసిన మేలుకి దండాలు. కాని నేచేసిన నేరం యేంటండీ? 'జర్మనీ వాణ్ణి' అంటే తప్పేంటండీ?"

"ఓస్, నీకు తెలియనట్టు! ఏడిశావ్. ఇంకెప్పుడూ అల్లా అనకు. ఇదే నేరం మళ్లా చేస్తే నిర్ణయంలేకుండా శిక్షవిధిస్తారు."

ఇంకా నాగన్న సంశయం తీరలేదు. అతను చేసిన నేర మేమిటో యింతవరకూ బోధపడలేదు. కాని అతని దృష్టిలో న్యాయ వాదులు చాలా మంచివాళ్లుగా తోచారు.

## 3

జైలువాసం పూర్తిచేసి నాగన్న మళ్లా తనబండి సామాన్లతో వీథులమ్మట కదలడం మొదలెట్టాడు. కాని అతను జైల్లో వున్న పదిరోజుల్లోనూ పరిస్థితులు మారిపోయాయి. అతనికి అమ్మకాలు తగ్గాయి. అతని సంపాదన రోజుకి అణాలోకి దిగింది. ఒక్కొక్క రోజున అదీ లేదు. లోకంలోని ధనమంతా యేమైందా అని నాగన్నకి పెద్ద అనుమానం బయలు దేరింది.

"పటకాలు, టోపీలు, పిల్లలసామాన్లు..." అని మళ్లా పాట సాగించాడు. ఈసారి పాటలో మాధుర్యం, లయ లేవు. క్రైస్టు జాన్ భార్య మేరీ గుమ్మంలో నిలబడింది.

"అమ్మగారూ, నా కివ్వాల్సిన ఆరణాలూ యిప్పిస్తారూ?" అన్నాడు నాగన్న దీనంగా.

"నీకు నేనేమీ యివ్వక్కర్లేదు. జైళ్లల్లో కాపరంవుండే దొంగచచ్చినాడికి అమ్మకం యేమిటి, పో" అని తలుపు ఢామ్మని వేసింది.

అప్పటికి సాయంత్రం నాలుగైంది. వర్షం ప్రారంభించింది. నాగన్న పోతూంటే వీథివెంబడివారంతా అతనికేసి ఆశ్చర్యంగా చూడడం మొదలెట్టారు. అతడు దోషి, నేరస్థుడు, జైలుతో పరిచయం వున్న వాడు. ఇంకేం కావాలి జనానికి? వీథులో అంత కంటె కుతూహలమైన వ్యక్తి వుండబోడు. చిరిగిపోయిన చొక్కా వ్యక్తి నాగన్న బండి లోంచి ఒకటోపీ తీసి నెత్తిమీద పెట్టుకుని "టర్ టర్" అని నడిచాడు. నాగన్న బ్రతుకు హేళనకింద మారిపోయింది. హేళన యెంతైనా భరించొచ్చు, అమ్మకా లుండి నాలుగు రాళ్లు గడించుకుంటే.

సాయంత్రం ఏడుగంటలు కావొస్తోంది. నాగన్న అణా కాసు చూసి వారంరోజులు కావొస్తోంది.

అతనికి జీవితంమీద విరక్తి పుట్టింది. స్వేచ్ఛమీద గురితప్పింది. అతను జైల్లో గడిపిన దినాలే హాయిగా వున్నాయి. సమయాని కింత అన్నం పెట్టేవాళ్లు. ఎవళ్లూ అతన్ని చూసి ఆక్షేపించలేదు. కాపలా వాళ్లు అప్పుడప్పుడు అతన్ని చూసి తల పంకించి క్షేమం తెలుసుకుంటూ యెంతో పరిచయం చూపించేవాళ్లు. సర్వవిధాలా తన ఈ బ్రతుకుకంటె జైలుజీవనం వుత్తమమైంది. పైగా జైలుశిక్షపొందడంకంటె యీలోకంలో అతనికి సులభమైన కార్యం వేరే కనిపించ లేదు.

అడుగో ఎదురుగుండా రోడ్డుమధ్యలో నిలబడివున్నాడు 36-వ నంబరుపోలీసు. నాగన్న అతని దగ్గరగా నడిచి—

"నేను జర్మనీవాడిని. ఏం చేస్తావో చెయ్యి" అన్నాడు.

౫౬-వ నంబరుపోలీసు మాట్లాడలేదు.

"నాబండిలోవి జర్మనీసామాన్లు, నేను జర్మనీవాడిని. కాబట్టి నన్ను జైల్లోపెట్టు. నాపేరు రాసుకో" అన్నాడు, మళ్లీ నాగన్న.

౫౬-వ నంబరుపోలీసు బిగ్గరగానవ్వాడు.

"చాల్లేరా వేషం. నీలాంటివాళ్లని నేను చాలామందిని చూశా. పో, అమ్ముకో" అన్నాడు ౫౬-వ నంబరుపోలీసు.

ఈ పాడు ప్రపంచంలో మనకి కోరుకున్నా అన్యాయం జరగదు.



# మాంచాల

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

ధీరభృంగము తొంగిచూడని
తీయసంపఁగి మొగ్గతీరున
పగలు రేలును నెట్టుచుండెను
పడతి మాంచాలా.

కొమ్మ లన్నియు పల్లవింపగ
కూయు కోకిలపాటకాండ్రను
అలకించియు చెమ్మగిల్లవు
అతివనడిప్రాయపువగల్.

స్నానచందనకుందమాలా
శయనలీలాసుఖమయములకు
గ్రీష్మసాయంసమయములు తోఁణి
కింప వాచెలిరాగముల్.

కన్నెతొలకరివిభ్రమములకు
కట్లు తెగి తబ్బిబ్బులాడుచు
మింటబాఱెడి ఘనుల చాపల
మంట దింతయు కామినిక్.

మైల విడిచిన నల్లకోకను
మఱల మెఱసెను పూలచుక్కలు
నాది నా దని దిక్కితంబిను
లూది లాగగ నలుకొనల్.

ఎంత వేచిన తెల్లవాఱక
యెదుగు కార్తికరాత్రులేమో!
కాలహాతకుని చేతిపాశము
ఖాల పోలిక కనబడెన్.

నాగులేటి తరంగమంగళ
నాదముల శ్రుతి మాఱిపోయెను
ఎన్నడెఱుఁగని కళవళము దం
డెత్తె నాయమచిత్తమున్.

నిదురయందును సుంత చెఱగని
నిండుకుంకుమపువ్వుతిలకము
ఉన్నదో లేదో యటంచును
ఉలికి చూచెను అద్దమున్.

'వీరవనితల పసుపుబొందెకు
వేయుత్రుంపు' లటన్నసామెత
మాటిమాటికి స్మృతిపథంబున
కాటువేసెను ఆయమన్.

కోటబురుజులపై నగారా
గాటముగ మ్రోగెను యథావిధి
వీట సందడిమాత్ర మతిశయ
విహ్వలంబుగ వినబడెన్.

వీరకర కంకణ ఝణంఝణ
భూరిరణ కింకిణి ధణంధణ
నింగి అరవగ నేల మొరయగ
నెగడెఁ బో అంతంతకున్.

ఆత్మలో ఆరాటమున కపు
డామహాక్షోభంబు తోడుగ
సైపజాలక తొంగి చూచెను
చాన కిటికీముఖములన్.

రంగురంగుల రంగవల్లిక
లంగణంబుల దీర్చ రాకరును
వీధు లన్నియు చిన్నవోయిన
విధముగా నపు డగపడెన్.

ప్రాక్సువాసిని సమయబంధము
వ్రయ్య రక్తము చిందె ముఖమున
సూర్యచంద్రుల రాకపోకల
నుడివడెన్ భవితవ్యముల్.

అడలు హృదయము నాపుకొంచును
అశివ ప్రాతర్విధివిధానము
లాచరింప విశాలమణిసౌ
ధాంత రాళములకు జనెన్.

* * * *

బ్రహ్మనాయని శూరవర్గము
పట్టె వీరస్వర్గమార్గము
భూమి క్రక్కినభంగి కారెమ
పూడి మున్గెను నెత్తుటన్.

కంచురథములు క్రుంగిపోయెను
గండుగుజ్జము లలసి మ్రొగ్గెను
మేటివిలుకాం డ్రెగిరిపోయిరి
గోట మీటినతీరునన్.

విధి విశృంఖల దుర్విపాకము
పృథివి నెవ రెదిరింపగల్గిరి ?
ఎఱుకముండట విల్లు లేవక
వెఱగుపడెనట క్రీడియున్!

వ్రాలియార్చిరి రెడ్డినాయకు
రాలిసైనికు లుక్కుమీఱుచు
బ్రహ్మనాయని కార్ముకల్ తెగి
పడిరి కొండలకైవడిన్.

చేరె మాచర్లకు పరాజయ
శిథిలవార్తలు మెల్లమెల్లన
కాకులైనను తెచ్చునట దు
ష్కాలకలనోదంతముల్.



# హరిభట్టు

విద్యానగర చక్రవర్తులగు కృష్ణాచ్యుత రాయలకు సమకాలీనుఁడే కాని యంతకు ముందువాఁడు కాఁడు

శ్రీ డా. నేలటూరు వెంకటరమణయ్య



హరిభట్టుకృతములను పెక్కు కావ్యములు లబ్ధము లైనను, ఆంధ్రసాహిత్యపరిషత్తువారు నారసింహపురాణమును ప్రకటించువఱకును వాని కాలము నిర్ణయించుటకుఁ దగిన యాధారములు దొరకవాయెను. ఏతత్కారణముననే కందుకూరి వీరేశలింగం పంతులుగారు కవికాలము తెలియఁజాలక దావట్లాడి, అప్పకవికిఁ దరువాతివాఁ డని తాత్కాలికముగ నిర్ణయించుకొనిరి: "అప్పకవి యీ గ్రంథములనుండి (అప్పటికిలభ్యమైన వరాహ, మత్స్య పురాణములనుండి) లక్ష్యములను చేకొనకపోవుటచేత నీకవి యతనికిఁ దరువాత నున్నాఁడేమో యని యూహ కలుగుచున్నది. కాఁబట్టి తగిన యాధారములు దొరకువఱకును మన మిప్పటి కీకవికాలము క్రీస్తుశకము ౧౬౭౦-వ సంవత్సర ప్రాంత మని భావింతము." *

నారసింహపురాణపీఠికయందు లభ్యమైన నూతన చరిత్రాంశములను బట్టి వీరేశలింగముగారి యూహ సరియైనది కాదని నిశ్చయమగుచున్నది. ఈవిషయమును జర్చించి కీ. శే. ఓలేటి వెంకటరామశాస్త్రిగారు కవికాలము క్రీ.శ. ౧౫-వ శతాబ్దోత్తరభాగ మని సిద్ధాంతీకరించియున్నారు. "గనుక... హరిభట్టు ౧౫-వ శతాబ్దియం దుత్తరభాగమున నున్నవాఁ డనుటకు సందేహము లేదు. అట్లగుచో నీకవి శ్రీకృష్ణదేవ రాయల రాజ్యారంభకాలమునకు ముందే యల్లసాని పెద్దనామాత్యునికంటెఁ గొంచెము పూర్వుఁడుగానో, సమకాలమువాఁడుగానో యుండి యాధునిక కవుల కాదియందుఁ జేర్పఁబడుటకు బదులుగా మధ్యకవుల కాదినో, పూర్వకవులకుఁ గడపటనో చేర్పఁదగినవాఁ డగును"†

వెంకటరామశాస్త్రిగారి కాలనిర్ణయముగూడ నంగీకరింపఁదగినది గాదు. నారసింహపురాణ పీఠికయందు వచింపఁబడిన యంశములు హరిభట్టు వెంకటరామశాస్త్రిగారిచే నిర్ణయింపఁబడిన కాలమునకంటెఁ దరువాతివాఁడని తెల్పుచున్నవి. పీఠికయందలి యంశములను మొదట సంగ్రహముగాఁ బొందుపఱచి తరువాత నవి హరిభట్టుకాలనిర్ణయమున కెట్లు సాధనము లగునో తెల్పెదను.

హరిభట్టు భారద్వాజగోత్రజుఁడగు రామవిద్వన్మణి కుమారుఁడు. హనుమత్కటాక్షలబ్ధ వరప్రసాద సహజ సారస్వత చంద్రనామాంకుఁడు. అష్ట ఘంటావధాన పరమేశ్వరుఁడు. ఇతఁడు భాగవతపురాణమందలి యేకాదశద్వాదశస్కంధములను దెనిఁగించెను. నారసింహపురాణోత్తరభాగము నాంధ్రీకరించెను.. కాని యీ రెండవగ్రంథము నెవ్వరికిని సంకితము చేయకయే యాతఁడు మృతి నందినట్లు తోఁచుచున్నది. ఏలనఁ, గృతిపతియగు ప్రోలుగంటి

* ఆంధ్రకవుల చరిత్రము, పుట ౩౫౯.

† నారసింహపురాణము (ఆం. సా. ప. సంఖ్య ౧౫): సంపాదకీయోపోద్ఘాతము, పుటలు ౯-౧౦.

రంగమంత్రి హరిభట్టుసమాహ్వయుని రాఘవమనీషిని దన కొలువునకుఁ బిలువనంపి యీ తెఱంగున

"హరిభట్టు నిఖిలవిద్యాచతురాస్యుండు
రాజమాన్యుఁడు కవిరాజసుతుఁడు
నారసింహపురాణపూర్వభాగంబుఁ
జెదలువాఱ్జిన మొదలు సేయఁ
ప్రతిభ దలకొత్త నుత్తరభాగ మిప్పు
డంధ్రభాషను వచనకావ్యం బొనర్చ
నా ప్రబంధంబు నా పేర నంకితముగ
నీవు గావింపవలయుఁ గవీంద్రగణ్య!"

యని కోరెను. హరిభట్టే యప్పుడు సజీవుఁడై యుండినఁ దక్కువగ్రంథమును నాతని కుమారునిఁ దన కంకిత మిమ్మని రంగమంత్రి యడిగియుండెడు. అంకిత మొనర్చుటకు గ్రంథకర్తయే యర్హుఁడు గాని యితరుఁడు గాఁడు. మఱియుఁ గృత్యాద్యవతారికను నితరుఁడు రచియించవలసిన యవసర ముండదు. కావున ప్రోలుగంటి రంగయ రాఘవమనీషిని గ్రంథమును దన కంకిత మిమ్మని కోరుటకుఁ బూర్వమే హరిభట్టు మృతినందెనని తలఁచుట సమంజసముగ నున్నది.

రంగమంత్ర్యభీష్టమును నెరవేర్ప రాఘవమనీషి యంగీకరించి పీఠికను రచియించి యాతని కంకిత మొనర్చెను. స్వవిరచిత పీఠికయందు రాఘవమనీషి కృతిపతిపూర్వోత్తరము నిట్లు వర్ణించియున్నాఁడు:

వసిష్ఠగోత్రమున ప్రోలుగంటి తిప్పన పుట్టెను. అతఁడు ప్రౌఢరాయల దండాధీశుఁడు. కైరనాంబయం దాతనికి కొండన, నాగన లను నిరువురు పుత్రులుద్భవించిరి. వీరియందు పెద్దవాఁ డగు కొండన మల్లమ నుద్వాహము చేసికొని యామెయందు నరసన తిమ్మన లను పుత్రులఁ బడసెను. నరసన తిరుమలాంబను వరించి యామెయందు తిమ్మయ, వెంగళప్ప, ఓబయ, రంగయ, కొండయ లను నేవురు తనయులఁ గాంచెను. తిమ్మయ లక్ష్మమాంబను బెండ్లాడి సింగన, మాదనలను గనెను. వెంగళప్ప తిమ్మాంబను ధర్మపత్నిగఁ గైకొనెను. వీరికి నారసచివుఁడు పుట్టెను. ఓబయ గోపమాంబను వివాహమాడి యామెవల్లఁ జెన్నన, తిమ్మన లను కొడుకులను బొందెను. రంగయ దండనాథుఁడు. ఇతఁడు నందెల చినఓబనాథుని మంత్రి; నారసింహ పురాణ కృతిపతి. ఇతని భార్య హనుమమ. కొండయ రంగాంబను వరియించెను. ఈ యైదుగురు సోదరుల పినతండ్రియగు తిమ్మన హరిభక్తుఁడు. అతనికి అక్కమాంబయందు తిమ్మయ, అప్పయ, నరసయ, తిర్మలయ లను నలువురు పుత్రులు జనించిరి. ఇంతవఱకును ప్రోలుగంటి కొండయవంశము వర్ణింపఁబడెను. ఇఁక నీతని యనుజుఁడగు నాగనసంతతినిగూర్చి చెప్పవలసియున్నది. ఇతఁడు దేవమను పెండ్లియాడెను. వీరి పుత్రుఁడు చెన్నయ. ఇతఁ డొక దొడ్డకవి. పెక్కు గ్రంథములను రచించె. అందు నారసింహపురాణమును ద్విపదగా రచియించి యహోబలపతి కంకిత మిచ్చెను. బాలభారతమును నాంధ్రభాషయందు వ్రాసెను. శౌరిచరితమును జక్కుల కథగఁ జెప్పెను. మఱియుఁ బెక్కుకృతులను రచించి నరసింగరాయలచే నగ్రహారములను, వివిధార్థములను గొనెను. ఇతని ధర్మపత్ని కొండమ. వీరికి నరసన యను కుమారుఁడు గల్గెను.* (ఈ వంశవృక్షము వివరముగా ప్రక్కపుటయందు చూపఁబడియున్నది).

నారసింహ పురాణరచనాకాలనిర్ణయ సందర్భమున పై వంశస్థులయందుఁ బేర్కొనఁదగినవారు ముగ్గురే. ప్రథముఁడు వంశకర్తయగు తిప్పన. ఇతనిఁ గూర్చి రాఘవమనీషి యిట్లు వ్రాసియున్నాఁడు:

"ఆమంత్రీంద్రుఁడు ప్రౌఢరాయనృపదం
డాధీశసంపత్కళా
సామగ్రి న్విలసిల్లి మల్లి సుమభా
స్వత్కీర్తివిస్ఫూర్తి స
ద్ధామాసాధ్యమహోన్నతత్వమున సం
ధా యుక్తి దోశ్శక్తి వా
చామాధుర్యమునం బురావిభులతోఁ
జర్చించు వర్చస్వి యై"

* నారసింహపురాణము, ౧: ౨౦–౪౯.

ఇందువల్ల ప్రోలుగంటి తిప్పన ప్రౌఢరాయని సమకాలికుఁ డనుట నిశ్చయము. ఈ ప్రౌఢరాయలే విజయనగరమును క్రీ.శ. ౧౪౨౨-౨౩ సంవత్సరము మొదలుకొని ౧౪౪౬ వఱకును పాలించిన ఇమ్మడి ప్రౌఢ దేవరాయలని వెంకటరామశాస్త్రులవారు వచించిరి. * కాని ఇది సంశయాస్పదము. ఏలనఁగా విజయనగరమును ప్రౌఢరాయనామాంకితులగు రాజులు నలుగురు రాజ్యము చేసినట్లు తెలియుచున్నది. వీరియందు మొదటివాఁడు ఇమ్మడి హరిహరరాయల పుత్రుఁడగు మొదటి దేవరాయలు. కొన్ని శాసనము లితని ప్రౌఢదేవరాయ లని పేర్కొనుచున్నవి. † ఇతఁడు క్రీ. శ. ౧౪౦౬ మొదలుకొని ౧౪౨౨ వఱకును రాజ్యముసల్పెను. రెండవ వాఁడు క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వఱకును నేలిన ఇమ్మడి దేవరాయలు. ఇతఁడు పెక్కు శాసనములలోఁ దన పేరు ప్రౌఢదేవరాయ లనియును, ప్రౌఢప్రతాపదేవరాయలనియును జెప్పుకొనియున్నాఁడు. ఆధునికచరిత్రకారు లందఱు నితనినే ప్రౌఢదేవరాయ లని యందురు. మూఁడవవాఁడు ఇమ్మడిదేవరాయని కుమారుఁడగు మల్లికార్జునదేవరాయలు. ఇతఁడు క్రీ. శ. ౧౪౪౬ మొదలుకొని ౧౪౬౫ వఱకు రాజ్యమొనర్చినట్లు తెలియుచున్నది. పెక్కుశాసనములయం దీతఁడు ఇమ్మడిప్రౌఢదేవరాయ లనియును, గొన్నిటియందు ముమ్మడిప్రౌఢదేవరాయ లనియును పేర్కొనఁబడి యున్నాఁడు. నాలవవాఁడు విజయనగరమున క్రీ. శ. ౧౪౮౬ ప్రాంతమున నిమ్మడి విరూపాక్షరాయల యనంతరమును, సాళ్వగుండ నరసింహరాయలకుఁ బూర్వమును రాజ్యమును పాలించిన ప్రౌఢరాయలు. ప్రౌఢరాయనామధారులగు నీనలుగురురాజులం దెవ్వరికి ప్రోలుగంటి తిప్పన సమకాలికుఁడో నిర్ధారించి చెప్పుటకుఁ దగిన యాధారములు నారసింహపురాణమునఁ గానరావు. కాని యాతఁడు క్రీ. శ. ౧౫ వ శతాబ్దము చివర నుండెనేమో యను నూహ పొడముచున్నది.




* నారసింహపురాణ సంపాదకీయోపోద్ఘాతము, పుట ౯.

† M. E. R 399 of 1926

ఇతనికి బాల్యవతరమువాఁడును, నారసింహపురాణకృతిపతియు నగు రంగమంత్రి క్రీ.శ. ౧౫౫౦ ప్రాంతమున నుండెననుటకు బలవత్తరమైన సాక్ష్యము గలదు. తరమునకు ౨౫ సంవత్సరముల చొప్పున లెక్కవేసి పరిగణించిన నితనికాలము క్రీ. శ. ౧౪౫౦ మొదలు ౧౪౭౫ వఱకని తేలుచున్నది. కావున నితని సమకాలీనుఁడు ముమ్మడి ప్రౌఢదేవరాయాపర నామాంకితుఁడైన మల్లికార్జునదేవరాయ లగును.

ద్వితీయుఁడు ప్రోలుగంటి తిప్పనామాత్యుని పౌత్రుఁడు చెన్నకవీంద్రుఁడు. అతఁడు పెక్కు గ్రంథములను రచించి నరసింగరాయల మెప్పు వడసి యాతనివల్ల అగ్రహారములను, వివిధార్థములను గొనినట్లు నారసింహపురాణపీఠికయం దున్నది; కాని యా నరసింగరాయ లే నరసింగరాయలో? విజయనగరమున క్రీ. శ. ౧౪౮౫ మొదలు ౧౫౦౯ వఱకును నలువురు నరసింగరాయ నామధారులు రాజ్యము చేసిరి: (౧) సాళ్వనంద నరసింగరాయలు. ఇతఁడు క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమునఁ జంద్రగిరిగద్దె యెక్కెను. ౧౪౮౫-వ సంవత్సరమున విజయనగరమును పరిపాలించుచుండిన ప్రౌఢరాయని వెడలనడచి సింహాసనము నాక్రమించుకొని ౧౪౯౦-వ సం. పర్యంతమును సామ్రాజ్యము నేలెను. (౨) తరువాత నితని కుమారుఁడగు నిమ్మడి నరసింగరాయఁడు సింహాసన మధిష్ఠించి ౧౫౦౫ పర్యంతము ప్రభుత్వము నల్పెను. ఇతఁడు బాలుఁడు; రాజ్యాంగము నడుపుటకుఁ దగిన శక్తి లేనివాఁడు. కావున (౩) సర్వసేనాధిపతియగు నరసానాయకుఁ డీతనికి బ్రతిగ రాజ్యముఁ బరిపాలించుచుండెను. నరసానాయకునికి నరసింహరాయఁడన్న నామాంతరము గలదు. (౪) ఇతఁడు క్రీ. శ. ౧౫౦౩ లో శివలోకప్రాప్తుఁడు కాఁగా నితని పెద్దకుమారుఁడు ఇమ్మడి నరసానాయకుఁడు రాజ్యాధికారమును వహించి ౧౫౦౪-వ సం.న ఇమ్మడి నరసింహరాయని వధించి, వీరనరసింహరాయఁడను నామమును వహించి పట్టాభిషిక్తుఁడై ౧౫౦౯-వ సం.వఱకును రాజ్యపాలనమొనర్చి పరలోకగతుఁ డాయెను. ఇట్లు క్రీ. శ. ౧౪౮౫, ౧౫౦౯ సం.ల మధ్య విజయనగరమున రాజ్యపాలన మొనర్చిన నలుగురు నరసింగరాయలలో నెవ్వరు చెన్నకవీంద్రున కగ్రహారాదికముల నొసఁగిరో కనుగొనుట సులభసాధ్యము గాదు. కాని పైనఁజెప్పినట్లు ప్రోలుగంటి తిప్పన క్రీ. శ. ౧౪౫౦ – ౭౫ సం.లమధ్య నుండెనను విషయ మంగీకృతమేని యాతని మనుమఁడగు చెన్నకవి క్రీ. శ. ౧౫౦౦–౧౫౨౫ ల మధ్య వెలసెననుట యసమంజసము కాఁజాలదు. *

తృతీయుఁడు నారసింహపురాణ కృతిపతియగు రంగయ. ఇతఁడు నందెల చినయోబళరాజునకు మంత్రి. ఈ యోబళరాజు నారసింహపురాణపీఠికయందు ఇట్లు ప్రశంసింపఁబడియున్నాఁడు:

"సీ. తన మందిలాగ్ర ముద్దండారిమండల
ధూసరంబులకు దంభోళిగాఁగఁ
దన కృపారసము బాంధవసేవకాశ్రితో
ద్యానసీమకు వసంతంబుగాఁగఁ
దన చక్కఁదనము కాంతామనశ్చంద్రకాం
తములకుఁ జంద్రికోదయముగాఁగఁ
దన నీతివర్తన ధారుణీజనచాత
కంబుల కభ్రాగమంబుగాఁగ
వెలసె నీరాజు సముదగ్రబలసమగ్ర
కమకకర్కశదభుజపీఠకమితనరణి
యతఁడు నందెల నరసింగయాంతరంగ
తామరసహేళి చినయోబదానశాలి"

---

* నందిమల్లయ ఘంట సింగయలచే విరచింపఁబడిన వరాహపురాణ పీఠికయం దొక నరసింహవిజయపురాణమునకు నరసానాయకుఁడు కృతిపతి యైనట్లు తెల్పియున్నారు:

క. "వాణీకరవీణాలి, క్వాణరతికి వినయమతికి వరలక్ష్మికి
ల్యాణ నరసింహవిజయపు, రాణ కథారమణతానురాగస్థితికిన్." (వరా: ౧. ౭౬)

కాని ప్రోలుగంటి చెన్నప్రధాని గ్రంథమునకుఁ గృతిపతి యహోబలపతి యనుటచే నివి రెండును వేర్వేరు గ్రంథములని తేలుచున్నది.

ఈపద్యమువల్ల ప్రోలుఁగంటి రంగమంత్రి కొలిచిన ప్రభువగు చినయోబభూపాలుఁడు నందెలనరసింగరాజు కొమారుఁడని తెలియుచున్నది. మఱియు,

"అతఁడు హోవళిచినయోబాధిశౌవనీశ
బహుళసామ్రాజ్యధౌరేయమహామనిపుణ
విపులబాహార్గళాటోపవిజితభుజగ
సార్వభౌముండు రంగయసచివఘనుఁడు."
—నారసిం. ౧:౫౧.

"హోవళిచినయోబాధిశవసు
ధావల్లభమంత్రివర్య" (౧:౭౩౨)
"హోవళిచిన్నయోబాధీశ
రాధిపశేఖర సైన్యపాల" (౩:౨౦౩)

అను పద్యములు చిన్నయోబళభూపాలునకు హోవళిచినయోబళుఁ డను నామాంతర ముండె నని తెల్పుచున్నవి. నందెలవంశము ఆరవీటి బుక్కరాజు కొమారుఁ డగు సింగరాజుతో నారంభ మాయెను. సింగరాజువంశజులే నందెలవారైరి. రామరాజీయమున నిట్లు చెప్పియున్నది:

"సీ. ఆ బుక్కరాజేంద్రుఁ డబ్బళదేవి బ
ల్లాదేవి యను సతులను వరించి
యబ్బళదేవియం దాత్మజులను సింగ
విభుఁ డాదిగాఁగను బెక్కుఁ గాంచి
నందెల యొసఁగ నా నందను లాపురిఁ
దమకును నిజరాజధాని గాఁగ
నేలుచుఁ గులము నందెలపేర ధరిత్రిఁ
దనరఁగఁ బుత్రపౌత్రాభివృద్ధి
తే. నతిశయిల్లి రి... ... "*

కావున బుక్కరాజు సింగరాజునకుఁ బూర్వము నందెలవంశము లే దనుట తెల్లము. ఆరవీటి బుక్కరాజు సాళువ నరసింగరాయల సమకాలీనుఁడు.

"నరనాథమణి సాళ్వ నరసింహరాయ
నరపతుం డయి బుక్క నృపుఁడు వెలసె."
అని బాలభాగవతమందును,

"అతఁడు దను మెచ్చి పలికిన యఖిలదిశలఁ
జెలఁగి పొగడ సాళువ నరసింగరాయ
రాజ్యసంస్థాపకుం డయ్యెఁ బ్రౌఢి నార
వీటి బుక్కనరేంద్రుఁ డుద్ఘాటితారి."†

అని రామరాజీయమునందును నతఁడు సాళ్వ నరసింగరాయల చెలికాఁడనియును, రాజ్యప్రతిష్ఠాపకుఁ డనియును చెప్పఁబడియున్నది. సాళ్వనరసింగరాయలు క్రీ. శ. ౧౪౫౦ మొదలు ౧౪౯౦ వఱకును చంద్రగిరియందును, విజయనగరమునను దొరతన మొనర్చెనని పైనఁ జెప్పి యున్నాము. క్రీ. శ. ౧౪౬౨-వ సంవత్సరమున గజపతి కపిలేశ్వరుఁడు దక్షిణ దేశముపై దిగ్విజయయాత్ర వెడలి చంద్రగిరి మొదలైన పెక్కు దుర్గములను స్వాధీనపఱచుకొనెను. కాని యచిరకాలముననే యొడ్డసైన్యములను దఱిమి దేశమును సాళ్వనరసింగరాయలు మరల స్వాధీనము జేసుకొనెను. ఆర్వీటి బుక్కరాజు నరసింగరాయల రాజ్యమును స్థాపించిన దీసందర్భముననే యుండ వలయును. కృష్ణరాయల రాజ్యాభిషేక మహోత్సవమునకు జూడవచ్చిన రాజులలో "చక్కర విల్కాని చక్కందనము గల్గు చొక్కనూ వార్వీటి బుక్కరాజు" ఒక్కఁడని కుమారధూర్జటి తన కృష్ణరాయవిజయమున వ్రాసియున్నాఁడు. ఇది విశ్వసనీయము గాదు. వీలఁగా నార్వీటిబుక్కరాజు మనుమఁడగు రామరాజుతిమ్మరాజు వీరనరసింహరాయల సేనాధిపతి. మఱియొక మనుమఁడగు రామరాజు శ్రీరంగరాజు కుమారుఁ డగు నళియరామరాజు క్రీ. శ. ౧౫౧౫-వ సంవత్సర ప్రాంతమునఁ గృష్ణరాయల పుత్రికయగు తిరుమలాంబ నుద్వాహము చేసికొనెను. అప్పటి కాతఁడు యౌవనవంతుఁడు. తత్పూర్వ మాతఁడు గోలకొండ కుతుబుషాహిరాజ్యస్థాపకుఁ డగు సుల్తాను కులీకుతుబుషాహుని కొల్వునఁ గొంతకాల ముండెను. ఇతని యాధిపత్యమున నుండిన గోలకొండాక దుర్గమును కృష్ణరాయ లాడిచికొనఁగా కుతుబుషా హితనిపైఁ గలుషించి

* రా. రా. ౨౬౩.
† రా. రా. ౨౦౨.

## హోవళి చినయోబళరాజు గావించిన దానములను దెలుపు శాసనములు

| ప్రస్తావన | స్థలము | కాలము | దాత |
|---|---|---|---|
| ౧. స్థానికచరిత్రలు సం. ౧౫ పుట ౩౮౮ | సిరువోళ్ల గ్రామమునకు సంబంధించిన దేవలాపురము హనుమంతరాయని యాలయమునందు. | శా.శ. ౧౪౬౮ ప్లవంగ | నంకెల సింగరాజు<br>\|<br>నరసింహరాజు<br>\|<br>చిన అవుబళరాజు |
| ౨. ,, ,, పుట ౪౧౬ | సిరువోళ్ల ప్రాంతకోటకు పూర్వభాగమునందు చెఱువుకట్టకుపశ్చిమమునందు నృసింహదేవాలయమున. | ,, | ,, |
| ౩. ,, ,, పుట ౪౧౮ | యజ్ఞగుంట్లకోటలోని చెన్నకేశవస్వామియాలయమునకు నెదుట అరుగునందు బారుతునుకలుగ పగిలిన రాతిపలకమీఁద. | ,, | ,, |
| ౪. ,, ,, పుట ౪౨౦ | సిరువోళ్ల తాలూకా యజ్ఞగుడిదిన్నె గ్రామమున వేంకటేశ్వరుని దేవాలయమందు. | ,, | ,, |
| ౫. ,, సం. ౧౬ పుట ౪౨౧ | సిరువోళ్ల తాలూకా యాదాడి యగ్రహారముమధ్య ఉప్పునీళ్ల బావి యొద్ద. | ,, | ,, |
| ౬. ,, ,, పుట ౪౫౮ | క. దనవోలుసీమలోని గాడిదమళ్ల అగ్రహారమున కేశవస్వామియాలయముదగ్గర. | ,, | ,, |
| ౭. ,, ,, పుట ౪౫౯ | సిరివోళ్ల సీమలోని కల్లంపాడు గోపాలస్వామి దేవాలయ సమీపమున. | ,, | ,, |
| ౮. ,, ,, పుట ౪౫౮ | సిరువోళ్ల సీమయందలి పేరూరు విఘ్నేశ్వరాలయ సమీపమున. | ,, | ,, |
| ౯. ,, సం. ౧౫ పుట ౪౩౩ | మీఁది యుపలోపమందు. | శా. శ. ౧౪౭౦ కీలక | ,, |

తన కొలువునుంచి వెడలనడచెను. ఆటుతరవాత రామరాజు విజయనగరమునకు వచ్చి రాయలను మెప్పించి యాతని కూఁతు వివాహమాడెను. కావున, కుమారధూర్జటివచనమును విశ్వసించినచో మార్కోటి బుక్కరాజును, వారిని మునిమనుమఁడగు అళియరామరాజును సమకాలికులుగా నుండిరని యొప్పుకొనవలసి వచ్చును. బలవత్తరమైన సాక్ష్యము లభ్యమగువఱకును వీరి సమకాలీనత్వము నంగీకరించుటకు వీలుకాదు. ప్రస్తుత మార్కోటిబుక్కరాజు క్రీ.శ. ౧౫౫౦-౬౦ ప్రాంతములందు ప్రబలుఁడైయుండి, సాళువనరసింగరాయలకు రాచకార్యములందు బాసటయైయుండెనని తలఁచుట సమంజసము. నందెలవంశమీతనినాఁ డభ్యుదయమునకుచేతఁ దద్వంశకర్తయు, నీతని పుత్రుఁడును నగు సింగరాజప్పటికే పెరిగి పెద్దవాఁడయి యుండినట్లు తోఁచెడిని. కావున నందెలవంశము క్రీ. శ. ౧౫౪౦ సం. ప్రాంతమున నంకురించెనను తలంపు వాస్తవమునకు దూరము గాఁజాలదు.

హోవళి చినయోబళరాజు నందెలవంశకర్తయైన సింగరాజున కైదవతరమువాఁడైనట్లు సింగళి సూరనార్యుని కళాపూర్ణోదయమువల్లఁ దెలియుచున్నది. అందలి వంశవృక్ష మిది.*




హోవళి చినయోబళరాజు సదాశివరాయల రాజ్యారంభదశయందు సిరివోళ్ల, కోవెలకుంట్ల సీమలను పాలించుచుండెను. ఇతని దానములను దెల్పు శాసనములు పెక్కు కానవచ్చుచున్నవి. ప్రక్కపుటలోని జాబితాయందు వానినిఁ బొందుపఱచియున్నాను.

ఈ తొమ్మిది శాసనములవల్ల నందెల హోవళి చినయోబళరాజు శా. శ. ౧౪౭౬-౮౦ (=క్రీ. శ. ౧౫౫౪-౫—౧౫౫౮-౯) సంవత్సరములయందు ఇప్పటి కర్నూలు మండలాంతర్గతములగు సిరువోళ్ల కోయిలకుంట్లసీమలపై నధికారము చల్పుచుండెనని తెలియుచున్నది. తరువాత నెంతకాలమువఱకీతఁడు జీవించియుండెనో చెప్పుటకు వీలుకాదు; కాని యాతఁడు యుద్ధమున నిహతుఁడాయెను. శ్రీశైల పరిసరదేశముపై దొరతనము సేయుచున్న వెలుగోటి గనితిమ్మనాయనితో నీతనికి వైరము పొసఁగి యుతఁడాతనిఁ గదనమున వధించెను. తండ్రి పగదీర్చుటకై తిమ్మనాయని పుత్రుఁడగు నాయనప్ప దండెత్తి వచ్చి చినయోబళరాజును బరిమార్చెను. వెలుగోటివారి వంశావళియం దీవిషయము చక్కఁగ వర్ణింపఁబడియున్నది:

"అలవునఁ దాళజంఘులను
  హైహయులన్ ద్రుపదేంద్రుపుత్రునిన్
దోలి సగరుండు భార్గవుఁడు
  ద్రోణతనూజుఁడు ద్రుంచినట్లు వి
ఖ్యాలముగ సోమవంశజుని
  యోవని(వి)యోబళరాజు నాజిలో
నలిగి వధించెఁ దంత్రిపగ
  కై ధళి మావెలుగోటినాయఁడున్.
అరడిబోబ నృపాలుని
నావడిసేనాయనయ్య యసిధార దెగన్
గా వడిసె రంభ నైకాసె
యావడిసేయంగ దివిజు లక్కడ చెదరన్." †

కాని ఈతని శాసనములు క్రీ. శ. ౧౫౫౮-౯ సం. మునకుఁ దరువాతఁ గాన్పించుటలేదు. ఏతత్కార

* కళా. ౧: ౨౪-౪౦.

† వెలుగోటివారి వంశావళి, పుటలు ౨౫౪-౫౫.

నాచేఁ బరిష్కృతమై మదరాసు విశ్వవిద్యాలయ చారిత్రకశాఖ నెం. ౬ రు బుల్లెటిన్‌గాఁ బ్రకటింపఁబడిన వెలుగోటివారి వంశావళి పీఠిక ౪౫-౬ పుటయందు హోవడి యోబళరాజును వెలుగోటినాయనయ్య క్రీ.శ.౧౫౪౬-౭

రచయితయొక్క లోకోత్తర ప్రతిభను హృదయంగమ మొనర్చుకొనుటకు ద్రష్టమగు హృదయసంస్కార ముండవలయును. తన సంస్కారముకొలఁది పాఠకుఁడు విషయావగాహన చేసికొనఁగలఁడు. అక్షరరమ్యత నెఱిఁగెనమాత్ర, శబ్దార్థపరిజ్ఞాన మలవడినంత, శతాధికగ్రంథములను పైపైనఁ జదివినతోడ, వ్యాకరణసూత్రములను, శబ్దకోశములను జ్ఞప్తికోశమున భద్రపఱచినంతే కవిమానసము చిక్కుననుట కల్ల. రాజహంసలైన పఠితలకే మధురభావక్షీరము లభించును. పెఱవారు రూపసామ్యమున మఱియు కొంచెకొంగలవలెఁ దత్త్వార్థపరిష్కారము గాక తన్నుకొనవలసినదే. ఉత్కృష్టరచయితల రచనములు వారికి 'మూకసద్గ్రంథాఖ్యాపనములు.'

భవభూతికవిచంద్రుని వాణిని సమకాలికు లెందఱర్థముచేసికొనిరి? ఈమధ్య నొక గాయకశిరోమణి కాళిదాసమహాకవిలో కళాప్రతిభ కొఱవడిన దన్నాఁడఁట. తిక్కనభావసృష్టికి ముగ్ధులగు చదువరు లెందఱు? పోతరాజు త్యాగధన నిధానమును గుర్తుపట్టిన మనీషుల సంఖ్య యెంత? వీరబ్రహ్మగురుని సామగేయమువంటి దేశికవితలోని తత్త్వప్రబోధమున కెన్ని మానసములు మేల్కొన్నవి? వేమనముని యాటవెలఁదుల గానమాధురిని జుఱ్ఱిన రసికకోటి యెక్కడ? వీరి రచనములు ప్రభాకలితములు, ప్రతిభాసమన్వితములును కావని యేసహృదయుఁడును చెప్పఁజాలఁడు. అయిన నేమి? కప్పకు పద్మసౌరభము రుచించనట్లు, లలితవీణాగానమునకు వానపాము తలయూఁపనట్లు, ప్రావృడ్జలదగర్జానినదమునకు కాకి మూఁకలు చెలఁగనట్లు అనురూప సంస్కారశూన్యులైన యెడఁదలు అమేయ భావభాండారము గోచరమైనను స్పందింపవు. ప్రతిభాగురువుల వాఙ్మయసాగరమును మన కొంచెపుబుద్ధితోఁ దచ్చఁ బూనుకొనుట మానికతో రత్నాకరమును గొల్చుటవంటిది. ఈ యసమర్థప్రయత్నమువలన సారస్వతాంబునిధినుండి యమృత ముదయించుటకు మాఱు హాలాహలము పుట్టును.

ఉదాత్తరచనమును గాంచి యుబ్బి శ్లాఘమికి మొదటి కారణము సంస్కార- సామర్థ్యములు కొఱవడుట యని చెప్పికొంటిమి. ఒండొక్క కారణపిశాచ మసూయ. మత్సరగ్రస్తులైన బోద్ధ గుణములకును దోషారోపణమునే చేయును. ఒకప్రక్క నైజముగా హృదయము భావరసకల్లోలినిలో మునకలు వెట్టి సత్యార్థప్రకటనమునకు తహతహపడుచున్నను, అసూయాపిశాచ మావహింప బాహ్యచేష్టలచేతను, మాటలచేతను సాటివాని రచనమున కవగుణమునే యారోపింప దుమక్కని దివురు నుంచును. ఈపరిస్థితులు మహాకవులనుసైత మెదుర్కొనకపోలేదు. రచనములో గుణ మున్న లోక మేల తలయూఁప దని సామాన్యముగాఁ దలంతుము. కాని పెద్దల యనుభవములో నిది వ్యత్యస్తమైనది. భర్తృహరికవీంద్రునంతటివాఁడు "బోద్ధారో మత్సరగ్రస్తాః" అని యేల విలపించెను? "ఉత్పత్స్యతే మమ హి కోపి సమానధర్మా" అని *భవభూతి యేల భవిష్యద్వేదాత నారాధింపవలసివచ్చినది?* "నారికేళఫలపాకమునఁ జనియైన భట్టహర్షుని కవితాగుంభనలు సోమరిపోతులు కొందఱయ్య లౌనని కొనియాడ నేరకుంట" మన మెఱుఁగనిదా? అంతేకాక యేల? "ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా" యని వ్రాసికొన్న చేమకూరపాకము నేఁటికిఁగదా లోకమునకు రుచించినది! ప్రత్యుదాత్తరచయితయెడను నిట్టి యాడిపోఁతలు లేకపోలేదు. అందుల కజ్ఞతానూయలే కతములు.

ప్రతిభాఢ్యుల రచనలలో శబ్దార్థములను మాత్రము వెదకికొనుట అంబునిధిని దఱిసి కాకిచిప్పల నేరికొనుటవంటిదే. ఉదాత్త గంభీర భావములు, ఉత్తమ మానవ జీవితరహస్యములు, పరాపర ప్రకృతితత్త్వమర్మములు ఉజ్జ్వలమణులవలె వాఙ్మయాంబుధిలో నలరారుచుండ, ప్రాథమికబోధ్యములైన శబ్దార్థములకు మాత్రము మురిసెదరా? విశ్వప్రకృతిలో నంతర్యామిరై ధ్యానగమ్యులై దివ్యలీలల నెఱపు జగన్నాథుని వదువున మహాకవులవాణిలో నంతర్గర్భితమైయున్న విమలభావరాశి నారాధింపలేని పఠితపఠన ప్రయాసము నింద్యమని మహాత్ము లనుచున్నారు.

శబ్దార్థములు రెండు నుపసర్జనీకృత స్వార్థములై యే గమ్యార్థప్రకాశమునఁ జరితార్థము లగునో, అయ్యది యే సకల సత్కావ్యోపనిషద్భూతమైన పరమార్థము. ఇటు వినుఁడు.

"సోఽర్థ స్తద్వ్యక్తిసామర్థ్య
యోగీ శబ్దశ్చ కశ్చన,
యత్నతః ప్రత్యభిజ్ఞేయౌ
........................"

—ధ్వన్యాలోకము.

కావ్యములందు వహ్నివలె వెలుఁగు సర్వప్రధానమగు నాయర్థమే (దీనిని వ్యంగ్యమని వైయాకరణులు, నాలంకారికులు నుడివియున్నారు) వాఙ్మనోపాసకునకు విజ్ఞేయము. తాదృశభావవ్యక్తీకరణసమర్థమగు నొకానొక శబ్దముమాత్రమే భావ్యమానము. ఈ నియమానుసారముననే మహాకవుల వాణి నవగాహింపవలయును. వారి గ్రంథజాలము నర్థము చేసికొనవలయును. లేకున్న విమర్శవాతూలము చెలరేఁగి, బుద్ధిని శంకాసంకుల మొనర్చి యడుగడుగునకును బ్రమాదము నావహిల్లఁజేయును. "సంశయాత్మా వినశ్యతి".

నేఁడు భారతరామాయణములమీఁదఁ గురియుచున్న విమర్శల వర్షమును మన మెఱుఁగుదుము. ఇందుకుఁ గారణము కవిహృదయము బోధపడమియే యనుట నిక్కము. మనకు సంబంధించిన దేశకాలపాత్రావస్థలతోడను, విజ్ఞానాభిరుచులతోడను ప్రాచీనులను బోల్చిచూచుకొనుట విమర్శకుఁ దగని లక్షణము. ఏయుత్తమప్రయోజనమునుగూర్చి మహర్షులా యుద్గ్రంథములను రచించిరో, అందు ఇతివృత్తమున కెంత ప్రాధాన్యమో, భావమున కెంత ముఖ్యతయో మనము గమనింపవలయును. భారతేతిహాసముచే శాంతరసమును, మోక్షపురుషార్థమును బ్రతిపాద్యములైనపుడు, రామాయణముచే మానవుని ఐహికాముష్మికపరమధర్మమును, ఆధ్యాత్మికతత్త్వమును బ్రతిపాద్యములైనపుడు అట్టివానిని కేవలము చారిత్రకదృష్టితోఁ బరిశీలించి యవి తుచ్ఛము లనుట యజ్ఞానము కాదా? గ్రంథగత రామాది శబ్దములచే విజ్ఞేయములైన విశిష్టార్థములను భావింపక, గ్రంథములోని యితివృత్తమప్రధానమనుచు, ప్రధానీభూతమైన పరమార్థమును విస్మరించి, విమర్శించు దృష్టిని భారతీయ సాహిత్యతత్త్వసాక్షాత్కారము నొందిన ప్రజ్ఞాశాలి నిరసింపఁడా?

చరాచరప్రకృతితో నైక్యమైపోయిన భారతీయకవుల ప్రతిభ అనిర్వచనీయము. మాంసపిండమైన శరీరమును, నశ్వరభోగముల ననుభవింప సాధనములైన యింద్రియములను, మనోవికారములైన కామక్రోధాదిగుణములను అతిక్రమించి, అంతర్దృష్టులై సర్వకారణుఁడగు పురుషోత్తమునితో దివ్యలీలలు సలిపిన యాప్రతిభ సాటిలేనిదై తనరారినది. కావుననే వారి యాశ్రమవాటికలందు మృగములును సహజానోన్యవైరములు వీడి, స్నేహభరితములై ఋషిమహాదర్శముల ననుగమించినవి. జడములైన వనస్పతులును, తదితర లతానికుంజద్రుమములును మైత్రీకరణములు పెనవేసికొన నాశ్రమస్థ ధర్మచారులతో నైక్యమంది, యాగంతుకకోటినిగూడ నుచితరీతి నారాధించినవి. చేతనాచేతనములను వశీకరించుకొన్న సంయమీంద్రుల ప్రతిభామహత్త్వ మట్టిది!

పుట్టకొక్కులవంటి రచనములు ప్రతిభాదరిద్రాణులనుండి విపరీతముగా పొటమరింపవచ్చును. గంటకు నూఱుపద్యములు కల్పనచేసెడి కవు లెందఱు లేరు? వారి రచనములందు విలువగల సర కెంతదక్కును? అయ్యవి సామాన్యజనతాహృదయములందుమాత్రము తాత్కాలికముగా నానందము నించి, మెఱుపుతీగలవలె మఱుక్షణముననే యాంధ్యమున ముంచివేయును. నక్షత్రములంబోలి ప్రకాశిలు రచనములు దేశకాలపాత్రావస్థలను లెక్కగొనక యుగయుగములవఱకును వెలుఁగుచుండును. కాళిదాసభవభూత్యాదుల రచనములు పాశ్చాత్యవిద్వద్వర్యుల నెందు కాకర్షించినవి? షేక్స్పియరు, మిల్టను ప్రభృతుల వాణికి మన మేల కైవారము చేయుచున్నాము? పారసీక కవీంద్రుఁడగు 'ఉమర్ ఖయ్యాము' కవితాసౌందర్యము నాస్తికవాదభూయిష్ఠ మయ్యును సర్వప్రపంచముచే జేజేలు పెట్టించుకొనెనె? ఫ్రాన్సువారి నవల

లెంను కగ్రేసరములైనవి? ఆధునిక జగత్తున రవీంద్రుఁడు, బెర్నార్డుషాల రచనములకు విశ్వమానవ హృదయ మేల స్వాగత మిచ్చినది? ప్రతిభతోఁడి పెద్ద టికమునవే గదా వాని కట్టిప్రశస్తి లభించుట!

ఔచితీయుతమైన కల్పనము గాని, అత్యద్భుత రసరామణీయకము గాని, అతిలోక భావమూర్తి నిర్మాణము గాని, శూలంకమవిమర్శ గాని, మహత్తర వర్ణనము గాని, గరిష్ఠాదర్శసృష్టి గాని, తత్తత్పాత్రల హృదయావస్థానిశిత ప్రకటనము గాని, అద్వైస్థితుల యనురూప ప్రదర్శనము గాని, చేతనాచేతనగత పరస్పరారోపణము గాని, దేవమానవాదినానాప్రాణిసంతతుల బహువిధ శక్తినిరూపణము గాని, సత్యచరిత్రల సముచిత సందర్భము గాని, ఉపదేశార్థ ముద్దిష్టమైన మృషాకథనము గాని (చరితము మృషయైనను లక్ష్యము తత్త్వార్థముకోసము గావున నిరూపిత విషయము మహత్తరమగుచు నిదియు పూజనీయమే), వినోద కథాకలాపము గాని, ఉత్తమ విషయ ప్రశంస గాని, ఉద్దిష్ట దేవతాస్తుతి గాని, ఏదైనను సరియే భావుకుల చిత్తములకు వచ్చునట్లు కళాధరితముగఁ దీర్పుటకు ప్రతిభాధురీణులకే చెల్లును. సమున్నత భావవిహాయసమున కెగసి, ఆత్మహృదయ మను విశాలనేత్రమును విప్పి, విశ్వ విశ్వమువిూఁదికి విశాల రమణీయమగు తమదృష్టిని బఱపి వీక్షించు నీ కవీశానులకు సాక్షాత్కారముగాని వస్తువు లేదు; గోచరము కాని రహస్యము లేదు. అనూననిర్మాణకౌశలమును హస్తగత మొనర్చుకొన్న వీరి సృష్టిమాట యింకఁ జెప్పెడి దేమి?



# అగ్నివీణ

శ్రీ శ్రీరంగం నారాయణబాబు

శబ్దార్థం
వాంఛించే
ఛాందసులం
అర్థ మనర్థ మని
అనుభవమె నగ్నంగా
ఆలాపన చేస్తానంటే
మూగవాని నాల్కంటాం
ఏం
ఏమంటావు ?
గాలికి గలగల
మ్రోగే పండుటాకు!
... ... ...
తెగిపోయిన
వీరుని
తలకాయ
ఖండించిన కోడిబుజ్జి
గాలికి
క్రిందపడి
గింజుకొనే
పండుటాకు

ఒకనాడు
జీవుల బ్రతుకులోని
పచ్చని
రాగాలాపం చేస్తే
తేలూపిన కవులు
జీవనతీరం
చేరిన యిల యీనాడు
జర నోట్లో కేకేస్తే
జడుసుకొని
దీనుల్లా
దిక్కులు చూస్తా రెందుకు ?
బ్రతుకంటే
చీకటిలో
దీర్ఘమైన చావు !
చచ్చి,
బ్రతుకు
మృత్యువులో
వెలుగున్నది
మూర్ఛన చేయర వీణ !

—'రుధిరజ్యోతి' నుండి.



 # రా జ రా జు 

[ చరిత్రాత్మక నాటకము ]

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

### మొదటి రంగం

అది సాయంకాలం.

అప్పటికి నాలుగు గడియల పొద్దు మాత్రమే వుంది.

పైని నల్లని ఆకాశం. కింద వినీలజలగంభీర మైన అఖండగోదావరి.

ఆ గోదావరిలో, ఆ ఆకాశం వొరుసుకుంటూ, నల్ల శాణపురాళ్లతో నిర్మితమై, వుక్కు కొండలవంటి బురుజులతో, రాజమహేంద్రపుర దుర్గం యొక్క పశ్చిమప్రాకారం, మహాసముద్రంలో బ్రహ్మాండమైన వోడల వరసలాగ భయంకరం అయిన్నీ చూడ సొంపుగా వుంది.

అద్దరిని, విశాలమైన యిసకతిప్పమీద, వందల కొద్దీ యువకులు చేరి, రకరకాల ఆటలు ఆడుకుంటున్నారు.

అక్కడ కోసున్నర వెడల్పు వుండిన్నీ, అది ఫాల్గున మాసం కనక, అరకోసెడు వెడల్పుమాత్రమే నీరు ప్రవహిస్తోంది.

ఝామ్మని విసురుతూ వున్న పైరుగాలికి నది అంతా తరంగకల్లోలం అయిపోయి వుంది.

పౌరులలో అనేక వృత్తులవారూ, అనేకరకాల వారూ, అనేకతాహతులవారూ వందల డింగీలలో వుయ్యాలా లూగుతూ నదీవిహారం చేస్తున్నారు.

ఆ డింగీల తెరచాపలు తెల్లని మేఘశకలాల లాగ మెరుస్తూ గోదావరి కొక వినూతనశోభ కూరుస్తున్నాయి.

ఆ డింగీల మధ్య, వొకటి రెండు మదపు టేనుగులు ఈతా లాడుతూ, తొండాలతో నీళ్లు చిమ్ముతూ, డింగీలలో వున్నవారికి దడా సందడీ కలిగిస్తున్నాయి.

కోటకి వుత్తరాన పరిచారకులు నదిలో వస్త్రాలు కడుగుతున్నారు.

కోటకి దక్షిణాన, స్నానాలు చెయ్యడానికీ, సంధ్యావందనాలు చేసుకోడానికీ విడివిడిగానూ, జంట జంటలుగానూ, గుంపులుగుంపులుగానూ బ్రాహ్మలు మూగుతున్నారు.

నీలాటిరేవు లన్నీ బిందెలతో వచ్చే పోయే జవరాళ్లతో కిక్కిరిసి వున్నాయి.

నీటిలో వున్న పడమటి బురుజులు తొమ్మి దింటిలోనూ నడిమిదానిమీద, పిట్టగోడకి ఆనుకుని,

రాజరాజనరేంద్రుడూ నన్నయభట్టూ కొంచెం యెడం యెడంగా తూర్పుమొగాలుగా నుంచుని వున్నారు.

రాజుకి వుత్తరాన, కొంచెం ముందుకి, అష్ట ప్రధానులలో వొకడైన మహారుద్రయ్య నుంచుని వున్నాడు.

రాజరాజు చేతిలో కొన్నీ, నన్నయభట్టు చేతిలో కొన్నీ, మహారుద్రయ్యచేతిలో కొన్నీ చిత్ర పటా లున్నాయి.

అప్పటికి, పటాలన్నీ ముగ్గురూ వొకమాటు తిరగవెయ్యడం అయిపోయింది. రాజు కోరికమీద, మళ్లీ వొక్కొక్కటే సవిమర్శంగా చూస్తూ నన్నయ భట్టు మంచి చెడ్డలు వివరిస్తున్నాడు.

రాజరాజు—(నన్నయ చేతిలో వున్న పటం చూస్తూ) ఆకళ్లు ఎంత ఆకర్షకంగా వున్నాయో చిత్తగించారా?

నన్నయ—చిత్తం మహాప్రభూ! ఈ కళ్లల్లో మంచితేజస్సుంది. ఈ చూపులు అతినిశితా లయి వున్నాయి. నిదానించగా, యీ రాజపుత్రి, వురిమిచూసి యెలాంటి వారినీ కూడా నీరుచేసెయ్యగల దని తోస్తూ వుంది.

రాజరాజు—ఇంకా సెలవిప్పించండి.

నన్నయ—ఈ యువతి కామిని అని నిష్కర్షగా చెప్పవచ్చు.

రాజరాజు—అది సరే. ఆకనుదమ్ములు మహాలక్ష్మీవిలాసమందిరా లనడాని కేమయినా ఆక్షేపణ వుందా?

నన్నయ — (పటం కేసి చూస్తూ వుంటాడు)

రాజరాజు — ఆభ్రూవిలాసమూ, ఆ నుదురూ, ముఖ్యంగా ఆచుబుకమున్నూ చిత్తగించండి.

మహారుద్రయ్య—భట్టారకుల వారింకా ఆ కనుదమ్ముల విషయం—(అర్థోక్తి)

రాజరాజు—(ఊరుకోండి అన్నట్టు తల వూపి మహారుద్రయ్యని వారిస్తాడు)

నన్నయ — (మహారుద్రయ్య కేసి చూస్తూ) ఏమి సెలవు?

మహారుద్రయ్య—నా జిజ్ఞాస తరవాత విన్నవించుకుంటాను. ముందు, ప్రభువువారికి, భ్రూవిలాసాదికం వివరించండి.

నన్నయ—చిత్తం. (రాజుతో) మహాప్రభూ! ఈ భ్రూవిలాసం అనన్యసాధారణంగానే వుంది. అయితే, ఇందులో వెనకతీత యెరగని పట్టుదలా, విరామం యెరగని కసీ ద్యోతకం అవుతున్నాయి.

మహారుద్రయ్య—(ఉలిక్కిపడతాడు)

రాజరాజు—సెలవిప్పించండి.

నన్నయ—విశాలమైన యీ లలాటం అసాధారణమైన కల్పనాశక్తిని స్ఫురింపచేస్తూ వుంది.

మహారుద్రయ్య — (రాజు కేసి చూస్తాడు)

రాజరాజు—చిత్తం.

నన్నయ—మలచినట్టున్న యీ చుబుకమే మొగానికి చక్కని కళ కూర్చింది.

రాజరాజు—దానివల్లనే ఆ మొగానికి, యిందాకా నేను మనవి చేసిన ఆ ఆకర్షకత్వం యేర్పడిం దని నావుద్దేశం.

మహారుద్రయ్య—(నన్నయతో) ప్రభువువారు—(అర్థోక్తి)

రాజరాజు—(మళ్లీ చూపులతో మహా రుద్రయ్యను నిషేధిస్తాడు)

మహారుద్రయ్య—చిత్తం మహాప్రభూ!

నన్నయ—(మహారుద్రయ్యకేసి ఓర చూపులు చూస్తూ శిరఃకంపం చేసి) తెలిసింది. అవగాహన అయింది. ఏలినవారి దృష్టిలో యీమె వరణీయ అని వున్నట్టుంది. (రాజుతో) ఇక వివరాలు చూడవచ్చునా?

రాజరాజు—చిత్తం, చూడవచ్చు.

నన్నయ—(పటం తిప్పి వెనకవేపున చూస్తూ) జక్కులదీవి మండలేశ్వరులు రామభద్రరాజులుంగారి కొమార్తె చిత్రాంగీ దేవమ్మగారు—(అని చదివి, రాజుతో) మనవి చెయ్యమని సెలవా?

రాజరాజు—అభ్యంతరం యేమిటి?

నన్నయ—(ఒక్కమాటు కళ్లుమూసుకుని ఆలోచించి) మహాప్రభూ! ఏవిధంగా చూసినా యువరాజులుంగారి గాంభీర్యం నేనెంతమాత్రమూ సమన్వయ పరుచుకోలేకుండా వున్నాను.

రాజరాజు—చిత్తం.

నన్నయ—వారి హృదయం యెదట వొకొక్కప్పుడు నవనీతం అతికఠినం అనీ, వొకొక్కప్పుడు వజ్రం అతిమృదులం అనీ అనిపిస్తూ వుంటుంది.

రాజరాజు—చిత్తం.

నన్నయ—మరిన్నీ, వారొకొక్కప్పుడు ఎంతో ఆశగా వుంటూ హఠాత్తుగా నిర్లిప్తు లవుతారు. విరక్తులుగా కనపడుతూ వొకొక్కప్పుడు గభీ మని ఆశాదృష్టులు పరుపుతారు.

రాజరాజు—చిత్తం.

నన్నయ—అదలా వుండగా — ఈ రాజపుత్రిని చూడగా, పాండవపట్టమహిషి ద్రౌపదీదేవమ్మవారు నాకు స్ఫురణకు వస్తూ వున్నారు.

రాజరాజు—ఇది అపూర్వమైన సంగతి.

మహారుద్రయ్య — అంతమాత్రమే కాదు— (అర్ధోక్తి)

నన్నయ—ఇంకేమి సెలవు?

రాజరాజు—(మహారుద్రయ్యతో) మీరుండండి. (నన్నయతో) తమ అభిప్రాయం సెల విప్పించండి.

నన్నయ—(ఒక్కమాటు మహారుద్రయ్యకేసి కొంచెం చురుగ్గా చూసి, తరవాత రాజుతో) మనవిచేసుకుంటాను. మనవిచేసుకుంటూనే వున్నాను.

రాజరాజు—అమ్మవారికీ, యీ రాజపుత్రికీ పోలిక యేమిటి?

నన్నయ — పట్టుదలా, కనీ ఈమెకి చాలా యెక్కువ అని చెప్పినప్పుడింకా వివరాలు అవశ్యకమా? మనవి చేసుకోడానికి నాకేమీ ఆక్షేపణ లేదు కాని— (అర్ధోక్తి)

రాజరాజు—సెల విప్పించండి.

నన్నయ—(మళ్లీ వొకమాటు పటం చూసి, మహారుద్రయ్యకేసిన్నీ చూసి, ఉద్రేకం అణుచుకుంటూ రాజుతో) ద్రౌపదీదేవమ్మవారి నిమిత్తాన రక్తనదులు ప్రవహించాయి. కురుకులం నిర్మూలమే అయిపోయింది.

రాజరాజు—(ఉలిక్కిపడి మహారుద్రయ్యకేసి చూస్తాడు)

మహారుద్రయ్య—(రాజు కేసి చూస్తూ) భట్టారకులవా రిప్పుడు పూర్తిగా కవితా సమాధిలో వున్నారు.

నన్నయ—(మహారుద్రయ్యతో నిక్కచ్చిగా) కనకనే నే నలా చెప్పగలిగాను. తమరు సరిగా గుర్తించారు.

రాజరాజు — (మహారుద్ర య్య తో) అదే కాదూ వారికి మహర్షి పదవి సమకూర్చి నది ? (నన్నయతో) తమరు మహాభారతం క్షుణ్ణంగా పరిశీలించి వుండడమూ, నాజన్మ సాఫల్యం నిమిత్తం తమ రిప్పు డది ఆంధ్రీక రిస్తూనే వుండడమూ—ఈ నన్ని వేళం తమ కలాంటి స్ఫురణ కలిగించి వుండవచ్చు. అయితే, నేను తమంత నిక్కచ్చిగా మనవి చేసుకోలేను; గాని ఈ రాజపుత్రి ప్రవృత్తి పురుషుణ్ణి వుడుకెత్తిస్తుం దనడానికి మాత్రం యేమీ సందేహం లేదు. ఆపురుషుడు నిగ్రహశక్తి లేనివా డయితే తమరు సెలవిప్పించింది కొంతవరకున్నూ సంభవించకా మానదు.

నన్నయ — కృతార్థుణ్ణి. ఏలినవారున్నూ అలాగే భావించడం.—(అర్ధోక్తి)

మహారుద్రయ్య—కాని భేదం మాత్రం స్ఫుటంగానే కనపడుతూవుంది. ప్రభువువారు, పురుషుడు నిగ్రహశక్తి లేనివా డయితేనే అది అలా సంభవిస్తుం దని—(అర్ధోక్తి)

నన్నయ—విన్నాను. ఇప్పుడు హెచ్చుగానూ బోధపడింది. కాని వొకరి నిగ్రహానుగ్రహ సామర్థ్యాలను బట్టి మారిపోయే దయితే అది ప్రవృత్తి అనిపించుకుంటుందా?

రాజరాజు — (మహారుద్రయ్య కేసి చూస్తాడు)

మహారుద్రయ్య — (రాజుతో) మనవి చేసుకుంటాను మహాప్రభూ! (నన్నయతో) అయితే, ముందు తమ రొకటి ఆలోచించగోరుతున్నాను. ఏమిటంటే? ఆ రాజపుత్రి ప్రవృత్తి అలాంటిదే అని వాదానికి స్థిరపరుచుకుందాం. అయితే, ఆమెను చేపట్టే రాజపుత్రుడు ఎలాంటివారినిన్నీ లోపు చేసుకోగలవా డయితే అప్పు డేమి చెప్ప వలసి వుంటుందీ ?

రాజరాజు —(నన్నయ కేసి ఉత్సాహంగా చూస్తూ శిరస్సు పంకిస్తాడు)

నన్నయ—(మహారుద్రయ్యతో) తమ పూర్వపక్షం సుసంగతంగా లేదు. ఎంచేతనంటారా ? "ఈమె ప్రవృత్తి యెలాంటిదీ" అని మన జిజ్ఞాస. "ఏమవుతుందీ?" అని కాదు.

రాజరాజు—పోనీ, వారి సందేహం కూడా కొంచెం తీర్పించండి.

మహారుద్రయ్య —(నన్నయతో, అంజలి బంధంగా) అదీ నా ప్రార్థన.

నన్నయ—(రాజుతో, తాపీగా) చిత్తం. అలాగే మహాప్రభూ! (మహారుద్రయ్య కేసి చూస్తూ, దృఢస్వరంతో) బలీయాలైన రెండు ప్రతికూలశక్తులకు ఏకత్రానున్నూ సంఘర్షణ తటస్థపడితే, అక్కడ, పర్యవసానం, అతిదారుణంగా వుంటుందీ; గాని వాటిలో వొకటి రెండోదానికి లొంగిపోవడం అంటూ కలగదు.

రాజరాజు — (మెరుపుకొట్టిన ట్టయి మహారుద్రయ్య కేసి చూస్తాడు)

మహారుద్రయ్య—(చెయ్యి తలా పూపుతూ రాజుతో) వారి కలా తోచింది.

నన్నయ — (మహారుద్రయ్యతో, కొంచెం చురుగ్గా) మరి తమకు?

మహారుద్రయ్య—(రాజు కేసిచూస్తాడు)

రాజరాజు—అలాగే కావచ్చు; కాని, మహాకవీ! మనం విషయదూరులం అయి పోతున్నాము. ఈరాజపుత్రికలలో, అబ్బా యికి, అనురూపురా లెవతె అని కదా మన జిజ్ఞాస?

నన్నయ—మన యిప్పటి డాపనిలోనే నిమగ్నుల మయి వున్నాము కాదూ మహా ప్రభూ?

మహారుద్రయ్య — (రాజుతో) నా వొక్క మనవి.

రాజరాజు—చెప్పండి.

మహారుద్రయ్య — ఇది విషయమూ విషయాంతరమూ అన్నది వ్యర్థచర్చ.

రాజరాజు—ఏమిా?

మహారుద్రయ్య—దీనికి ప్రయోజనం?

రాజరాజు—అంటే?

మహారుద్రయ్య — చిత్రపటాలకోసం వెళ్లినవారిలో యింకా యిద్దరు రావలసే వున్నారు.

రాజరాజు—అయితే?

మహారుద్రయ్య—వారు కూడా వచ్చి, వారు తెచ్చిన పటాలున్నూ పరిశీలిస్తే కాని మనం నిష్కర్షగా యేమిా తేల్చుకోడానికి వీలు లేదు.

రాజరాజు—(ఆలోచిస్తున్నట్టూ, మహా రుద్రయ్య భావం గ్రహించినట్టూ నటిస్తూ) అవునవును.

మహారుద్రయ్య — భట్టారకులవారికి మాత్రం యిది తెలవందా?

నన్నయ—(తల పంకిస్తూ మహారుద్ర య్యకేసి చూసి వూరుకుంటాడు)

రాజరాజు — (నన్నయతో) ఏమి సెలవు?

నన్నయ—ఏవిషయమై మహాప్రభూ?

రాజరాజు — మహారుద్రయ్యగారు చెప్పింది—(అర్ధోక్తి)

నన్నయ—విన్నాను. అయితే, యే విషయమైనా అమాత్యులకు తోచడంలో విశేషం వుంది.

రాజరాజు—తమకూ నాకూ కూడ అది—(అర్ధోక్తి)

నన్నయ — తెలవనే తెలుసు మహా ప్రభూ! ఆవిషయం తమరున్నూ మళ్లీ మళ్లీ సెలవిప్పించాలా? కాని రామభద్రరాజులుం గారి కొమార్త ప్రవృత్తి నిర్ణయించడం వొకటీ, యువరాజులుంగారికి వధువును నిర్ణ యించడం మరొకటీనీ. అక్కడక్కడ అభి ప్రాయం కొంచెం భేదిస్తూ వచ్చినా, యిప్పటి దాకా, మనం కొందరు రాజపుత్రికల ప్రవృత్తిని గురించి వొకవిధంగా పరిష్కారం చేసుకునే వున్నాము; కాని రామభద్రరాజు లుంగారి కొమార్త విషయం ఆలోచనలో వుండగా అమాత్యులవారు విషయాంతర ప్రస్తావనకి దింపారు. అది విడిచిపెట్టడానికి వీలులేని సందర్భాలున్నూ వారు కల్పిం చారు.

మహారుద్రయ్య—సత్యం సత్యం. చర్చ అంటే నాకు చాలా వుబలాట మనీ, అది

వుంటే నాకు నిద్రాహారా లక్కరలే దనీ ప్రభువువారికీ తమకిన్నీ తెలిసిం దే.

నన్నయ—అయితే, ప్రభువు ఒకానొక విషయమై ఏకాగ్రంగా పర్యాలోచన చేస్తూ వున్నప్పు డేనా తమ వుబలాటాలు ?

మహారుద్రయ్య—అది కాదు, తమరు—(అర్థోక్తి)

నన్నయ — తమ రింతకు ముందు వాడిన మాటల్లో వున్న దదే. ఇప్పుడు వేరే మాటలు వాడబోతున్నా రేమో?

రాజరాజు—ఏది యేమయినా మనం మళ్లీ దారిలోకి రానే వచ్చాము కదా ? (మహారుద్రయ్య కేసి కొంచెం చురుగ్గా చూసి, మళ్లీ నన్నయతో) అప్రస్తుత ప్రశంస లనుకున్న వాటికి తమరు ప్రత్యుత్తరా లివ్వ డం మాత్రం యెందుకూ ?

మహారుద్రయ్య—నేను మనవి చేసు కునేది—(అర్థోక్తి)

రాజరాజు—(మహారుద్రయ్యతో) భట్టారకులవారు సెలవిచ్చే పర్యవసానం మనం ఆలకిద్దాం.

మహారుద్రయ్య—దాని కేమి ఆక్షే పణా ? వారి ప్రసంగం యెవ రడ్డుకోగలరూ? కాని మళ్లీ ఆసంగతే అందుకుందా మంటే సోమయాజులవారి కనుష్ఠానసమయం ఆస న్నం అయిందికదా ?

రాజరాజు— (సూర్యబింబం కేసి చూ స్తాడు)

నన్నయ—(తానున్నూ సూర్యబింబం చూసి) మహారుద్రయ్యగారి సమయస్ఫూర్తి యిప్పు డే కా దెప్పుడూ అసాధారణమే. అది వాక్కొక్కప్పుడు ఆవర్తాలు కల్పించి — సరే, యీవిషయం మళ్లీ ప్రస్తావనకు వచ్చి నప్పుడు చూసుకుందాము.

రాజరాజు — (మహారుద్రయ్యతో) ఇంతలో యిది తేలేదిన్నీ కాదు, తేల్చ డానికి వీలూ చాలదు. (నన్నయతో) తమ రు—(అర్థోక్తి)

నన్నయ—నా కిప్పటికి సెలవు దయ చేయించండి.

రాజరాజు—చిత్తం, ఇంకొక్క క్షణంలో మేమున్నూ బయలు దేరతాము. ఏమి మహా రుద్రయ్యగారూ ! భట్టారకులవారి నిమిత్తం రథం సిద్ధంగా వున్నదా ?

మహారుద్రయ్య — (కిందికి చూసి) చిత్తం, రథమూ పాలకీ గూడా సిద్ధంగా వున్నాయి. వారి వుత్సాహం యెలా వుంటే అలా దయచెయ్యవచ్చు.

నన్నయ—(చిత్రాంగి పటం రాజరాజు కందించి, తక్కిన పటాలలో కొన్ని మహా రుద్రయ్య కిచ్చి) వీటివిషయం పరిష్కారం అయిపోయింది. (మరికొన్ని పటాలు మళ్లీ వుంచి) ఇక వీటివిషయం తేల్చవలసి వుంది.

రాజరాజు— చిత్తం. మరి మాకు సెలవు దయచేయించండి.

నన్నయ— చిత్తం చిత్తం, సెలవు. (వెనక్కి వెనక్కి నడుస్తూ బయలు దేరతాడు.)

మహారుద్రయ్య — (వెంట వెడుతూ) ఉదయం తమ అనుష్ఠానం ముగిశాటప్పటికి దర్శనం చేసుకుంటాను.

నన్నయ—చిత్తం చిత్తం, నిరీక్షిస్తూ వుంటాను.

మహారుద్రయ్య—సెలవు.

నన్నయ—సెలవు.

(నన్నయ వెళ్లిపోతాడు. మహారుద్రయ్య రాజు దగ్గిరికి వస్తాడు)

రాజరాజు—(చిత్రాంగి పటంచూస్తూ) ఏమి రూపమూ? ఎంత రాజసమూ? ఇంతటి తేజశ్శాలిని యింతవరకూ మన కళ్లబడలే దేమి? (పక్కగా కిందికి చూస్తూ) తక్కిన వన్నీ మహారుద్రయ్యగారి కిచ్చి, భట్టారకుల వారు, ఈ వొక్కపటమూ మన కిచ్చా రేమి?

మహారుద్రయ్య—(తన యథాస్థానం లోకి వచ్చి) ప్రభూ!

రాజరాజు — (మెరుపుకొట్టిన ట్టయి) అయితేనూ? భట్టారకులవారి ధోరణి మీకు నచ్చినట్టు లేదే?

మహారుద్రయ్య—చిత్తంచిత్తం, తమరు సెల విప్పించింది చాలామట్టుకు సత్యమే.

రాజరాజు — ఇవాళ వారు బాగా వుద్రిక్తు లైనారండీ.

మహారుద్రయ్య—కారణం—(అర్థోక్తి)

రాజరాజు—అ, కారణాని కేం వుంది? రథం వెళ్లగానే అలా భారతరచన కట్టిపెట్టి యిలావచ్చి వుంటారు. వారి చిత్తం పూర్తిగా ప్రకృతిస్థం కాకుండానే మళ్లీ పటాల పరిశీలనలో పడవలసివచ్చివుంటుంది.

మహారుద్రయ్య—అలాగే తోస్తోంది మహాప్రభూ! అయితే, నిజానికి, భట్టారకుల వారు గొప్పపండితులే. మహామేధావులే. కవిసార్వభౌములే. అనుభవసంపన్నులున్నూ. అయినా, వారి నిర్ణయం నాకు ప్రమాదపతితంగా కనపడుతోంది.

రాజరాజు—ముత్తానికి తొందర లేక పోలేదు.

మహారుద్రయ్య—ఇప్పటివరకూ మన చేతికి వచ్చిన పటా లన్నీ చూడగా—(అర్థోక్తి)

రాజరాజు—ఇక రావలసినవి మనం యెరగనివి టండీ?

మహారుద్రయ్య— కనక జక్కులదీవి రాజపుత్రిక మాత్రమే సర్వలక్షణసంపన్న అని నానిశ్చయం.

రాజరాజు—అదే నేనూ అంటున్నాను. భట్టారకులవారున్నూ యిందు కంగీకరించక పోలేదు.

మహారుద్రయ్య—వారేం సెలవిచ్చినా ఆమెని తిరస్కరించడం జరుగుతుం దేమో అని నామనస్సు గజిబిజి అయిపోతోంది. మహారాణులకు వుండవలసిన పొంకం అంతా ఆమెలో మూర్తీభవించివున్నది.

రాజరాజు — (సాలోచనగా పక్కకి చూస్తూ, తల పంకిస్తూ) మహారాణులకు వుండవలసిన పొంకం! (పటం చూస్తూ) నిస్సందేహంగా. (మహారుద్రయ్యతో) ఈమె చళుక్యమహారాణి కావాలి. అయితీరాలి. ఇదేనా మీనిష్కర్ష?

మహారుద్రయ్య—చిత్తం చిత్తం, అంతే మహాప్రభూ!

రాజరాజు—మీరు చెప్పింది సర్వాత్మనా యుక్తంగా వుంది; కాని భట్టారకుల వారి మాట అంటే అబ్బాయికి వేదవాక్యమే.

వారికి నచ్చనిది అతనికి పరిహార్యమే. మరి దారి?

మహారుద్రయ్య—అబ్బాయిగారు వల్ల కాదనడం—(అర్ధోక్తి)

రాజరాజు—(ఆలోచిస్తూ) అత నలా అంటా డనే నిష్కర్ష. ఏమీ సందేహం లేదు.

మహారుద్రయ్య—క్షీరకంఠులైన అబ్బాయిగారు వల్లకాదంటే, సర్వవిధాలా అర్హురాలైన త్రిభువనసుందరి—(అర్ధోక్తి)

రాజరాజు— ఈమె త్రిభువనసుందరే. లోకైకసుందరే. ఎవరు కాదనగలరూ?

మహారుద్రయ్య — చిత్తం చిత్తం, అలాగే, ఆమె చళుక్య మహారాణి కాగూడదని యెవరూ అనగలిగిన్నీ వుండకూడదు.

రాజరాజు—అది నిశ్చయమే. (కిందుగా పక్కకి చూస్తూ ఆలోచన నటిస్తూ) పోనీ, యీామె పట్టమహిషి. కాకపోతే ఆ దోషం పరిహారమైపోతుం దేమో ఆలోచిం చండీ.

మహారుద్రయ్య — (మహోత్సాహం తో) బాగుంది. ఇది చాలా బాగుంది మహాప్రభూ! ఎక్కడికి వెళ్లినా యిది తిరుగులేని ఆలోచన. మరిన్నీ, భట్టారకులవారు "ఈమె కామిని" అని సెలవిచ్చారు. కామిని భోగిని కావడమే ధర్మం.

రాజరాజు—అవును సుమండీ.

మహారుద్రయ్య — శ్రీకృష్ణులవారికి సత్యభామా దేవమ్మగారు— (అర్ధోక్తి)

రాజరాజు—(ఉప్పొంగుతూ) సెబాస్! నాకున్నూ అదే తోచింది. రుక్మిణీదేవమ్మగారు సాక్షాత్తూ ఆ శ్రీ మహాలక్ష్మీదేవమ్మవారే కనక వారిని గురించి ప్రస్తావించడానికి మనం అనర్హులం. ఈకారణంవల్లనే వారి అంతఃపురికవిలాసాలు వర్ణించడాని కెవరూ సాహసించ లేకపోతూ వచ్చారు. కాగా,యిక సత్యభామా దేవమ్మగారి విషయం. నిజానికి, వారివల్లనే శ్రీకృష్ణులవారి రసికత సార్థకం అయింది. శ్రీకృష్ణులవారి దక్షిణనాయకత్వం కూడా వారివల్లనే రూఢమై రసబంధురమున్నూ అయింది.

మహారుద్రయ్య — సత్యం సత్యం. ఇందులో ఇంకొక విశేషం కూడా వున్నది మహాప్రభూ! అదేమిటంటే? సత్యభామా దేవమ్మగారివల్లనే శ్రీకృష్ణులవారికి లాగే, శ్రీకృష్ణులవారివల్లనే సత్యభామా దేవమ్మగారికిన్నీ విశిష్టత యేర్పడింది. తండ్రిగారామెని అక్రూరులవారికో, కృతవర్మశతధన్వులలో వొకరికో యిచ్చి వివాహం — (అర్ధోక్తి)

రాజరాజు — (చెవులు మూసుకుని) శివశివా!......అది తలుచుకుంటేనే—అలా అనుకుంటేనే శరీరం జలదరిస్తోంది. (గాభరా నటిస్తాడు)

మహారుద్రయ్య — శృంగారరసంలో వుండుకున్న నిగ్గంతా క్షుణ్ణంగా గుర్తించగలిగినవారు కనక, దానిమాధుర్యం అనుభవించగలిగినవారున్నూ కనక తమరు — (అర్ధోక్తి)

రాజరాజు — అలా అన్నారు గదా? అయితే, (చిత్రాంగి పటం చూపిస్తూ) ఇలాంటి త్రిభువనసుందరిని ఏలుకోవాలంటే ఎంత పాండిత్యం — ఎంత రసికత — ఎంత

అనుభవం కూడా వున్నవాడు కావాలో (సాకూతంగా చూస్తూ తల యెగరవేస్తాడు)

మహారుద్రయ్య— (ఏదో నిగూఢవిషయం స్ఫురించినట్టు చకితుడై) అబ్బాయిగారి పాండిత్యం హద్దులేనిదే. సందేహం లేదు కాని—(అర్ధోక్తి)

రాజరాజు—ఇందులో యింకో సంగతి కూడా వుంది చూశారా?

మహారుద్రయ్య—సెలవిప్పించండి.

రాజరాజు—సత్యభామా దేవమ్మగారిని తప్పించి చూడండి. శ్రీకృష్ణులవారి అంతఃపురంలో గాఢాంధకారం తప్ప — మరేమయినా—(ఊరుకుంటాడు)

మహారుద్రయ్య—అవునుమహాప్రభూ! సామాన్యసంసారి అంతఃపురానికీ దానికీ భేదంలేదు.

రాజరాజు—దీన్నిబట్టి చూస్తే భట్టారకులవారు సెలవిచ్చిన పోలిక కూడా పూర్వపక్షం అయిపోతూ వుంది.

మహారుద్రయ్య—నిజమే. జక్కులదేవి మండలేశ్వరుల కొమార్తెగారిని చూస్తే సత్యభామాదేవమ్మగారు స్ఫురణకు రావాలి; కాని ద్రౌపదీదేవమ్మవారు కారు.

రాజరాజు—అదీ మాట. పైగా, శ్రీకృష్ణులవారు, సత్యభామాదేవమ్మగారి నిమిత్తాన, అరసికుడూ—అంటే అనర్హుడూ అయిన శతధన్వుణ్ణి సంహరించి కూడా వున్నారు; కనక, యిక్కడ, భట్టారకులవారు తెచ్చిన రత్నసదుల ప్రస్తావనకు విప్రతిపత్తి యేమీ లేదు.

మహారుద్రయ్య—అవును మహాప్రభూ!

రాజరాజు—ఇదంతా చూస్తే, రామభద్రరాజు కూతుర్నిమాత్రం విడిచిపెట్టడానికి వీలులేదు.

మహారుద్రయ్య— ప్రధానమైన విషయం అదీ. నా ఆందోళన తీరింది మహాప్రభూ!

రాజరాజు — కనక అలా యేర్పాటు చేతాం. భట్టారకులవారిని ఈవిషయమై మన మిక శ్రమపెట్టవలసిన అక్కర కనపడదు.

మహారుద్రయ్య—ఇంకెందుకూ? ఈ విషయమై మళ్లీ వారికి ఆవేశం కలిగించడం యెందుకూ? అయితే, తక్కిన పటాలు మాత్రం వారు పరిశీలించవలసే వుంటుంది.

రాజరాజు — కనక (చిత్రాంగిపటం తప్ప తన చేతిలో వున్న తక్కినవి అతని కందిస్తూ) ఇవిన్నీ జాగ్రత్త చెయ్యండి.

మహారుద్రయ్య — (అవి పుచ్చుకుని) చిత్తం.

రాజరాజు —. ఇక మనమున్నా వొకమాటలా నదికేసి వెడదాం.

మహారుద్రయ్య — దయచెయ్యండి.

(మహారుద్రయ్య కిందికి చూస్తాడు. వెంటనే మల్లప్ప అనే భటుడు పైకి వస్తాడు. వాడు మహారుద్రయ్య మనిషి. అతని కాంతరంగికుడున్నూ. మహారుద్రయ్య పటాలన్నీ మల్లప్ప కిచ్చి "నగరికి పద" అంటాడు. "చిత్తం" అని వాడు వెళ్లిపోతాడు. రాజూ మంత్రీ అడుగుల్లో అడుగులు వేసుకుంటూ, బయలుదేరతారు.)

రాజరాజు — (గభీమని ఆగి) మహారుద్రయ్యగారూ!

మహారుద్రయ్య—(ఆగి) చిత్తం మహాప్రభూ!

రాజరాజు— చక్రవర్తుల ప్రవృత్తికీ, తదితరుల ప్రవృత్తికీ అంతరమూ, భేదమూ వున్నా యంటారా లేవంటారా మీరు ?

మహారుద్రయ్య—అయ్యో లేకేం ?

రాజరాజు — తప్పకుండా వుండా లంటారా ?

మహారుద్రయ్య — ఉండితీరాలి. లేకపోతే యెలాగా ? ఆవిశేషం వుండబట్టే కాదూ "నా విష్ణుః పృథివీపతిః" అనడం ?

రాజరాజు—మరిన్ని చక్రవర్తుల యితివృత్తాలే కదా కవులకు వర్ణించతగ్గవి ?

మహారుద్రయ్య—తదితర్ల యితివృత్తాలూ వొక యితివృత్తాలేనా? ఎంతమాటా?

రాజరాజు — అవునుకదా? అయితే, రామభద్రరాజు కూతురువంటి దేవేరి లేని చక్రవర్తి యితివృత్తంలో జటిలమైన ఘట్టం వొకటయినా వుంటుంది టండీ?

("మహాప్రభూ" అంటూ మహారుద్రయ్య, "ఆ" అంటూ రాజరాజూ గంభీరంగా చూసుకుంటారు.)

మహారుద్రయ్య—(అలా గంభీరంగానే చూస్తూ సాలోచనగా) అలా సెలవిప్పించారా?......బోధపడ్డది...... బాగుంది... (స్ఫుటంగా) దివ్యంగా వుంది మహాప్రభూ!

రాజరాజు — (ఉల్లాసంతో) బాగా అవగాహన అయినట్టేనా?

మహారుద్రయ్య — క్షుణ్ణంగా అవగాహన అయిపోయింది మహారాజాధిరాజా! తమ వుద్దేశమూ, సంకల్పమూ అనితర దుర్లభంగా వున్నాయి సరసాగ్రేసరచక్రవర్తీ! కాని వొక్క మనవి.

రాజరాజు—ఏమంటారు?

మహారుద్రయ్య—ఇవాళకి నదీవిహారం వద్దు.

రాజరాజు—అలాగే చేతాం.

మహారుద్రయ్య—నగరికే వెళ్లిపోదాం. లేకపోతే విలాసభవనోద్యానం—(అర్థోక్తి)

రాజరాజు—అది బాగుంది.

మహారుద్రయ్య—దయ చెయ్యండి.

(ఇద్దరూ మహోల్లాసంతో వెళ్లిపోతారు)

రెండో రంగం

రాజరాజునగరిలో వొక గది.

రత్నాంగి పరిచారిక గౌరి, రాజరాజు పరిచారిక చిట్టి యెదురెదురుగా నుంచుని వుంటారు.

గౌరి—సరే మరీ. అంత బడలిక అయితే యేం చేస్తామూ ?

చిట్టి—అంతా యింతా కాదు బడలిక. ప్రభువు ఈరాత్రి భోజనం చేస్తా రని తోచదు.

గౌరి—అబ్బా!

చిట్టి—మధ్యాహ్నం అలా పవ్వళించి లేచారు, ఇలా పటాల పరిశీలన ప్రారంభించారు. కొంతసేపటి కిక్కడ శ్రాంతులై బురుజుమీదకి వేంచేశారు. మరికొంతసేపటి కక్కడా శ్రాంతులై, అనుష్ఠానసమయం కావడంవల్ల భట్టారకులవారిని పంపేసి విలాస భవనోద్యానంలోకి దయచేశారు. అక్కడ కూడా యిప్పటిదాకా పటాలు చూసిచూసి, యిక భరించలేక, కొట్టేసిన పాములాగ,

యిప్వుడే చలవరాతిన్నెమీద నడుం వా ల్చారు.

గౌరి — ఇలాంటి స్థితిలోనుటమ్మా నేను రాయబారం తెచ్చాను ?

చిట్టి — మహారుద్రయ్యగారు కూడా భోజనానికి వెళ్లరుట. వారికి, యిక్కడే ఫల హారం సిద్ధం చేయించి వుంచమని కూడా సెల వయింది.

గౌరి—స—రి!

చిట్టి—"ఈస్థితిలోనా చిట్టీ?" అన్నారు ప్రభువు. నిజంగా నాకు చచ్చినచా వయి పోయింది.

గౌరి— కాదుటమ్మా ?

చిట్టి—కనక, యీసంగతి మహారాణీ తో మనవిచెయ్యి.

గౌరి—మంచిదమ్మా మంచిది.

చిట్టి—నాలుగుదినాలకి మళ్లీ యివాళ మహారాణీని సేవించుకోగలుగుతా నను కున్నాను; కాని పెట్టిపుట్టలేదు. చాలా కించపడిపోతున్నాను.

గౌరి—ఏంచెయ్యనూ? నాకూ ఇదే తటస్థించింది కాదూ ?

(గౌరి వెళ్లిపోతుంది. ఒక్క నిమిషం అలాగే నుంచుని, చిట్టి, పోక అడుగు వేశాటప్పటికి అన్న పూర్ణ అనే మరొక పరిచారిక యెదురువస్తుంది.)

అన్నపూర్ణ—రహస్యం కామోసు.

చిట్టి—అక్షరాలానూ.

అన్నపూర్ణ— అయితే, శిలాక్షరమే అన్నమాట.

చిట్టి—కాని, నాకూ నీకూ వున్న అనుబంధం తామ్రాక్షరం కాదుటే ?

అన్నపూర్ణ—కాకేం? కనక యిప్వుడే చెప్పేస్తావు.

చిట్టి—నేను నీకు మట్టుకే చెబుతాను.

అన్నపూర్ణ—అంచేత అప్పటికీ అది రహస్యమే.

చిట్టి—నువ్వు మరొక ర్తికీ, అదిన్నీ యింకొక ర్తికీ చెప్పడం జరుగుతుంది కాగా, అప్పటికీ అది రహస్యమే.

అన్నపూర్ణ—సందేహమేం ?

చిట్టి—ఇది యిక్కడ యిలాంటి స్థితి లో వుండగా వార్త మహారాణీకి చేరుకుం టుంది.

అన్నపూర్ణ—చల్లగాను.

చిట్టి—అవును. అప్పటి కిక్కడ మన వాళ్ల కందరికీ తెలిసిపోతుంది.

అన్నపూర్ణ—చెప్పే దేమిటే ?

చిట్టి—ఇంతలో, అక్కడ కూడా యిది యిలాగే పనకలిసిపోతుంది.

అన్నపూర్ణ—పరిపాటే కాదూ ?

చిట్టి—అప్వుడు దానిపేరు ?

అన్నపూర్ణ—బహిరంగ రహస్యం.

చిట్టి—అదిగదీ మాట.

అన్నపూర్ణ—మరి విఘ్నేశ్వర పూజ కానియ్యి.

చిట్టి—మహారాణీ వర్తమానించారు.

అన్నపూర్ణ—రాత్రి దయచేస్తామనీ.

చిట్టి—అవును; కాని ప్రభువు బడలికగా వున్నారు.

అన్నపూర్ణ—అదేమిటే?

చిట్టి—జోలెడు చిత్రపటాలు వచ్చాయి కాదుటే?

అన్నపూర్ణ—అయితే?

చిట్టి—కన్యావరణం అంటే యేమనుకున్నావు మరి?

అన్నపూర్ణ—సొంతానికయితే — (అర్థోక్తి)

చిట్టి—శాస్త్రం చెప్పినట్టుంది నీ మాట.

అన్నపూర్ణ—ఏమమ్మా?

చిట్టి—మరొకరికోసం అయితేనే బడలిక మామ్మా.

అన్నపూర్ణ—మరి సొంతానికయితే?

చిట్టి—విరహమే.

అన్నపూర్ణ—సెబాస్! అయితే, అది మాత్రం కలక్కుండా వుండేటట్టు చూడు.

చిట్టి — అవతల మహారుద్రయ్యగారుండగా, యివతల నీవల్లా నావల్లా యేమవుతుందీ?

అన్నపూర్ణ—అవునేవ్! కాని, చివరికేమయినా మన కొరకే. కనక, స్నానాలూ, స్నాన ప్రయత్నాలూ చేసుకుందాం తొరగా రా.

(ఇద్దరూ వెళ్లిపోతారు.)



# సినిమా సన్నాహం

[ కథానిక ]

౧

"కమలా !"

"వస్తున్నా !" అంటూ కమల మేడమీదనుంచి రింగురింగున వచ్చి తలుపు తీసి "ఏమండీ, హిహిహి, కుర్చీ వదిలి పెట్టిందా అప్పుడే ఇవ్వాళ? ఆశ్చర్యం!" అన్నది.

"ఇంటివద్దగర కూచుండేదానికి నీ కేం తెలుస్తుంది? పి. డబ్ల్యూ. డి. ఉద్యోగమంటే ఎంతచేసినా తరగదు పని" అన్నాను.

"ఎబ్బే, మీరే చేసేది మహా, ఈ ఉద్యోగం! మా అన్నయ్యలూ వాళ్లూ ఇంతమాత్రము ఉద్యోగాలు ఏమన్నా చేశారు గనకనా !"

"మీ అన్నయ్య డేమంటీ, కోర్టుకు వచ్చేపార్టీల దగ్గిర మామూళ్లకు బల్లకింద చేయిజాపడ మనుకున్నావా ఇది? పి. డబ్ల్యూ. డి. పని, ఏమనుకున్నావో?"

**శ్రీమతి**
**వారణాసి మహాలక్ష్మి**

"ఓహో, మీరు బల్లపైనే చెయ్యి చాస్తారేం? అదా భేదం? – అయితే ఇవ్వాళ మిమ్మును ఆ ఆఫీసు బల్లా కుర్చీ ఎట్లా వదిలిపెట్టిన య్యండీ అప్పుడే? ఏమన్నా ఒక్క రోజన్నా సరదాగా గడుపుదామంటే తొందరగా రారు !"

"పోనీ, ఇవ్వాళ వచ్చాగా, ఏంచేదాము ఇవ్వాళ ?"

"చెప్పేదీ? సినీమాకు వెళదామండీ."

నేను మాట్లాడలేదు.

"ఒక్క సరదా అన్నా లేదు; ఈ విపరీత మెక్కడా ఎరగము! కాపరానికి వచ్చి ఐదేళ్లయింది. ఎప్పుడూ కొత్త ముచ్చటగా సినీమా అన్నా, నాటకమన్నా మొహం ముడుచుకుంటారు..."

"మనఇంట్లోనే సినీమా, నాటకం చూస్తూంటే థియేటరుకుపోయి వేరే చూడడ మెందుకు ?" అన్నాను.

కమల ముక్కులోకి ముసలివాడు దిగటం ప్రారంభించాడు. నాకు ఈ తెలుగునాటకాలూ, టాకీలూ అంటే విసుగు. ఒకదానికీ తీరా కూచోలేను. ఇవ్వాళ సినీమాకు తీసుకువెళ్లనంటే, వంటకూడా నేనే చేసుకోవలసి వచ్చేట్టున్నది. వ్యవహారం ముదిరిపోయింది. సినీమాకు వెళదా మంటూనే ఒకనాటక మాడి అదే రానిచేటట్లు చేదామని నిశ్చయించాను.

"కమలా..."

మాటలేదు.

"పసిపిల్లల్లే అట్లా ఏడుస్తావేం ?"

మాటలేదు. ఏడుపు ఎక్కువైపోయింది.

"మంచిపిల్లవు కాదూ, చెప్పేది విను మరి !"

"ఎట్లా జన్మఎత్తారో కాని, ఒకనాడన్నా అచ్చటా ముచ్చటా అంటూ లేదు."

"పిచ్చిపిల్లా, అదికాదు. నే నివ్వాళ ఎందుకు తొందరగా వచ్చానో తెలుసా !"

"కనపడ్డంలా ?" వెక్కి వెక్కి ఏడవ సాగింది కమల.

"అసలు ఇవ్వాళ నిన్ను సినీమాకు తీసుకువెళదామనే పనిఅంతా కట్టిపెట్టి తొందరగా ఇంటికివస్తే, అంతమాత్రము తెలుసుకోలేవేం ?"

కమల ఏడుపు కాస్త తగ్గింది. తలఎత్తి నావేపు చూచి, "నిజంగా?" అన్నది.

"నిన్ను ఉడికించటానికి అన్నది నిజం పట్టించుకుని సినీమాతారవలె ఏడ్చావే!"

కమల నవ్వుతూ వచ్చి నా చెంపమీద దెబ్బ వేసింది. "నా చెంపలువేస్తే వేశావు కాని కాస్త కాఫీ ఇచ్చి త్వరగా వంట చేస్తావా?"

కమల పరిగెత్తుకుంటూ ఇంట్లోకి పోయి ఫ్లాస్కులోనుంచి కాఫీ కప్పులో పోసి ఇచ్చింది. కాఫీ తాగి సిగరెట్టు వెలిగించి పేపరు చదువుకుంటూ పడకకుర్చీలో ఆలోచనలు ప్రారంభించాను.

౨

కొంతసేపయింది. సిగరెట్టుపొగతోపాటు నా మనస్సు ఆకాశంలో ఎక్కడికో పోయినందువల్ల ఎంతసేపయిందో తెలియలేదు. పోయేపోయే రైలుబండికి అకస్మాత్తుగా బ్రేకుపడ్డట్టు ఇంట్లో కమలకేకలు విని ఉలిక్కిపడ్డాను.

"వంటయి గంటసేపయింది. ఎన్ని కేకలు వేసినా పలకరేం?—భోజనానికి లేవండి, సినీమాకు వెళ్లడం ఎగవేయడానికి ఏదో ఆలోచిస్తున్నారా? త్వరగా లేచి రండి........"

ఆలోచనలు కట్టిపెట్టి భోజనానికి లేచాను. భోంచేస్తూ "అబ్బాయి ఏడీ? ఇవ్వాళ వాడి సందడే లేదే!" అన్నాను.

"వీడి మరీ విచిత్రమండీ! ఇందాకటినుంచీ ఏడ్చి ఏడ్చి ఇప్పుడేగా నిద్రపోయినాడు! వాడిగోల ఇందాకటినుంచీ వినపడలేదులా?

"ఏడ్చే!—అట్లాగా—హహహ—అప్పుడే నిద్రపోయినాడా? మీ—" అన్నాను.

"మీ పోలికలు వచ్చాయంటే బతకట మెట్లా మరి? రాత్రింబగళ్లూ నిద్రే ఉండదాయె! మాతమ్ముళ్ల పోలిక కాస్త వచ్చింది కాబట్టే బతికి పోతున్నాను" అన్నది కమల.

"నేనుమాత్రము ఏమన్నాను? మేలుకున్నంత సేపూ ఏడుపు, నిద్రవస్తే కుంభకర్ణుడినిద్ర— మీవాళ్ల పోలికే!"

కమలకు ముఖం ఎఱ్ఱపడ్డది. నా మంత్రము పారుతున్నదని సంతోషించాను.

"ఇదుగో, మా తమ్ముళ్లను అన్నారంటే బాగుండదు. మీ చెల్లెలల్లే అగ్గంకాళి నైతే తెలిసేది!"

"అదుగో, మా చెల్లెళ్ల సంగతి ఎందుకు ఎత్తాలి నీవు? మీతమ్ముళ్లంటే చక్కని చుక్కలాయెను!"

"మాతమ్ముళ్ల సంగతి ఎందుకంటూ మీకు? వాళ్లను ఆడిపోయక పోతే మీకు అన్నము అరగదు కాబోలు! కాస్త వాళ్లు నల్లనివాళ్లయితే, కుంభకర్ణుడల్లే ఉన్నారనవలెనా? మీ పెద్ద అన్నయ్య హిరణ్యాక్షుడల్లే ఉండడూ? మీ రెండో అన్నయ్య—"

"అదుగో, మావాళ్ల సంగతి ఎత్తితే మర్యాద దక్కదు!"

"అయితే, మావాళ్లేనా ఏమిటి, మీ కంత లోకువగా ఉన్నది! వాళ్ల దారిన వాళ్లు పొట్ట పోసుకుంటూ ఉంటే! మీరేమన్నా వాళ్లకు పోశారా, పెట్టారా? మాతమ్ముళ్లనంటే నే ఊరుకోను!"

"మీతమ్ముళ్ల సంగతి నువ్వే ఎత్తావు! అబ్బాయికి మీ తమ్ముళ్ల పోలికలే రానియ్యమన్నావు. వాళ్ల తెలివితేటలూ, పరీక్షలలో రెండేసి దండయాత్రలూ, ఉద్యోగంలో పైవాడిచేత రోజూ చీవాట్లూ—"

"ఏదో పోట్లాట పెట్టుకోవాలని ఉన్నట్లుందే! సినీమాకు తీసుకుపోవడము అంత ఇష్టము లేకపోతే ఆమాట చెప్పరాదూ, ఈ పోట్లాట పోట్లాడకపోతే!" కమలసంగీతము ఆరునొక్కరాగము ప్రారంభించింది.

"గిల్లి ఏడ్చేవాళ్లతో బతికే దట్లా చెప్పు నువ్వే" అన్నాను.

ఎట్లాగో భోజనా లయినవి.

## 3

యథాప్రకారము సిగిరెట్టు పీలుస్తూ ఆలోచిస్తూ పడకకుర్చీలో కూచున్నాను. లోపలనుంచి కమల గొంతు వినపడ్డది.

"ఏమండీ, ఇట్లా ఒకసారి వస్తారూ?"

"ఎందుకు?"

"ఒక్కసారి రండి, టైమై పోతున్నది."

"ఆఫీసు ఇవ్వాళటికి లేదు, దేనికంత తొందర! బద్ధకంగా ఉన్నది, నీవే ఇట్లా రద్దూ!"

రుసరుసలాడుతూ కమల వచ్చింది. "ఇంట్లోకి రమ్మంటే, వస్తే అరిగిపోతారా?" అన్నది.

"నాతో ఇవ్వాళ పోట్లాడ తలుచుకున్నావా ఏమిటి?" అన్నాను.

"ఏమి చీర కట్టుకోను?" అని అడిగింది.

"చీర సింగారించడ మెందుకు? ఇంత పొద్దు పోయిన తర్వాత ఎవరింటికి పేరంటానికి వెళతావు?"

"మరీ సోద్యమండీ మీది! సినీమాకు వెళ్లదా మంటిరే, సున్న చుట్టారా ఏమిటి?"

"ఓహో, మరిచిపోయినాను!"

"అంత ఇష్టము లేకపోతే బలవంతము లేదు లెండి!" కమల సాధింపు సాగించింది.

"నేనేం అన్నమాట తప్పేవాణ్ణి కాదే మీ వాళ్ల......"

నామాట పూర్తి కాలేదు. కమల నామీద పోట్లాటకు లేచింది. అతిశాంతంగా ఊరుకున్నాను. సమయం చూచాను. సమయం కనిపెట్టి—

"చీర కట్టుకోటానికి నా సలహా ఎందుకు? నే నెన్ని చెప్పినా మీ అమ్మవాళ్లు పెట్టిన చీర కట్టుకునేదానికి నన్ను సలహాకూడా అడగడం ఎందుకు?"

"ఏమి పెడసరమండీ! మీరు తెచ్చే చీరలు ముష్టివైతే, మా అమ్మవాళ్లు పెట్టేవి పీరముష్టి చీరలాయె—ఆ పీరముష్టి చీరలు కట్టుకుంటే మీ కళ్లు చల్లగా ఉంటాయా?" అన్నది.

నేను పకపక నవ్వి, "ఓహో, ఇదంతా సరసం కాబోలు!" అన్నాను.

కమలకు పట్టలేని కోపం వచ్చింది.

"మాకు సరసా లెట్లా తెలుస్తవి! మీరంటే ఎప్పుడూ పడకకుర్చీలో కూచుని భావకవిత్వం చెప్పే వాళ్లల్లే సిగిరెట్టు కాల్చుకుంటూ ఉంటారాయెను!"

"ఇవ్వాళ ఏవో పద్యాలు ఆలోచిస్తున్నా కమలా!"

"అయితే ఇవ్వాళ మనము సినీమాకు వెళ్లి నట్లే!"

"నీ చీర సింగార మయ్యేలోపల మహా భారతం రాయవచ్చు. టైమైపోయేలోపల అవు తుందా?"

కమల ఇంట్లోకి వెళ్లింది. చీరలు విప్పడం, మడత పెట్టడం, అలమర తెరవడం, మూయడం, పెట్టెలు కింద పెట్టడం, తెరవడం, మూయడం— చప్పుడు లోపలినుంచి వినిపిస్తున్నది. కొంతసేపు గడిచింది. చీరల అడావిడి నిరంతరంగా సాగుతు న్నది. ఇదే సమయ మనుకున్నాను.

"కమలా, కమలా!" అని అడావిడిగా పిలిచాను.

లోపలినుంచి జవాబు లేదు.

"కమలా, ఇంకా కాలా? టైమైపోయినట్లు న్నది. ఇక మన మివ్వాళ సినీమాకి వెళ్లినట్లే! ఈ పాటికి రెండు రీల్సు ఐపోయి ఉంటవి!"

"ఇప్పుడే కాదుటండీ నేను లోపలికి వెళ్లింది! ఇంతకూ ఏదో వంక పెట్టి సినీమాకు రాకుండా ఎగ వేతా మనుకున్న ట్టున్నారే!" అంటూ సింగారం పూర్తిచేసి కమల బయటికి వచ్చింది.

నేను పకపక నవ్వాను.

"ఎందుకండీ నవ్వుతారు?" అన్నది కమల. నేను కొంచెముసేపు ఎగాదిగా చూచి "చెబితే పోట్లాట నంటే చెబుతాను" అన్నాను.

"చెప్పవురా !"

"ఏమీ లేదు. నీవు ఈచీర కట్టుకుంటే అచ్చంగా మీనాన్న ఆఫీసుకు పోతుంటే డ్రస్సువేసినట్లుగానే ఉన్నావు. పోలికలు తప్పవు!"

"ఇవ్వాళ వీడో మావాళ్లను సందు చిక్కనివ్వడల్లా అని వాడు కోపము తెప్పించి నేను సినీమాకు రాననేటట్లు చేదామని ఆలోచించినట్లున్నారే! ఎన్నన్నా అనండి. నాకు ఇక కోపము రాదు. బయలుదేరండి!"

"పిల్లవాడు ఏడుస్తున్నట్లున్నాడే!" అన్నాను.

"పిల్లవాడు చక్కగా నిద్రపోతున్నాడు." అన్నది కమల.

నాప్లానంతా ఒక్కపారి సున్నచుట్టింది. నాకేమీ తోచలేదు. వాకిటి తలుపు చెట్టిన చప్పుడయింది. మిత్రుడు రామమూర్తి ప్రత్యక్షమయినాడు. నాలుగుమాటలతో అతన్ని నేను టైమడిగితే పదిగంటలైందని చెప్పి నన్ను రక్షించమని ఇంగ్లీషులో అతనికి చెప్పాను.

"మీరిద్దరూ ఇవ్వాళ సినీమాకు ప్రయాణమైనట్లున్నారే" అన్నాడు రామమూర్తి.

"అవునుకాని ఇప్పుడు టైమెంతయింది రామమూర్తీ?" అన్నాను.

"ఇప్పుడా? ఎంత...పదిగంటలయింది" అన్నాడు.

"చూచావా కమలా, నేను ఎంత తొందర చేసినా చీరల సెలెక్షనులో టైమంతా అయిపోయింది: ఏంచేతాము?"

కమల నివ్వెరపోయింది. "ఇప్పుడే కాదండీ ఎనిమిది కొట్టింది! మీరు పొరపాటు చూడలేదుగదా! మళ్లీ ఒకసారి గడియారం చూడండి!" అన్నది కమల రామమూర్తితో.

రామమూర్తి చిరునవ్వునవ్వి "పొరపాటు లేదండీ! తాను టైము అడిగితే పదిగంటలయిందనమన్నాడు అతను. గనక పదయింది అన్నాను. మీరడగండి, ఎంతయిందని చెప్పమంటే అంతని చెప్తాను" అన్నాడు.

"అయితే టైముందా రెండో ఆటకు?" అని అడిగింది కమల.

"లేకేం? ఇంకా గట్టిగా ముప్పావుగంట వ్యవధి ఉన్నది. ఇంట్లో మా ఆవిడ చీర కట్టడం ఇంకా కాలా. ఇంతలో మీరు ఉభయులూకూడా వస్తారేమో పిలుద్దామని వచ్చాను" అన్నాడు.

నా ప్లాను సున్నచుట్టింది.

"ఏమిరా ఎప్పుడూ సినీమాకు వెళ్లనివాడవు నీవుకూడా బయలుదేరినావే ఇవ్వాళ?" అని అడిగినాను.

"భలేవాడివే! ఇవ్వాళ సినీమా ఏమిటో కూడా ఎరగవా ఏమిటి? మన శాస్త్రి రాసిన కవిప్రియ!"

"నిజంగా! అచ్ఛా హం జాయంగే! — అది తప్పక చూడవలసిందే!"

"పొరపాటండీ! నాకు ఈసంగతి ముందుగా తెలుస్తే మన ఇంట్లో ఈ నాటకమంతా ఆడేవారు కాదు కాబోలు! చెప్పకపోవడం నాదే పొరపాటు!" అన్నది కమల.

"కుంభకర్ణుడేడీ? —"

"అట్లా అనవాకండీ, దిష్టి చేటు! — నేను కొత్త చీర కట్టుకున్నా గాని, మీరే కొత్త వాణ్ణి ఎత్తుకుంటారా?" అన్నది కమల.

"ఎవరికోసము!" అంటూ పిల్లవాణ్ణి బుజాన వేసుకొని బయలుదేరినాను.

---

# విశ్వరూపవధ: ఇంద్రచర్యా సమర్థన

శ్రీ బులుసు సీతారామశాస్త్రి

గత నవంబరు భారతిలో "గంగాస్నానము" అను శీర్షికతో పులవర్తి శరభాచార్యులుగారు విశ్వరూపవధను గురించి కొన్ని పద్యములు వ్రాసియుండిరి. ఆపద్యములకు ముందు పరిచయవాక్యములు కొన్ని వ్రాయఁబడియున్నవి. "...త్రిభువనైశ్వర్య మదోన్మత్తుఁడగు నింద్రుఁడు బృహస్పతినిఁ దిరస్కరింప, నాతఁడు పౌరోహిత్యమును వీడి, యంతర్ధానమందెను. తర్వాత నింద్రాదు లీ యపరాధఫలమును బ్రహ్మ కెఱిఁగింప, విశ్వరూపాచార్యునిఁ బురోహితునిగా స్వీకరింపు మని యాతఁ డానతిచ్చెను. తిరిగి యింద్రుఁడు తొంటియట్లు మదోద్ధతుఁడై, విశ్వరూపుఁ డొనర్చు నసురోపకారమును సహింపక, వారి చెలికారమున కియ్యకొనక, గురుఁ డగు విశ్వరూపుని గాంగతటమున సమాధినిమగ్నుఁ డైనవాని ఖండించి బ్రహ్మహత్యాపాపబంధురుఁ డయ్యెను."

వారు వ్రాసిన పద్యములలో, విశ్వరూపుని అనుగ్రహమున సమస్తైశ్వర్యములఁ గాంచి, పిమ్మట అవసరము తీఱినది కదా యని అహంకారమువలన నిష్కారణముగ నింద్రుఁడు గురువర్యుని ఖండించినట్లు వ్రాసి నేరమంతయు నింద్రునిపై మోపిరి. వారు చేయఁదలఁచిన అసురోపకారమును అసురులతోడి చెలికారము నంగీకరింపలే దనియు, నీవిషయము కృష్ణయజుర్వేదమునఁ గల దనియు వ్రాసిరి.

ఈవిషయమున నింద్రుఁడు గురుద్రోహి కాఁడనియు, విశ్వరూపుఁడే ప్రతిజ్ఞాభంగము, విశ్వాసద్రోహముఁ జేసినట్లును కృష్ణయజుర్వేదభాగమును, సంస్కృతాంధ్రభాగవతములను బరిశీలించినఁ దెలియఁగలదు.

బృహస్పతిని గౌరవింపకుంటవలని ఫలితము నెఱిఁగియుండియు నకారణముగా గురుద్రోహమువంటి తెలివితక్కువ పని నింద్రుఁడు చేయఁజాలఁడు. బృహస్పతి వెడలిపోయినపుడే తత్‌క్షణము తన దోషమును గుర్తించి, పశ్చాత్తప్తుఁడై గురుని ప్రసన్నునిఁ జేసికొనవలెనని యాతఁడు పొందిన వేదన మిక్కుటము. తాఁ జేసినది రాక్షసకృత్యమని వాపోయినాఁడు. బృహస్పతిఁ బ్రార్థింపనేఁగి, యతఁ డంతర్ధానమంద, గత్యంతరము లేక బ్రహ్మోపదేశమున, భక్తినమ్రుఁడై, విశ్వరూపు నాచార్యునిగా వరించినాఁడు.

ఇంద్రుని ప్రార్థన మంగీకరించి, విశ్వరూపుఁడు "గురువుల కామంబు...ప్రాణార్థ, వంచనమ్ములు లేక వడినొనర్తు" "భవతాం ప్రార్థితం సర్వం ప్రాణైరర్థైశ్చ సాధయే" (సం.భా.) అని ప్రతిజ్ఞ నొనర్చినాఁడు.

అట్టి విశ్వరూపుఁడు ప్రతిజ్ఞాతిక్రమణ మెట్లొనరించెనో చూడుఁడు. "అమరవరులతోఁ గూడి భుజియించి తూకొని వారితో యజ్ఞభాగమ్ముఁ బ్రత్యక్ష మొంది, కైకొనుచుండి దుష్కర్ముఁడై యాయజ్ఞభాగంబు రాక్షసప్ర

వరులకును దల్లి మీఁదఁ గల్గు తాత్పర్యమున, దివిజవరుల మొరగి వెచ్చియిచ్చు"...... (ఆంధ్రమహాభారతము). ఇది విశ్వరూపుని ద్రోహకృత్యము కాదా? ఇది యసురుల తోడి చెలికారమునకు మార్గమా? అట్లను టెన్నటికిని సమంజసము గాదు. సంస్కృత భారతమందును, కృష్ణ యజుర్వేదమందును గల వాక్యములఁ జిత్తగింపుఁడు. "సవై బర్హిషి దేవేభ్యో భాగం ప్రత్యక్షముచ్చకైః, అవద ద్యస్య పితరో దేవాస్సప్రశ్రయం నృప, స ఏవ హి దదౌ భాగం పరోక్ష మసురాన్ప్రతి. యజమానో వహద్భాగం." (సం. భా.) "స ప్రత్యక్షం దేవేభ్యో భాగ మవద త్పరోక్ష మసురేభ్య స్సర్వస్మై వై ప్రత్యక్షం భాగం వదంతి యస్మా ఏవ పరోక్షం వదంతి తస్య భాగఉదితః" (కృష్ణ యజుర్వేదము.)

దేవతలకు సర్వవిధముల శ్రేయస్సు గూర్పవలయు పురోహితుఁ డైయుండి, ప్రాణార్థ వంచనములు లేక మీకొఱక లీజేర్తు నని ప్రతిజ్ఞ చేసి, దేవతాహవిర్భాగములను దొంగతనముగా వారి పరమ శత్రువుల కిచ్చుటకంటె ఘోర మేముండును? అట్టి సందర్భమున నింద్రుని కర్తవ్య మేమో ఆలోచింపుఁడు.

"...తస్మాదింద్రోఽభి భేదీ దృబ్ వై రాష్ట్రం విపర్యావర్తయతీతి" (కృ. య.) "అలక్ష్య తరసాభీతః తచ్ఛీర్షాన్యచ్ఛినద్రుషా" (సం భా.) "అది మెఱింగి యింద్రుఁడతి భీతచిత్తుఁడై" (ఆం. భా.)

ఇంద్రుఁ డట్లు భయపడుట యసహజమా? తన రాష్ట్రమునకు విప్లవము దీసికొని వచ్చినపుడు దుష్కర్ముఁడైన యాతనిఁ ద్రుంపక ఇంద్రునికి గత్యంతరము లేదు.

బ్రాహ్మణుఁడైనవాఁ డట్టిదుష్కృత్యములఁ జేసినను వాని వధించిన బ్రహ్మహత్యా దోషము రాక మానదు. ఈ విషయమును కృష్ణయజుర్వేద ద్వితీయకాండమునఁ దెలుపఁబడినది. కావుననే రావణాసురునిఁ జంపిన శ్రీరామునికిఁగూడ బ్రహ్మహత్యా దోషము తప్పినదికాదు.

మఱియు బ్రహ్మహత్యను దిరస్కరింప శక్తి గలిగియు లోకాపవాద పరిహారము కొఱకై దాని నంగీకరించినట్లును, దానిఁ జతుర్భాగములుగ విభజించి, భూ జల వృక్షములకును స్త్రీలకును ఇచ్చి దానినుండి విముక్తుఁడైనట్లును గలదు. "బ్రహ్మహత్యామంజలినాఽజగ్రాహాయుదపీశ్వరః" (సం. భా.) అను చోట నీవిషయము తేటపడఁగలదు.

కావున ఇంద్రుఁడు గావించినది మహాదోషముగా వర్ణించుట సమంజసము కాదనియు, కాళియఘట్టమువలె విశ్వరూపఘట్టమును దుష్కర్ముఁడైన విశ్వరూపుని సంహరించిన ప్రదేశ మగుటనే పుణ్యక్షేత్రమై యుండు ననియు నాయభిప్రాయము.

---



# వేదాంతదర్శనము:
# శుద్ధాద్వైతవాదము

[ వల్లభమత సిద్ధాంతములు ]

## శ్రీ పూర్ణానంద

ప్రేమాంజనచ్ఛురిత భక్తివిలోచనేన
సంతః సదైవ హృదయేపి విలోకయంతి
యం శ్యామసుందర మచింత్యగుణస్వరూపం
గోవింద మాదిపురుషం త మహం భజామి.

### ప్రవేశిక:

రుద్రసంప్రదాయ మనబడు ఈశుద్ధాద్వైత వాదమునకు వేద భాష్యకారులలో నొకడను విష్ణుస్వామి మూలపురుషుడుగా జెప్పబడుచున్నాడు. ఈయన సన్యాసాశ్రమపతులను బ్రాహ్మణులనే శిష్యులుగా గ్రహించుచుండెడువారు. జ్ఞానదేవ, నామదేవ, త్రిలోచనులు తరువాతివారు. కడపటివాడను వల్లభాచార్యులే శుద్ధాద్వైతవాదమును, బాలగోపాలోపాసనను వ్యాప్తిలోనికి దెచ్చెను. 'అష్టప్రహర సేవ'గూడ ఈయన విధించినదే. బ్రహ్మము, జీవుడుకూడ శుద్ధులని చెప్పుచుండుటవలన 'శుద్ధాద్వైత' మనియు బ్రహ్మము జగత్తుగా మారినను అవికృతముగా నుండు ననుటచే 'అవికృత పరిణామవాద' మనియు వల్లభ మతము వ్యవహృతము.

### జీవితగ్రంథములు:

ఈయనజీవితమును వర్ణించు సంస్కృతగ్రంథము లెవ్వియును గానరావు. ప్రాచీన హిందీపద్యములతో నాభాజీ మహారాజ్ చే వ్రాయబడిన 'భక్తమాల' అను గ్రంథమునను, వంగభాషయందు శ్రీ కృష్ణదాసు కవిరాజు బాబాజీ వారు లిఖించిన 'శ్రీ చైతన్యచరితా

మృతో మను గ్రంథమునను ఈ మహాపురుషుని జీవితము నందలి కొన్ని వృత్తాంతములు వర్ణింపబడియున్నవి. శ్రీ కొమఱ్ఱాజువారి 'మహమ్మదీయ మహాయుగము'న గూడ వీతదాచార్యుని ప్రసంగ మున్నది. వీతన్మతస్థు లీయనను అగ్నిదేవుని అవతారముగా తలతురు.

**జీవితము :**

వల్లభుడు జన్మించినది త్రిలింగదేశమున. కాని జన్మస్థానమెటనో తెలియకున్నది. ఈయన పుట్టినవేలను వదలి మధురను మెట్టి 'గోకులము'న నివసింప సాగెను. అచ్చట కొంతకాల ముండి తీర్థపర్యటన, స్వమత ప్రచారముల నొనర్చుచు విజయనగరమును జేరుకొనెను. అచటి సంస్థాన పండితులను స్మార్తులను వాదమున భంగపరచి, వైష్ణవులకు గురువయ్యెను.* పిదప ఉజ్జయినీ నగరమున కరిగి, శిప్రానదీతీరమున నొక అశ్వత్థవృక్ష తలమున కొంతకాల ముండెను. ఈ స్థానము నేడుకూడ ఆచార్యుని స్థానముగా జెప్పబడుచున్నది. మధురయందు గూడ ఇట్టిదేయగు స్థానమెంకటి యున్నది. 'చూనార్' అను ప్రదేశమునగూడ ఈయనమఠము ఒకటియున్నది. ఆమఠ ప్రాంగణమున నున్న కూప 'మాచార్యకూప'మని చెప్పబడుచున్నది.

తరువాత ఈయన బృందావనమున కరుదెంచి శ్రీకృష్ణుని భజింపసాగెను. ఈయనతపస్సునకు మెచ్చి దర్శనమిచ్చి, బాలగోపాల సేవను ప్రచారము సేయమని భగవంతుడు ఆదేశించెను.

ఈయన పూరీక్షేత్రమున శ్రీకృష్ణచైతన్య మహాప్రభునితో సంభాషించినట్లు వంగభాషయందు రచింపబడిన 'చరితామృ'తాది మహాకావ్యములవలన దెలియవచ్చుచున్నది. ఈయన రచించిన భాగవతటీక 'సుబోధిని'యనుదానిని ఆమోదింపనట్లు ఆ మహాగ్రంథమున జెప్పబడినది. కారణము, అది శ్రీధరస్వామి రచించిన టీకకు విరుద్ధముగ నుండుటయే. "స్వామిటీక స్వామిగామినికాదు, అందువలన ద్విచారిణి" † యని మహాప్రభువు పల్కెనట.

చైతన్యుని శిష్యులును, గౌడీయవైష్ణవగోస్వాములును నగు శ్రీరూప, సనాతన, జీవగోస్వాములతో నీయనకు సౌహార్ద మున్నట్లు 'వైష్ణవమత విశే'కాది గ్రంథములవలన దెలియవచ్చుచున్నది. వీరు బృందావన భూమియందు 'అఖిల రసామృతమూర్తి' యగు శ్రీకృష్ణ దేవుని లీలావిలాస ప్రసంగములయందును, పరస్పర విరచితగ్రంథ శ్రవణమునను సుమధురములగు దినములను గడపియుండిరని మన మూహింపగలము. ఫలితముగ, వల్లభుని శుద్ధాద్వైతవాదము, గౌడీయగోస్వాముల అచింత్యభేదవాదము ఒకటి మరొకదానివలన ప్రభావితమైనవి. వల్లభుని గోపాలసేవ, పుష్టిమార్గములును, గోస్వాముల వాత్సల్య,మధుర భావములును నేకోదరులు.

వల్లభాచార్యుల తుదిజీవితము కాశీధామమున గడచినది. 'జైత్-బేడ్' అనచోట ఈయనమఠ ముంగటజేసి అట నీయన నివసించెనని చెప్పవచ్చును.

జీవితమునందలి తుదిరోజున ఈయన కాశీయందలి 'హనుమాన్‌ఘాట్' నందు గంగాస్నానమొనర్చ నీటియందు మునిగినతోడనే అగ్నిశిఖ యొకటి లేచి, ఈయన చాలమంది జనులు చూచుచుండగనే స్వర్గారోహణ మొనర్చెనని వినికి. హనుమాన్‌ఘాట్‌నందు వల్లభాచార్యుని ఆలయ మొకటి, ఈయన స్మృతిని రక్షించుచు నేటికిని నిలచియున్నది. ఈయన ౧౬-వ శతాబ్దపువాడని చెప్పగలముకాని, జననమరణముల వత్సరములను దెలుపజాలము.

**గ్రంథములు :**

అణుభాష్యము, సుబోధిని, సిద్ధాంతరహస్యము, భాగవత లీలారహస్యము, విష్ణుపదము అనునవి వల్లభాచార్యుని ముఖ్యగ్రంథములు.

---

* ఈవిషయ మెంతవఱకు సరియైనదో చెప్పజాలము. అప్పటిరాజు శ్రీకృష్ణదేవరాయలు. సభయందు అప్పయదీక్షితుని తండ్రియగు రంగరాజాధ్వరిమున్నగువా రుండిరి. వారి నోడించుటయన్న సామాన్యముకాదు.

† స్వామి = శ్రీధరస్వామి, భర్త; ద్విచారిణి = వ్యభిచారిణి; అసమంజసము.

బ్రహ్మసూత్రముల కీయాచార్యుడు స్వమత స్థాపనార్థము విరచించినభాష్యమే అణుభాష్యము. దీనికి పురుషోత్తమజీ మహరాజ్ రచించిన 'భాష్యప్రకాశ' మను టీక యొకటి యున్నది.

'సుబోధిని' వల్లభమతస్థులకు పరమ ప్రమాణ మగు వ్యాఖ్య. దీనికి వల్లభుని పుత్రు డగు విత్తల నాథుడు టిప్పణి సమకూర్చెను. ఈ రెండును ఇప్పుడు ప్రచురితములై లభించుచున్నవి.

సిద్ధాంతరహస్య, భాగవత లీలా రహస్య, ఏకాంత రహస్యము లను గ్రంథము లింతవఱకును ప్రచురితము లైనట్లు అగపడదు.

విష్ణుపదము విష్ణుని గుణానుకీర్తన మొనరించు పదములు. ఇది కాశీపురియందు ముద్రితమైనది. భాష హిందీ.

ఇవిగాక వల్లభాచార్యవిరచితము లగు కొన్ని స్తోత్రఖండికలుగూడ కానవచ్చుచున్నవి.

ఇక వల్లభుని మతవాదము నొకింత పరామర్శింతుము.

అధికారి:

అధికారికే పురుషార్థము చేకూరును. త్రైవర్ణికుల కధికారము బ్రహ్మవిద్యపట్ల మున్నది. కర్మగాక బ్రహ్మజ్ఞానమే పురుషార్థసాధక మగుటవలన, వేదాంత వాక్యములవలన బ్రహ్మవిచార మొనర్పదగును. శూద్రులకు జ్ఞానాధికారము లేదు.

సంబంధము:

శాస్త్రము ప్రతిపాదకము, బ్రహ్మ ప్రతిపాద్యము. బ్రహ్మ శాస్త్రైకగమ్యము; శబ్దవిషయము, అవిషయము గాదు. "ఈక్షతే ర్నా శబ్దం" (వే. సూ. ౧-౧-౩) అను సూత్ర వ్యాఖ్యాన ప్రసంగమున "నవిద్యతే శబ్దో యత్ర ఇతి అశబ్దం, సర్వ వేదాంతాద్య ప్రతిపాద్యం బ్రహ్మ న భవతి. కుతః? ఈక్షతేః— సదేవ సౌమ్యేద మగ్ర ఆసీ దిత్యాది" అనువాక్యములందు ఈయన ఈవిషయమును జెప్పియున్నాడు. అణుభాష్యమున ఈ ప్రసంగ మున్నది. "వచనై రీక్షతీయత్వా ద్వాచ్యమేవ" అని మధ్వాచార్యులు పల్కిన వాక్యము లీ సందర్భమున తెలుపనకు రాగలవు.

ప్రయోజనము:

అవిద్యానివృత్తి పూర్వకమును, బ్రహ్మప్రాప్తి యును నగు పురుషార్థమే ప్రయోజనము. అవిద్యవలన దుఃఖించు జీవుడు బ్రహ్మజ్ఞానమున దుఃఖమును బోగొట్టుకొనగలడు. ఇదియే ప్రయోజనము.

విషయము:

బ్రహ్మము, బ్రహ్మసాయుజ్య ప్రాప్తులు విషయములు. శ్రవణ మనన నిదిధ్యాస లనబడు అంతరంగ అంగములను, శమదమాదు లను బహిరంగ అంగములను నాశ్రయించిన, అత్యంత శుద్ధచిత్తమున స్వయముగ నావిర్భవించు స్వప్రకాశునితో సాయుజ్యమును బడయుటయే పరమపురుషార్థము. ఇదియే శాస్త్రప్రతిపాదితమగు విషయము.

బ్రహ్మము:

బ్రహ్మము సాకారము, నిర్గుణము (అనగా ప్రకృతిగుణముల కతీతము), సర్వశక్తిమంతము, నిర్విశేషము, సర్వజ్ఞము, విశుద్ధము. మాయ బ్రహ్మమున లేదు. ఇది గుణాతీతమైనను జగత్కారణము. నిమిత్త, ఉపాదానములు రెండునుగూడ. నిర్గుణపరబ్రహ్మమే ఆత్మశబ్దవాచ్యము; గుణాతీతమగు ఈ ఆత్మయే కర్త. బ్రహ్మము యొక్క శక్తి అచింత్యము, అనంతము. ఇయ్యది సర్వమును గాగలదు. విరుద్ధధర్మముల యొక్కయు, విరుద్ధ వాక్యముల యొక్కయు సమావేశ మీయనయం దున్నది. విరుద్ధధర్మాశ్రయత్వము బ్రహ్మమునకు భూషణము. భోక్తగూడ బ్రహ్మమే. కర్త, భోక్త, కారయిత అయ్యు నిర్వికారము; ఉపాదాన కారణమయ్యు సంసారధర్మ విరహితము. విచిత్ర జగద్రచన లౌకికమగు శరీరాధ్యాసవంటిదిగాదు, అలౌకికము. బంగారము కుండలాద్యాకారముగా మారినను బంగారమున కట్టి వికారమును లేదు; కామధేనువు, కల్పద్రుమము, చింతామణులు అర్థులు గోరు విషయములను బ్రసాదించుచున్నను వాటి కట్టి వికారమును లేదు.

అట్లే బ్రహ్మము జగత్ప్రసవియయ్యు నిర్వికారము. గోలోకాధిపతియగు శ్రీకృష్ణుడే ఈ బ్రహ్మము.*

**జగత్తు:**

బ్రహ్మకార్యము జగత్తు. కార్యకారణముల కభిన్నత్వ మున్నది. అందువలన జగత్తు సత్; మిథ్య కాదు. బ్రహ్మముయొక్క ఇచ్ఛ ననుసరించియే జగత్తు లయోదయముల నందుచున్నది. స్వేచ్ఛగ, లీలకొఱకు బ్రహ్మము జగద్రూపమును దాల్చినది. జగత్తు బ్రహ్మాత్మకము – బ్రహ్మముయొక్క అవికృత పరిణామము; బ్రహ్మమునుండి భిన్నముకాదు; లేక మాయికమును గాదు. జగత్తునకు వినాశములేదు; లయోదయము లున్నవి. లయకాలమున కారణరూపమునను, ఉదయ కాలమున కార్యరూపమునను వెలయుచున్నది. జగత్తు జడముకాదు; చైతన్యమే. జగత్తు నిత్య మనువిషయ మును (పూర్వ)మీమాంసకులుగూడ అంగీకరించి యుండిరి.

**జీవుడు:**

జీవుడు బ్రహ్మముయొక్క అంశము, అణువు. హృదయ మాతని స్థానము. ఇతడు శుద్ధుడు, చేతనుడు. అణువైనను ఈతడు చైతన్యగుణమున సర్వదేహ వ్యాపి యైయున్నాడు. చందనబిందు వొకచోట నున్నను శరీరమున కంతటికిని చల్లదన మిచ్చుట ఈ విషయమున దృష్టాంతము.

"గుణాద్వాఽలోకవత్" (వే. సూ. ౨-౩-౨౫) అను సూత్ర భాష్య ప్రసంగమున జీవుని చైతన్యమును గుఱించియు, "అవిరోధ శ్చందనవత్" (వే. సూ. ౨-౩-౨౩) అను సూత్ర వ్యాఖ్యాన సందర్భమున ఈజీవుని సంప్రసారణ శీలతను గుఱించియు ఆచార్యుడు తన యభిప్రాయమును దేటపరచియున్నాడు. జీవుడు "యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతీతి" అను శ్రుతివాక్యబలమున బ్రహ్మముయొక్క అంశ. జీవునకు బ్రహ్మముతో నైక్యములేదు. తత్త్వమస్యాది వాక్యములు అంశాంశిభావైక్యమును, చైతన్యగుణ సామాన్యత్వమును తెల్పుచున్నవి. మంత్రిని రాజనునట్లు, ఈ వాక్యము బ్రహ్మముయొక్క ప్రజ్ఞా, గుణములు జీవగతము లగు టనే సూచించుచున్నది.

"తద్గుణ సారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్" (వే. సూ. ౨-౩-౨౯) అనుసూత్రమును వివరించుపట్ల వల్లభుడీ దృష్టాంతము నొసగెను.

జీవులు శుద్ధులు, సంసారులు, ముక్తులు నని ముత్తెరగులుగ నుందురు. అవిద్యాబద్ధులు సంసారులు. అవిద్యానివృత్తి యైనవారు శుద్ధులు. సదసద్వ్యాసనా విశిష్టమగు దైవత్వమును బ్రహ్మమునుండి బడసినవారు ముక్తులు.

**సాధన:**

శమదమాదులు బహిరంగ సాధనములు. శ్రవణ మనన నిదిధ్యాసనములు అంతరంగ సాధనములు. ఈ సాధనవలన, భగవంతు డనుగ్రహింప, పుష్టిమార్గము, లేక ప్రీతిమార్గము (భక్తి) ఉదయించును. నిరుపాధిక స్నేహ మగు భక్తియే సర్వాత్మభావము. భావమనగా రతి. ఈ రతి మర్యాద, పుష్టి అని ద్వివిధము. అంబరీషాదులు మర్యాదను, వ్రజగోపికలు పుష్టిని నాశ్రయించియుండిరి. భగవచ్చిత్తపరతయే సేవ. ఈ సేవ శారీరకము, మానసికము నని రెండువిధములు. ద్రవ్యార్పణరూపక మగు శారీరక సేవ సాధనరూపము; శ్రీకృష్ణార్పిత చిత్తరూప మగు మానసిక సేవ ఫల రూపము. రెండవదానియందు సర్వాత్మభావము, అనగా భగవద్విరహబోధవలన సర్వత్ర తద్రూపస్ఫురణ మగును. ఇయ్యదియే భగవదనుగ్రహలబ్ధమగు పుష్టి. మహాపుష్టి యనబడునది ప్రతిబంధకములను నివర్తిల చేయును. శుద్ధపుష్టియందు భగవదనుగ్రహముపై నిర్భర పడుటగాక, సాధనాంతర ముండదు. భగవంతుని పతి గా భావించి, ఆయనతుష్టికై సర్వమును అర్పించి తన్ను గోపికగాభావించి సేవించుటయే వల్లభు డాబోధించు రాగమార్గము. జ్ఞానము, లేక విధివాదీయ భక్తి ఈయనప్రశంసను బడయలేదు.

---

* బ్రహ్మము సాకారము, నిర్గుణము అనుపట్ల బ్రహ్మసమాజమతస్థులతో గలుగు ఆశ్చర్యకరమగు శాబ్దిక భేదము గమనింపదగినది. వారి బ్రహ్మము నిరాకారము, సగుణము.

ఉపవాసము, తపస్సు మున్నగు కఠిననియమములతో బనిలేదు. చక్కగ భుజించి, మంచిబట్టలు గట్టుకొని భగవంతుని సేవింపవలెను.

ముక్తి :

గోలోకపతియగు శ్రీకృష్ణుని సాయుజ్యము నందుటయే ముక్తి. అట సర్వాత్మభావము, కృష్ణుని పతిగా బొందుట యనునవి లభించును. అఖండమును, నిత్యమును నగు రాసరసమహోత్సవ మట లభించును. అంతయును బ్రహ్మము అనుబోధయే సర్వాత్మభావము. అంతటను నిండియున్న తనపతియగు కృష్ణుని సేవించుటయే రాసరసాస్వాదము. ముక్తులు ఈ భగవల్లోకమున కరిగి మరల రారు.

"అనావృత్తిః శబ్దా దనావృత్తిః శబ్దాత్" (వే. సూ. ౪-౪-౨౨) అను సూత్రభాష్యమున పుష్టిమార్గ, మర్యాదామార్గపరులు ఈ మర్త్యమునకు మరల తిరిగి రారని ఆచార్యుడు నిర్వచించియున్నాడు.

అనుశీలన:

ఆచార్య శంకర, రామానుజ, మధ్వులు "జన్మాద్యస్యయతః" (వే. సూ. ౧-౧-౨), "శాస్త్రయోనిత్వాత్" (వే. సూ. ౧-౧-౩) అని రెండుసూత్రములుగా గ్రహించి బ్రహ్మము జగత్తుయొక్క స్థితిజన్మభంగములకు కారణము, వేదాంత (ఉపనిషత్)వాక్యములకు బ్రహ్మ యోని అని వ్యాఖ్యానించిన వాటినివల్లభాచార్యులు "జన్మాద్యస్యయతః శాస్త్రయోనిత్వాత్" (అ.భా. ౧-౧-౨) అను ఒకే సూత్రముగా గ్రహించి, బ్రహ్మము జగత్తుకు నిమిత్తకారణ మని అర్థము జెప్పినాడు. పూర్వోక్త ఆచార్యుల మతమున ఈ రెండును వేర్వేరు అధికరణముల బడుచున్నవి. ఇట్లే "తత్తు సమన్వయాత్" (వే. సూ. ౧-౧-౪) అనుచోట గూడ అర్థభేదము ఘటిల్లుచున్నది. వేదాంత వాక్యములకు బ్రహ్మమున సమన్వయ మని త్రిమతాచార్యులు అర్థము జెప్పియుండిరి. వల్లభమతమున ఈ సూత్రము బ్రహ్మము యొక్క సమవాయి ఉపాదాన కారణత్వమును నిరూపించుచున్నది.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా" (వే. సూ. ౧-౧-౧) అను సూత్రమునందలి 'అథ' శబ్దమునకు వ్యాఖ్యాన మొనర్చుచు శంకర రామానుజా లిర్వురును 'అథ' శబ్దార్థమును ఆనంతర్యార్థకముగానే నిర్వచించియుండిరి. శంకరమతమున శమదమాదుల అనంతరము; రామానుజ మతమున కర్మజ్ఞానానంతరము. కాని వల్లభునకీయర్థము 'అనేకదోష దుష్టము' అనిపించినది. అందువలన అధికారార్థమును గ్రహించినాడు. 'బ్రహ్మజిజ్ఞాస' అనుచోట శంకరుడు 'కర్మణి షష్ఠి'ని గ్రహింప, వల్లభుడు 'శేషేషష్ఠి'ని గ్రహించెను.

అపశూద్రాధికరణమున శంకరుడు శూద్రులపట్ల జూపిన ఔదార్యమును రామానుజ మధ్వులు చూపజాలక పోయినట్లే వల్లభుడుగూడ చూపజాలక "తస్మాన్న శూద్రస్య అధికారః" అనెను.

శాంకరమతమున 'తత్త్వమసి' వాక్యము సామానాధికరణ్యబలమున నిర్విశేష బ్రహ్మాత్మైక్య పరమగుచున్నది. రామానుజుడు సమానాధికరణమును గ్రహించినను, పైనజెప్పిన ఐక్యమును గ్రహింపక, సవిశేష బ్రహ్మముతో చిజ్జడాత్మక బ్రహ్మ శరీరము యొక్క ఐక్యమును జెప్పినాడు. మధ్వుడు "ఆదిత్యో యూపః", "అగ్నిర్మాణవకః" అను వాక్యములవలె సాదృశ్యపరమని అభిప్రాయపడెను. వల్లభుడు వీటిలో నెద్దానినిగాని గ్రహింపక, అంశాంశీభావముయొక్క అభేదత్వము నీవాక్యము సూచించుచున్నదని నుడివెను.

సమాప్తి :

రామానుజుని 'పరిణామవాదము'నే గ్రహించి, నింబార్కుడు 'అచింత్యశక్తి'వలన ఇట్లు జరుగుట సంభవమనెను. అదియే వల్లభుని గ్రంథములందు 'అవికృత పరిణామవాదము'గాను, బలదేవుని గ్రంథములందు 'అచింత్య భేదాభేదము'లుగాను మారినది. కనుక వల్లభుని శుద్ధాద్వైతము 'నేతిబీర' వంటిది. వాస్తవమున కియ్యది 'శుద్ధద్వైతము.'

జీవుడు అణువు, సేవకుడు, ప్రపంచము సత్యము అను రామానుజమత సిద్ధాంతములను మధ్వ, వల్లభ, నింబార్క, బలదేవులు గ్రహించిరి.

రామానుజుని దాస్యభక్తిని వీరందఱును గ్రహించిరి. అద్దానినే వల్లభుడు మర్యాదామార్గ మనెను. రామానుజ, మధ్వ, నింబార్కులు దాస్యభావముతో నాగిపోవ, వల్లభుడు వాత్సల్య, మధుర(పుష్టి) భావములనుగూడ నంగీకరించెను. వీటి నన్నిటిని గలిపి గౌడీయ వైష్ణవ గోస్వాములు శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములుగా విభజించిరి.

రామానుజుడు లక్ష్మీనారాయణులను, మధ్వుడు కృష్ణుని, వల్లభుడు గోలోకవాసి యగు కృష్ణుని, గౌడీయ గోస్వాములు బృందావన కృష్ణుని ఉపాస్యములుగా గ్రహించిరి.

విరుద్ధగుణ సమాశ్రయత్వము భగవానునకు భూషణము. సర్వము 'చైతన్యాత్మకము' అనుపట్ల వల్లభుడు భావరాజ్యమున జూపిన చింతాశీలత ప్రశంసనీయమే గాని, ఆయన అద్వైతులపట్ల జూపిన అసహనము అప్రశంసనీయము.

అద్వైతసామ్రాజ్య పథాధిరూఢా స్తృణీకృతాఖండల వైభవాశ్చ,
శఠేన కేనాపి హఠేన వయం దాసీకృతా గోపవధూవిటేన.

---

# ఆశాస్యము

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

తెలుఁగుమాగానికి వెలుఁగు తేఁగలిగిన నవ్యసాహితికిఁ గాణాచి వగుచు,
తెలుఁగుసీమకు దీప్తి కలిగింప నేర్చిన కవికుమారుల కలంకార మగుచు,
తెలుఁగునేలకుఁ గీర్తి తేఁజాలు వ్యక్తుల పేరుపెంపులు దాఁచు పేటికగుచు,
తెలుఁగుభూమికి నింపు పొలయించు లాలిత్య లక్ష్మికి నావాసరంగ మగుచు,
భారతీ, అణిముత్తెముభాతి నన్న - దాంధ్రదేశాన నభ్యుదయంబుతోడ
వెలయుమా! కలకాలము పొలుపువలపు-కులుకు నొలికించు క్రొంగ్రొత్త విలువ కలిగి

---

# తొలిసారీ, కడసారీ



[కథానిక]

---

శ్రీ కొడవటిగంటి కృష్ణమూర్తి

"అయితే వెళ్లనా?" అన్నది రాజమ్మ జడ చివరభాగం, సన్నాయి వాయించినంత త్వరగా పూలుతో అల్లుతూ.

"అయితే వెళ్లద్దు!" అన్నాడు సత్యం చూస్తున్న వేపే చూస్తూ.

"ఏం?"

"అసలు ఎవరిది వివాహం?"

"మా సుబ్బులు తమ్ముడిది. మా మేనత్త మనమడిదన్నమాట."

"నువ్వు వెళ్లకపోతే అనుకునిపోయేవా రెవరన్నా వున్నారా?"

"మా మేనత్త అనుకోదా, మరి మా మేనత్తకూ తు ర ను కోదా?"

"ఏమనుకుంటారు?"

"అయిన వాళ్లు రాలే దని!"

"అయితే, నువ్వు వెళ్లక తప్పదా" అని సత్యం రాజమ్మపై ఘుమాకాడు.

అనుకుంటే యిబ్బంది ఏమిటో సత్యానికి అర్థం కాలేదు. ఎందు కర్థ మవుతుంది? అతన్ని చిన్నప్పు డెవరూ చేసికీ పిలిచిన వాళ్లు కారు. అతని ఇంట్లో ఏకార్యాలూ ఇంతవరకూ జరగలేదు. ఇప్పట్లో జరిగే అవకాశంకూడా లేదు! అందుకని అతని ఇంటి

కెవ్వరూ రానక్కరలేదు! అందువల్లనే ఏదన్నా శుభానికి ఎవ్వరూ రాకపోతే ఎలా వుంటుందో అతను వూహించలేని స్థితిలో వున్నాడు. పోనీ, అతను రాకపోతే పోయినాడనుకుంటే, తన భార్యనుకూడా ఎక్కడికీ వెళ్లద్దంటాడు. తన చుట్టాలింటికి ఆమెను పంపకపోతే పోయినా డనుకుంటే,ఆమెచుట్టాలింటికికూడ ఆమెను పంపటానికి అతనికి అభ్యంతరం వున్నట్టు తేలింది. ఒకసారి తన భార్యను చిన్నప్పటినుంచి పెంచి తనకిచ్చి వివాహంచేసిన తన భార్యపెత్తండ్రి కుమారుడి వివాహానికి ఆమెను పంపకపోతే జరిగిన గోల అతనికి జ్ఞాపకం లేదు! తన భార్య ఆ పెళ్లి అయిదు రోజులూ తిన్నగా అన్నమైనా తినని సంగతి అతనికి తెలియదు! అతని మనస్సు ఎవ్వరికీ అర్థంకాదని అతనికి విసుగు! అతనుగాని, అతని భార్యగాని ఎక్కడికైనా వెళ్లటానికి అతని కేమీ అభ్యంతరం లేదనీ, కాని వెళ్లకపోతే అందరూ ఎందు కింత అనుకోవాలనీ అతనికి ఆశ్చర్యం!

"అయితే నువ్వు వెళ్లకతప్పదా ?" అని ఆమెవైపు చూశాడు.

"మీయిష్టం! మీరు వెళ్లమంటే వెళ్తాను."

"మళ్లీ ఎప్పు డొస్తారు ?"

"రేపు పొద్దున్నే !"

"వెళ్లు ! నాకెందుకు మధ్య !"

"అయితే మీరు రారూ ?"

"ఊహూ !"

"ఏం ?"

"మీవాళ్లింటికి నిన్ను పంపటానికి నాకు అభ్యంతరం వుండటానికి ఎట్లా వీలులేదో అట్లాగే మీవాళ్లింటికి నేను ఎందుకు రానని అడగటానికి నీకుగాని, నీవారికిగాని అధికారం లేదు."

అందరుచుట్టాలూ కలిసినప్పుడు తన భర్త అందరితోనూ కలియకపోవటం రాజమ్మకు కొత్తగాదు. తమ కుటుంబమంతా కలిసి గ్రూపుఫోటో తీయించుకున్నప్పుడు—ఎప్పుడో వెనక—తనభర్త అందరూ ఎంత బతిమాలినా వుండకపోవటం ఆమె మరిచిపోలేదు. ఆఫోటో చూచినప్పుడల్లా "ఒక్కసత్యంకూడా ఇందులో వుంటే ఎంతఆనందంగా వుండేది-వుండాలిసినవారంతా వున్నారు" అని తనచుట్టాలు మరిమరి అనుకున్న సంగతి తన చెవులలో ఇంకా మారుమోగుతూనే వున్నది. అదీగాక అందరితోపాటు అందరిలోకి వెళ్లితే, అందరూ "సత్యం రాలేదేం?" అని ఆదుర్దాగా ఒకర్ని ఒకరు ప్రశ్నించుకోవటానికి అవకాశం లేదని తన భర్త గట్టి నమ్మక మని ఆమెకు ఇదివరకు అనుమానమే వుండేది. ఇప్పు డది స్థిరపడింది. ఎక్కడికైనా వెళ్లటానికి తనకు ఏమీ అభ్యంతరం లేదని తనభర్త ఎంత చెప్పినా, వెళ్లకపోతే వున్న మజా, మర్యాదా వెళ్లితే వుండవని ఆయన నమ్మకమని ఆమెకు ఈసారితో తేలిపోయింది. అటువంటి విషయం ప్రతిదినం ఆయనతోపాటు సంసారాన్ని యీదుతూన్న భార్యకే తెలుస్తుంది. పరాయివాళ్లకు ఎట్లా తెలుస్తుంది? మొత్తం మీద రాజ్యం "అమ్మా!" అనుకుంది.

"ఒక్కపూటేగా? మీరుకూడా రండి!" అన్నది రాజమ్మ చీరెలు పెట్టెలో సర్దుకుంటూ.

"ఒక్కపూటపెళ్లికిన్ని చీరెలెందుకూ?"

భర్త ప్రశ్నకు సమాధానం చెప్పటం రాజమ్మకు చేతకాకపోయినా ఆమె కెందుకో ఆప్రశ్న అసహ్యం కలిగించింది!

"మీరుకూడా రండి!" అన్నది అన్నిటికీ సమాధానంగా.

"నాదేమిటిలే! నువ్వు వెళ్లుదూ!"

"మీరు ఎప్పుడూ ఎక్కడికీ రాలేదు కదా! ఈసారన్నా రండి, మావాళ్లు సంతోషిస్తారు!"

"నేను రాను లే!"

* * *

ఆ సాయంత్రం మూడింటికే తనభార్య చుట్టం ఎవరో వచ్చి రాజమ్మను బండి ఎక్కించి తీసుకెళ్లాడు. వచ్చినాయన సత్యాన్నికూడా రావలిసిందని కోరాడు. సత్యం సణిగాడు. రాత్రి ఎనిమిదిన్నరకు లగ్నమనీ, సత్యానికి ఈలోపలే పని అయిపోతే సాయంత్రంబండికి వచ్చినా లగ్నానికి అందుకుంటాడనీ జ్ఞాపకంచేసి, పోతూపోతూ స్టేషనుకు పెళ్లివారిల్లు ఎక్కువదూరం కాదని కూడా చెప్పి వెళ్లాడు.

౨

ఆ సాయంత్రం కాఫీ తాగి కారాకిల్లీకి ఆర్డరిచ్చి, కొట్టేలోపల అతను కూనిరాగంతీస్తుండగా ఎవరిదో ఆడవాళ్ల వూరేగింపు అతని ముందరగా వెళ్లటం జరిగింది. ముందు బాండు, వెనక దాదాపు ఒక పాతికమంది స్త్రీలు రకరకాల చీరెలు కట్టుకుని పోతున్నారు. ప్రతిస్త్రీ సబ్బుతో ముఖం బాగా కడుక్కొని ఫేసుపౌడరు కొట్టుకుని వుంది. వీళ్లమధ్య అక్కడక్కడ చెరువులో తామరాకులల్లే మాసిన బట్టలు కట్టుకుని దాసీలు పెద్దపెద్ద పళ్లాలలో లడ్డూలు, పూస మొదలయిన తినుబండారాలు నాజూకుగా పేర్చి నడుస్తున్నారు. సత్యానికి ఏదో ఆలోచన కలిగింది. వెంటనే కిల్లీలవాడు పిలిచి కారాకిల్లీ చేతిలో పెట్టాడు. అది కొంచెము నమిలి వుమ్మేసిన తరువాతగాని అతనికి తట్టిన ఆలోచన "తను పెళ్లికివెళ్లితే ఎట్లా వుంటుంది" అని జ్ఞాపకం రాలేదు. ఆడవాళ్ల వూరేగింపు మలుపు తిరిగింతరువాత "వెళ్లాలిసిందే" అని నిశ్చయించుకున్నాడు. ఎప్పుడూ వెళ్లకపోయినా మజాలేదు మరి! ఎప్పుడైనా ఒకసారి వెళితే గాని మళ్లీ రాలేదని అనుకుంటూ వుండరేమో! అదికాక ఇటువంటి దూరపు (తనకు ఏమీ సంబంధంలేని!) చుట్టాలింటికి వెళ్లితేనే కడంవాళ్లు "అవును, మీరు వారింటి కెళ్లుతారుగాని మా యింటికి వస్తారుటలెండి!" అని కుములటానికి అవకాశం వుంటుంది. మరో ముఖ్యమైన విషయం — "సత్యంగారు ఎంత మంచివారు! ఎక్కడికీ వెళ్లరు, మాయింటికి వచ్చారు" అని చెప్పుకుంటారు. పైపెచ్చు ఏ దగుల్బాజీఅన్నా "ఎక్కడికీ ఆయన రాడే" అని కూస్తే తను ఫలానిచోటికి వేంచేసినట్టు రిజిష్టర్డుడాక్యుమెంటు ప్రొడ్యూసు చెయ్యచ్చు. వెళ్లకవెళ్లక దూరపువారింటికి వెళ్లితే జరిగే మర్యాదలో వున్న మజాలోని మైనరుడిటెయిల్స్ అతనికి ఒక్కొక్కటే జ్ఞాపకానికి వస్తున్న మొహం పెట్టి

"ఏమయితే ఏం, ఇంకా గంట ఆలస్య ముంది" అని తేల్చుకున్నాడు.

ఎందుచేతనో అతనికి వెళ్లాలని నిశ్చ యించుకున్నప్పటినించీ ఆదుర్దా ఎక్కువైంది! ఆమరుక్షణం అతను తనభార్య మేనత్తమన మడికి కాబోయే అత్తగారింటో వుంటే ఎంతబాగుండేది! ఎట్లాగైనా అందరూ తనని మర్యాదచేయటానికిగాని, తాను చేయించు కోటానికిగాని ఒక్కపూట ఏంసరిపోతుంది? పైగా రాత్రిపూట! అంతా అయి భోజనా లయేటప్పటికే ఒంటిగంట అవుతుందే? ఆ తర్వాత ఎవరికి వారు నిద్రపోవటమో, లేక ఇళ్లకు ప్రయాణమయ్యే ప్రయత్నంలో వుండ టమో జరుగుతుంది గాని అందరూ చుట్టూ చేరి, "వచ్చారా!" అన్న భావంతో చిరునవ్వు నవ్వే అవకాశం ఏదీ? పెళ్లి అయిదురోజులూ అయితే చాలాబాగుండేదని వేరే చెప్పనక్క ర్లేదు. అయినా అయిదురోజుల మర్యా దలో మజా లేదు. రెండురోజు లయ్యేటప్పటికి స్టేల్ అయిపోతుంది. కాని అయిదురోజులయితే మధ్య మూడోనాడో నాలుగోనాడో అందరూ ఎంత బతిమాలినా వినక వచ్చేసి వాళ్లిదుంప తెంపటానికి అవకాశం వుంటుంది మరి! ఇప్పుడు ఒక్కపూట పెళ్లిఆయె! యిహ వాళ్ల దుంప తెంపాలంటే భోజనాలు కాక పూర్వం "వెళ్లుతున్నా" నని బయలుదేరాలి. అట్లా చేస్తే వాళ్లు దుంపతెంచుకోకపోగా వెళ్లేవాడి నోట్లో వుమ్మేయటానికికూడా అవకాశం వుంది! పోనీ, భోజనా లయిన తర్వాత బయల్దేరితే, ఎవ్వరూ వుండమని బతిమాలే ఛాన్సు కాదాయె. మహా కోరితే, తర్వాత ఎప్పుడన్నా ఒకసారి రమ్మం టారు. మొత్తంమీద డెబిట్ క్రెడిట్ సమానమన్నా కాలేదు. సత్యానికి దిగులు పుట్టింది. కర్తవ్యం? టైము చూశాడు. రైలుకు అరగంట వుంది. వెళ్లటమా, వెళ్లకపోవటమా? స్నానం చేస్తూ ఆలో చిద్దామనుకున్నాడు. మొదటిబొక్కెన నీళ్లు శరీరానికి తగలగానే ఏమయితే అయింది, వెళ్లితీరాలని సంకల్పం కలిగింది. పూజా పురస్కారాలు లేక బూజెక్కి ఉన్న అతని ప్రాణి, పాపం, వాటికోసం ఎంతతపిస్తున్నదో!

స్నానం పూర్తి చేసి చలవచేసిన బట్టలు కట్టుకుని గుర్రంబండి ఎక్కి స్టేషను చేరి, గుంటూరికి టిక్కెట్టు తీసుకొని రైలు పెట్టెలో కూలబడేటప్పటికి రైలూ కదిలింది, సూర్యుడు మరో ప్రాంతం చేరుకున్నాడు. రైలు తప్పేదే! పైన భగవంతుడు లేడూ!

3

ఒక గంటలో రైలు గుంటూరు చేరింది. అందరితోపాటు సత్యం టిక్కెట్టు ఇచ్చేసి బయటికి వచ్చాడు.

"బండి కావాలా మహారాజ్!"

అని సాయిబు అడిగేటప్పటికి సత్యానికి ఎక్కడికి వెళ్లాలిసిందీ తెలియదని తెలిసింది! అతనిమనస్సు ఎందుచేతనో ఎక్కడికి వెళ్లాలో తెలియకపోతే ఎంత ఇబ్బందో గ్రహించ లేదు వెంటనే. బండీవాడు మళ్లీ అడిగేటప్పటికి అతనికి తన భవిష్యత్తు అర్థమయింది. బండి కావాలి! కాని ఎక్కడికి? పెళ్లివారింటికి! పెళ్లివారిల్లు ఎక్కడ? స్టేషనుకు మొక్కువ దూరం లేదు! ఎన్నడూ ఎక్కడికీ వెళ్లనికారణంచేత తన చుట్టాల ఇళ్లుకూడా తెలియవు సత్యానికి. పెళ్లివారింటికి అని చెప్పి బండి ఎక్కేటంత మూఢుడైనా బాగుండేది సత్యం.

వాడు తిప్పితిప్పి గూబలుమెలేసి వాడికి కావలి సిన డబ్బు వసూలుచేసేవాడు బండివాడు!

"ఏమండీ చెప్పరు, మారాజ్ !"

కావల్సనిగాని, అక్కర్లేదనిగాని త్వర గా చెప్పాలని సత్యానికి అనహ్యంగా అర్థ మయింది. ఏమయితే ఏం, "అక్కర్లేదు" అన్నాడు. పంతులుగారు ఏదోఆలోచిస్తున్నా రనుకుని బండివాడు కొంచెము ప్రపంచం చూసినవాడు కావటంచేత అయిదునిమి షాలు అక్కడేనిలుచుని సత్యానికి ఆలో చించుకోటానికి అవకాశం యిచ్చి మళ్లీ అడిగాడు.

"బండి కావాలి కాని —" వెంటనే ఆపాడు సత్యం, ఎక్కడికి వెళ్లాలో తనకు తెలియదని చెప్పటం ఇష్టంలేక.

"మంచి గుర్రం మారాజ్! బాగా పోతేనే డబ్బులు ఇయ్యండి" అన్నాడు బండి వాడు.

"నాకు అక్కర్లేదోయి !" అన్నాడు చివరకు సత్యం.

బండివాడు ఒక్కతుణం సత్యంవంక చూసి లుంగీవిప్పి మళ్లీకట్టుకుని వెళ్లిపోయి బండికాస్తా రైలుకాంపౌండుచివరనిలబెట్టాడు. వాడికి ఆశవదలకపోగా ఆశ ఎక్కువయింది. ఏపిల్లదానింటికో వెళ్లే చెయ్యి అనీ, తనకు అథమం అర్ధరూపాయి అయినా ముట్టు తుందనీ వాడికి గట్టినమ్మకం కలిగింది. అటు వంటి మనుష్యుల్ని తొందరపెట్టకూడదని వాడికి తెలుసు!

సత్యంఅవస్థ సత్యంది! రాత్రి ఎనిమిది గంటలు కావస్తున్నది. తనస్థితి వర్ణించటం ఎవరికి చాతవుతుంది ? పెళ్లివారిల్లు ఎక్కువ దూరంలో లేదని అతనికి తెలుసు. కాని ఎక్కడో తెలియదు. పోనీ, యింటివారి పేర యినా తెలుసునా అంటే, అదీ తెలియదు! గుంటూరు తనకు పాతదైనప్పటికీ పెళ్లి వారిల్లు అతనికి అందరాని దయింది. రైలుస్టేషనుకు ఎక్కువదూరంలో లేని యిళ్లు ఎన్నని వెతుకుతాడు? పైగా ఏవై షని? సత్యానికి ఏదో ఆవేదన కలిగింది. తన ఎదుట తను లేకుండా అరగంటలో తనచుట్టాలఇంట్లో పెళ్లి జరగబోతున్నది. తను ఎన్నడూ వెళ్లకవెళ్లక వెళ్లట మేమిటీ, చివరకు నిజంగానే వెళ్లలేక పోవట మేమిటీ ? తను గుంటూరువచ్చినట్టు ఎవరికీ తెలియకపోయినప్పటికీ, ఒకవేళ తెలిసినా పెళ్లికివెళ్లినట్టూ, ఇల్లుతెలియక వెళ్లకపోయి నట్టూ ఎవరికీ తెలియకపోయినా అతనికి ఈస్థితి రుచించలేదు. అతనికి చెప్పలేని వ్యక్తి ఉందరిమీదా ఏకారణంచేతనో మండింది. తన కింత పరాభవం! ఏమైతే అయింది, పెళ్లివారిల్లు కనుక్కోవా లనుకున్నాడు. కాని అతని తరమా ?

ఇల్లు తెలిసింతరువాత ఈయిల్లు కను క్కోలేకపోయినా మేమి టని అందరికీ ఆశ్చర్యం వెయ్యొచ్చుకాని తెలియకముందు అది తెలుసుకోవటం ఎంతకష్టమో సత్యాని కర్థమయింది. ఎవరో మీకోసం వచ్చారని చెప్పినప్పుడు ఎవరో తెలియక ఎట్లా వున్నా డనీ, అవీ ఇవీ అడిగి, తర్వాత వచ్చిం దెవరో తెలిసింతరువాత "ఓరినువ్వా!" అని అంటాము. వున్నసంగతి అది!

పెళ్లివారిల్లు బ్రాడీపేటలోనో, లేక అరండలుపేటలోనో, లేకున్న ఈరెంటిమధ్య

నో వుంటుందని సత్యం విధిలేక అనుకోవలసి వచ్చింది! వెంటనే బయల్దేరాడు.

“ఎక్కడండి, మహారాజ్!” అని, అంత వరకూ బండిలో పడుకుని సత్యాన్ని చూస్తున్న బండివాడు, సత్యం బండిదగ్గిరికి రాగానే అన్నాడు.

“నా కక్కర్లేదు!” అని సత్యం నడచి వెళ్లిపోయినాడు. సత్యం అరండలుపేట పొయ్యేదారి తొక్కటంవల్ల వదిలిపెట్టాడు గాని పూరివేపు తొక్కితే వెంటబడే వాడే బండివాడు!

సత్యం ఎక్కడికి వెళ్లాలో తెలియకపోవటంవల్ల నెమ్మదిగా నడుస్తూ థియోసాఫికల్ లాడ్జిదగ్గరకు చేరుకున్నాడు. అక్కడికీ, రైలు గేటుకూ మధ్య వుండటానికి అవకాశం లేక పోలేదు పెళ్లివారిల్లు! కొంచెం మళ్లీ వెనక్కు వచ్చి అరండలుపేటలో ప్రవేశించాడు. రెండు అడ్డురోడ్లు దాటేటప్పటికి ఒక ఇంట్లో గాస్ లైట్లూ అవీ వెల్తురుగా వున్నయి. ఎవరో ఒకాయన బయటికి వచ్చాడు. వాకిలి కెదురుగ్గా సత్యాన్ని చూచి “పదరేం? లగ్నం జరుగుతుంటే!” అన్నాడు. సత్యం కొంచెము అనుమానంతోనే లోన ప్రవేశించాడు. హడావిడిగా వుంది. చుట్టూ జనం, మధ్య గుడ్డ అడ్డంగా పట్టుకుని పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ కూచున్నారు. మొహాలన్నీ పరికించి చూచాడు. తనభార్యవైపుచుట్టాలు ఒక్కరూ కనపడలేదు. పెళ్లిచేయించే ఆయన సత్యంవంక చూచాడు. ఆయనకు తెలియని వ్యక్తి గావటంవల్ల ఆయనధోరణిలో ఆయన వున్నాడు. సత్యానికి చొక్కా వుత్తరీయాలు లేకుండా ఏగావంచో వుంటే కూచోమనే వాడే, అధమం సంభావనకోసమన్నా! పెళ్లివారిల్లు కావటంచేత ఎవ్వరూ అతన్ని ఎరగకపోవటంవల్ల ఏమీ అనలేదు. చప్పుడు కాకుండా బయటికి వెళ్లాడు!

ఏమయితే అయింది, నడవటం మొదలు పెట్టాడు. కొంతసేపటికి మళ్లీ పెళ్లివారింటిలాంటిది కనిపించింది. ఈతడవ వీధివాకిట్లోనించే చూచాడు లోపలికి. పెళ్లికొమారుడు భార్యకు తాళి కట్టుతున్నాడు. అయిదు నిమిషాలు జాగ్రత్తగా పరకాయించాడు స్త్రీపురుష విచక్షణ లేకుండా! ఎక్కడా ఎవ్వరూ కనిపించలేదు. అసలు పోలికే లేందే!

మళ్లీ నడవటం ప్రారంభించాడు. ఆ రోడ్డుచివరదాకా వెళ్లాడు. ఏమీ అంతు చిక్కలేదు. పక్కరోడ్డు పట్టాడు. కొంత దూరం నడవగానే ఇంకో పెళ్లియిల్లు కనపడ్డది. సత్యం అదృష్టంకొద్దీ పెళ్లిళ్లు అన్నీ ఆరోజునే జరుగుతున్నయి! తొంగి చూచాడు బయటినించి. ఇక్కడకూడా సత్యాన్ని ఆదరించేవారు అగపడనేలేదు. తరువాత ఎన్ని బజారులు తిరిగినా అసలు లైటువున్న కొంపే కనపడలేదు. ఎవరికివారు భోంచేసి పడుకునే సమయం. పెళ్లి పోతే పోయింది, భోజనాలకైనా అందుకుంటామా అని అనిపించింది.

ఇహ బ్రాడీపేట! మధ్యరోడ్డు దాటుతుండగా కనిపించింది మరొక పెళ్లివారిల్లు. లోపల హడావిడిగావుంది. లోపలికి తొంగి చూచాడు. తగినవారికి యథాశక్తి సంభావన యిస్తున్నారు. బైట యిద్దరు నిలబడి వున్నారు. “లోపలికి దయచేయండి” అన్నారు. సత్యం కొంచెం దూరాలోచన చేసి అక్కడినించే చూశాడు. ఎవ్వరూ

ఎరిగున్న ముఖంతో లేరు. "పెళ్లివారి దేవూ"రని ప్రశ్నించాడు. వాళ్లు "విశాఖపట్టం" అని చెప్పారు. వెంటనే బయలుదేరాడు. రోడ్డు దాటి బ్రాడీపేటలో ప్రవేశించాడు. ఎంతదూరం పోయినా పెళ్లికొంపే కనపడలేదు. అరండలుపేట నయం!

కొంతదూరం నడిచింతరువాత సత్యానికి విసుగూ, విచారం కలిగింది. తనదే పొరపాటు! చలికాలం కావటంచేతనూ, రాత్రివేళ కావటంచేతనూ సత్యానికి చలికూడా బాధించటం మొదలుపెట్టింది. మూడు గంటలనించీ నడుస్తూవుండటంవల్ల కాళ్లు నొప్పులుగా వున్నాయి. గుంటూరు దుమ్ము అతిశ్రేష్ఠమైనది కావటంవల్ల పాదాలు ఆ పదార్థాన్ని చేతనైనంతా స్వీకరించినై. ఈశ్వరుణ్ణి తలుచుకుంటూ ముఖం తుడుచుకున్నాడు వుత్తరీయంతో. వుత్తరీయానికి ముఖం ఎదురుతిరిగింది. గట్టిగా తుడిచాడు. ముఖాన అంటిన దుమ్మంతా వుత్తరీయానికి అంటుకుంది.

అతనికి ఆకలికూడా భరింపరానిదయింది. మొత్తంమీద బ్రాడీపేటచివరదాకా నడిచాడు. పన్నెండుగంటలయివుంటుం దనుకున్నాడు. ఇహ చాలు ననుకుని స్టేషనుకు చేరుకుందా మనుకున్నాడు. అయినా వచ్చినదారినే వెళ్లట మెందుకని పక్కరోడ్డు పట్టాడు. బ్రాడీపేటమొదటికి వచ్చేటప్పటికి ఒకయింటోనించి గాసులైటువెలుతురు ద్వారంగుండా వచ్చి వీథిమీదుగా ఎదుటింటి గోడమీదకి ఎక్కింది. అదీ పెళ్లివారిల్లే. అంతా నిశ్శబ్దం. వాకిలిఎదురుగా ఆదీపపు వెలుగులో యానాదివాళ్లు ఇద్దరు బట్టలు పట్టుకు నిల్చున్నారు. ఎవరో బ్రాహ్మడు లోపల్నించి వచ్చి ఎంగిలాకుల విస్తళ్లన్నీ వాళ్లబట్టలో పడేశాడు. చుట్టూ చీకటి! పెళ్లివారింటోనించి గాస్‌లైటుచప్పుడు తప్ప ఏశబ్దమూ రావటంలేదు. అది నిజంగా తనచుట్టాలతాలూకు పెళ్లివారిల్లయినప్పటికీ సత్యానికి లోన ప్రవేశించటం ఇష్టంలేదు! కాళ్లీడ్చుకుంటూ స్టేషను చేరాడు.

స్టేషనులో గడియారంలో ఒంటిగంట కావస్తున్నది. ఇంకా నాలుగుగంటలు గడిపితే రైలు వస్తుంది. ఇంతలో అతనికి ఇంకో ఆలోచన వచ్చింది. పెళ్లివారుకూడా తెల్లారకట్ల రైలుకే బయలు దేరివస్తారు! తనను చూస్తే వాళ్లు ఏమనుకుంటారు! ఏమయినా, సత్యానికి ఎక్కడికీ వెళ్లే వోపిక లేదు. తెలిస్తే తెలిసింది అనుకున్నాడు.

ఆచలిలో చల్లగావున్న బెంచిమీద ఏమినిద్ర పడుతుంది అతఃస్థితిలో వున్నవాడికి? టైము యెలా గడిచిందో తెలియదు. నిద్రపోయినాడో లేదో అతనికి తెలియదు. అతను లేచేటప్పటికి స్టేషను స్వల్పంగా హడావిడిగా వుంది. వెళ్లి ప్లాటుఫారంమీద నిల్చుని చూశాడు. వెధవమొహం వేసుకుని రైలు గుంటూర్ని యెక్కుతున్నది! యెంచేతనో పెళ్లివా రెవ్వరూ అతనికి తగలలేదు. అసలు రైల్లో యెక్కిందే పదిహేనుమంది.

ముఖం కడుక్కుని, వూళ్లో కాఫీహోటలులో తిని, పేపరు కొని కాఫీహోటలులోనే

చదివి, యెట్లాగైతేనేం చేతనైనంత ఫ్రెష్‌గా యెనిమిది గంటలకు ఇంటికి చేరుకున్నాడు. ఇల్లంతా హడావిడిగా వున్నది! పెల్లివారే! కొత్తమొహాలూ పాతమొహాలూ కలిసి వున్నాయి. మరుక్షణం రాజమ్మ కనిపించింది.

“మీరు యెప్పుడు వచ్చారు?” అన్నాడు సత్యం.

“తెల్లారకట్ల బస్సులో వచ్చాం! మేం వచ్చేటప్పటికి మీరు లేరే, యెక్కడికి వెళ్లారు?” అన్నది రాజమ్మ.



పూర్వమేఘమునకు సౌందర్యవ్యాఖ్య :

# అలకానగర మార్గనిర్దేశము

[గత సంచిక తరువాయి]

---

శ్రీ మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి

- దారిలోని స్థలవిశేషములు
- ఆయాస్థలముల గుణగణములు
- అక్కడక్కడ మేఘుని కర్తవ్యతలు

మార్గనిర్దేశమున కాళిదాసు కొంత చాతుర్యమును ప్రదర్శించెను. మేఘమహాశయుని పశ్చిమాభిముఖముగ పోవలయు నని నుడివెను. ఏల యన, మేఘుడు సరాసరి రామగిరినుండి యుత్తరాభిముఖమున పోయిన రెండవ గంగాయమునాసంగమము నతిక్రమించి యయోధ్యమీదుగా నరుగవలయును. రఘువంశము త్రయోదశసర్గయందు పుష్పకరథము నిర్గమించిన మార్గమునకే ఈ మేఘునుగూడ పోవలసియుండును. తన కత్యంత ప్రియ మగు భూమిని చూపించుటకు కవి కవకాశ ముండదు. అందువలన కవి సకౌశలమున మేఘుని ఉన్నతభూములమీదుగా ఒకింత పశ్చిమాభిముఖముగ నరుగవలయు నని నుడివెను. ఇందువలన పథ మొకింత వక్రమాయెను. కాని నూతనభూములను జూపించుటకు కవికి మిక్కిలి యనుకూల మేర్పడెను. అటుపిమ్మట ఉజ్జయినిని చూపించుటకు పథమును మరింత వక్రముగ నొనర్చెను.

## ఆమ్రకూట పర్వతమునందలి అందచందములు

కొలది సమతలభూమియందు రామగిరి పెరిగి యున్నది. ఆ సమతలభూమికి ఉత్తరపూర్వమందున, పశ్చిమమునను అగ్రమును ఛేదించుచుండు పర్వతమాలలు ధనురాకారముగ నుండెను. రామగిరిని ఆలింగన మొనర్చుకొని యుత్తరముఖమున ప్రయాణము సాగించినచో ఆకసమును చుంబించుచుండు పర్వతపంక్తులు మేఘమహాశయుని అడ్డగించును. అందువలన కాళిదాసు మేఘుని ఉత్తరదిశ కెగిరి యొకింత పైకు మరలి, తిరిగి యుత్తరముఖమున పొమ్మని నుడివెను. కాని యప్పుడుగూడ ఆకసమును చుంబించు పర్వతమాలలే. దక్షిణవాయువు మేఘము నుత్తరదిక్కునకు నెట్టినయెడల కొంత లక్ష్యవచ్చును. అందువలన మేఘము పశ్చిమముఖమున నిర్గమించుచు. ఈ విధముగ నుత్తరముఖమున పోవుచు, మాలభూములపైనుండి మాళవదేశమును జేరి నిర్గమించుచుండిన ప్రథమమున ఆమ్రకూట పర్వతమును జేరను. దాని నిప్పుడు 'అమరకంటక' మని పిలుచుచుందురు. ఈవిస్తృతపర్వతమున కున్నతశిఖర మొక్కటిమాత్రమే కలదు. ఈ మహాపర్వతము చాల దూరమువరకు వ్యాపించి యున్నది. దీని కొకదిక్కున నర్మదానదియు, మరియొక దిక్కున మహానదియు, వేరొకదిక్కున శోణానదియు ప్రవహించుచుండును. ఆమ్రకూటపర్వతపు ఉచ్చశృంగము చాలదూరమువరకు జరిగి, కదళీపుష్పాగ్రరూపమును దాల్చియున్నది. మేఘమహాశయా, ఆపర్వతము నీకు మిక్కిలి ఋణపడి యున్నదిసుమా! దాని వనములు దవానలమువలన దగ్ధమగునప్పుడు నీవు సంతతధారగా వర్షించి యాకార్చిచ్చు నార్పుచుందువు. అందువలన నీవిచ్చటకు మనసునకు దట్టినంతనే యామ్రకూటుడు మిక్కుటముగ సంతసించును; నిన్ను శిరమున దాల్చును. నీ వాతనికి మహోపకార మొనర్చియుంటివి. కావున పథిశ్రమవలన నాశ్రయమును గోరు నిన్ను చులకనగ జూడడు. అతనిని

అల్పునిగ దలపజనదు సుమా! అతని సుప్తకము మహోన్నతము. అతఁ డెప్పుడును తలవంచు కార్యమును జేయఁడు. అందువలన నాతఁ డసత్యముగ నిన్ను తల దాల్పును. అరటిపూవు మొనవలె నుండు ఆ యుత్తుంగ పర్వత మూర్ధాగ్రమందు నీవు కూర్చుండుము. అప్పుడు నీయాకారము నూనెరాసిన జుట్టుముడివలె నుండును. ఆముడి శిరమునకు వెనుక కాదు, ముందుకాదు, ప్రక్క కాదు; నడిశిరస్సున నుండును. కృష్ణవర్ణమున నిగనిగలాడుచుండు నీక్రింద కదళీ పుష్పాగ్రమును బోలి విస్తారముగ వెడగి ప్రకాండమగు పర్వత రాజము చాలభూమి నాక్రమించి యుండును. పర్వతము నిండ నడవి మామిడి పండ్లు పండిపోవును. వాని రంగు పర్వతపు వెలుపలిభాగమున గ్రమ్ముకొనియుండును. బాగుగ పండిన మామిడి పండ్ల రంగునను, రమణీమణుల మిసమిసలాడు శరీర చ్ఛాయలకును భేద మేమైన నుండునా? మామిడిపండ్ల రంగున విలసిల్లుచు, ప్రకాండకదళీపుష్పాగ్రరూపమున నున్న పర్వతాగ్రముమీద కాలమేఘుడ వగు నీవు జుట్టుముడిని బోలి విశ్రమించినప్పుడు దేవమిథునములే గుంపులు గుంపులుగ వచ్చి నిన్ను గాంచుచుందురన ఇక మానవులనుగూర్చి చెప్పవల దేమి?

ఆపర్వత మంతయు వృక్షములతో నిండి యుండును. అందు కుంజ వనములు మిక్కుటము. అవి వనవాసుల కానందస్థానము లనుటయందు సందేహముండునా? అచట నీ వొకింతకాలము విశ్రమింపుము. పూర్తిగ వర్షింపుము. నీబరువు తగ్గును. వెంటనే బయలుదేరి శీఘ్రగమనమున కొంతదూర మరుగునప్పటికి నర్మదానది గాన్పించును. అది మానసిక - ఉత్కట-ఆవేగరోగమువలన వింధ్యపర్వతపాదములయందు బడి యున్నది. ఆహా! అది యెట్టి దారుణ ఉత్కటావస్థ! వింధ్యపాదములు సామాన్యపాదములా? కొండలు గుట్టలు-లోయలు- రాళ్లురప్పలు- మొదలగువానితో గందరగోళముగను, కర్కశముగను నుండును. అట్టి మూర్ఖుని పాదములు పట్టుకొని వెఱ్ఱిదానినిబోలి పడియున్నది. నిమ్నభాగమందు స్వచ్ఛజలయుక్తమగు నర్మదానది విస్తీర్ణమై ప్రవహించుచుండును. పర్వత పృష్ఠమునుండి వెలరేటిధారలు నర్మదానదియందు బడుచుండును. దూరమునుండి చూచువారల కాపర్వతము అలంకరించిన మహానాగమునుబోలి దర్శనీయమై యుండును. ఏనుగులకు పట్టెలుపట్టెలుగ రంగులను బూయుచుందురు. అట్టి యేనుగులను జూచినవారు మాత్రమే యీరూపమును గ్రహింపగలుగుదురు.

నీ వచట పూర్తిగ వర్షించి తిరిగి నర్మదా నదీ సలిలములను సమృద్ధిగ గైకొని ప్రస్థాన మొనర్పుము. అచ్చటి వనములు నేరేడుచెట్లతో నిండి నిబిడీకృతమైయుండును. ప్రవాహతీవ్రతను నేరేడువృక్షసమూహ మడ్డగించుచుండును. అందువలన నొకవృక్షమునుండి మరియొక వృక్షమునీదకు లంఘించుచు శరీరములను బోగొట్టుకొని తేలిక యగును. వింధ్యపర్వతము బృహత్తర మత్త మాతంగమును బోలి యత్యంత గాంభీర్యమున నలరారుచుండును. అనగా నచట అడవియేనుగు తండములు మిక్కుటము. అవి అచ్చటచ్చట నర్మదా నదియందు జలకమాడుచుండును. అందువలన వాని మదధారల మిశ్రితమగు నర్మదాప్రవాహము సుగంధయుక్తమై యలరారుచుండును. ఆజలమును కడుపునిండ గ్రోలుము. అటులయినచో వాయువు నిన్ను దూదిపింజను బోలి యెగురగొట్ట జాలదు.

సంస్కృత సాహిత్య మంతయు ధ్వనిప్రధానము. అందువలన శబ్దజాలము కూర్పునుండి మరియొక యర్థము బహిర్గత మగుచుండును. రోగికి వమనమున కౌషధము నిచ్చి వమనమైనపిమ్మట తేలిక యగు తిక్తకషాయమును ద్రావించుటవలన కఫ మడగును. అతడు క్రమక్రమముగ బలవాను డగును. వాతరోగము వానిదరి చేరజాలదు.

మహాశయా, నీ వచట తిరిగిన నచట కదంబపుష్పములు వికసించును. కోశాకారముగ నుండు నాచెట్టు గాత్రమునుండి యసంఖ్యాకముగ మొగ్గలు వికసించి కేసరములు బహిర్గత మగుచుండును. మరికొన్ని వెలువడుటకు బ్రయత్నించుచుండును. అత్తరి వాని చిత్రవిచిత్రవర్ణ విన్యాసము నేత్రపర్వ మొనర్చుచుండు ననుట యతిశయోక్తి కాదు.

భూమినుండి అత్యంతసుగంధయుక్తమగు పరిమళము నలుదిక్కుల వ్యాపించి మనస్సునకు ఉల్లాసమును గలిగించుచుండును. హరిణబృందములు పుష్పములతో కలరారుచుండు కదంబవృక్షముల సొబగునకు తన్మయత్వమొందుచు, లేలయరటిపిలకలను తినుచు, భూగంధము నాఘ్రాణించుటవలన మదమత్తమై పరుగిడుచుండుటను గాంచగలవు. ఆదృశ్యమును గాంచి మానవులు మేఘుడీమార్గముననే యరిగెనని గ్రహించుచుందురు సుమా!

మిత్రమా, నీవు నాప్రేయసికి సందేశ మొసగుట కరుగుచున్నావు. నాప్రాణము తల్లడిల్లుచున్నది. ఆలస్యమునకు సహింపజాలను. కాని యేమిచేయుదును? ప్రతియొక పర్వతమందును నీ వొకింత ఆలసింపక తప్పదు. కొండమల్లెపూలు నీ కత్యంతప్రియములు గదా! పర్వతములన్నియు నూతనముగ పుష్పించిన కొండమల్లెపూవుల సుగంధముతో క్రమ్ముకొనియుండును. అందువలన నీ వచట నాలసింతువు. అంతే కాదు. మయూరములు నేత్రములయందలి శ్వేతప్రదేశమును గిరగిర త్రిప్పుచు, సజలనయనముల నిన్నాహ్వానించుచుండును. మరియు నీసమ్ముఖమున నానందపూర్వనృత్య మొనర్చును. ఆనృత్యమును గాంచక యరుగుట కేరికైనను సాధ్యమగునా?

## దశార్ణదేశ వర్ణన

మహాశయా, నీ వచటనుండి దశార్ణదేశమున కరుగుము. దానినే పూర్వమాళవదేశ మందురు. దాని సౌందర్య మపార మనువిషయము నీవెరుగుదువుగదా! దాని ప్రాంత్యదేశమంతయు నేరేడు వృక్షములతో నిబిడీకృతమైయుండును. నీ యాగమనమువలన నేరేడుపండ్లు చక్కగ మగ్గును. గాఢమగు పచ్చని కాంతు లీనుచుండు ఆ పత్రములు, దట్టమగు కృష్ణవర్ణము నీనుచుండు కొమ్మలు, రెమ్మలు, ఆకుల తొడిమెలు, ఈనెలు, వానిపైని నిరుపమాననిగనిగద్యుతుల నలరారు నీలకాంతుల నీనుచుండు ఫలములు — ఆప్రదేశమంతయు అత్యంతరమణీయమై యలరారుచుండునని వేరుగ నడుగవలయునా? భారతవర్షమందు అగణిత ప్రకాండ ఉద్యానవనములు మాళవదేశమందు గలవు. అందు మొగలిచెట్లు మిక్కుటము. నీ వరుగునప్పటికవి మొగ్గల నీనుచుండును. కాని పూర్తిగ వికసించుటకు కొలదికాలము పట్టునుసుమా! ఆ యవికసితకేతకీపుష్పసమూహము కేవలము ధవళకాంతుల నీనుచుండును. అవి యొకింత వికసించినను ధవళమేను. అందువలన నావనములు ధవళకాంతుల నాచ్ఛాదితమై నిన్ను ముగ్ధునిగ నొనర్చుచుండును. కాని నీ వేగునప్పటికి తరుశాఖలయందు కాకములు గూర్చుండి కలకలరవ మొనర్చుచుండును. అందువలన నావృక్షములు కలకలరవమయము లగునని వేరుగ చెప్ప నవసరము లేదు. నీ వెంట మానససరోవరమునకు బయలుదేరిపోవు హంసలు దశార్ణదేశమందు కొన్నిదినము లుండి మరి ప్రయాణ ముపక్రమించును.

## వేత్రవతి

దశార్ణదేశమునకు రాజధాని విదిశానగరము. దాని కీర్తి దిగ్దిగంతవ్యాప్తము. నీవు మిక్కిలి విలాసుడవు. అట కేగినచో నీ విలాసవాసన సంతృప్తి యగును. నీ మనోవాంఛిత మీడేరును. ఏల యన, నీవు వేత్రవతీనదీజలమును ప్రచురపరిమాణమున పానము చేయుదువు. నీకు ముఖ్యమగు రసతరంగిణి వేత్రవతియే కదా! అది విదిశ నంటి ప్రవహించుచుండును. అందలి తరంగము లొకదాని నొకటి యతిక్రమింప ప్రయత్నించుచుండును. ఆ దృశ్యము నిన్నొక ప్రౌఢస్త్రీ భ్రూభంగిమ మొనర్చుచు ఆహ్వానించుచున్నటుల దోచును. జలపానమువలన ముఖచుంబనఫలము కలుగును. నదీగర్భమునుండి జలము గభీరనినాదముల నుపకూలముల నాక్రమించునప్పుడు దూరమున కా ప్రతిధ్వని వినవచ్చుచుండును. అందువలన విలాసిని యగు యువతి యావేగభరమున నవ్యక్త మధురధ్వని నొనర్చుచు "ఆశ పూర్తికాలేదు—ఆశ పూర్తికాలేదు" అని స్వీయ మనోభావమును వ్యక్తీకరించుచుండునటు లుండును. భ్రూభంగిమమునకును, పర్వత నదీతరంగములకును పోలిక యెంతటి మధురము! ఎంత మనోహరము!

రాజధానినుండి బయలుదేరి 'నీచైర్గిరి'యందు విశ్రమింపుము. ఆపర్వతము 'నీచై'నామమున బరగు

పట్టణము నామకొనియుండును. నీ స్పర్శవలన నాపర్వతుని శరీరము పులకాంకురితమగును. ఆపులకలు కదంబపుష్పములనుబోలి వికసించును. అది కూర్మపృష్ఠమువలె మూడునాలుగువందల అడుగుల యెత్తునమాత్ర ముండును. అచట బౌద్ధస్తూపములు, బౌద్ధవిహారములు, బౌద్ధసంఘారామములు మొదలగునవి యుండెను. వాని సంబంధమగు శిలాగృహములు నేటికిని గలవు. అవి నిర్మానుష్యములు. నగరసమీపమం దిట్టి నిర్జన గృహములను గాంచ దలచుచో హిమవన్నగమునకు బొమ్ము. కాని యీ గృహములయం దేముండును? ఏమియు నుండదు. కాని అవి రహస్యస్థానములు సుమా! రహస్యమేమన, ప్రథమదశయందు యౌవనోద్రేకమున దగుల్కొనియుండు నగరవాసులు ధర్మబంధనములను, ఉపదేశ నాగపాశములను తెగద్రెంచుకొని యచట స్వేచ్ఛగ విహరించు చుందురు.

కావున, స్నేహితుడా, నీ వానీచైర్గిరియం దొకింత విశ్రమించి బయలుదేరుము. నీకు మార్గమందు చిన్న చిన్న నదులును, సెలయేళ్లును గాన్పించును. వాని కిరువైపుల పుష్పోద్యానవనము లుండును. అందు కేవలము అడవిమల్లెపూవులు పుష్పించియుండును సుమా! నీవు తొలిమేఘుడ వగుటవలన వానిని సన్నని నీటిబిందువుల దడుపుము. పుష్పములను గోయుచుండు పుష్పలావికలు అలసియుందురు. వారి మోములనుండి చెమట కారుచుండును. కట్టువస్త్రములు పుష్పములతో నిండియుండుటచే చెమటను తుడుచుకొను టెట్లు? వ్రేలాడుచుండు కర్ణాభరణములగు కలువలనుండి చెమటబిందువులు క్రిందబడుచుండును. అందువలన కలువలు వాడునని వేరుగ జెప్పవలయునా? ఆయవస్థయందు వారి కొకింత ఛాయాదానము నొసగినచో వా రానందవిస్ఫారిత నేత్రముల మోములను పైకెత్తి కృతజ్ఞతాహృదయమున నిన్ను గాంచుచుందురు. ఆ నిష్కళంకముఖులతో నీ వొకింతవడి సల్లాపము లొనర్చి మరి యరుగుము.

## ఉజ్జయినీ సుందరులు

నీవు ఉత్తరదిక్కున బోవుచున్నావు. ఉజ్జయిని విదిశానగరమునకు దక్షిణపశ్చిమ దిక్కులయం దున్నది. ఉజ్జయినిని జేరవలయు ననిన వక్రమార్గమున నిర్గమింపవలయును. అయినను నాయనురోధము— నా పనిమీద నీ వరుగుచున్నావు. ఉజ్జయినిని మాత్రము చూడకుండ బోవలదు సుమా! ఆ మహానగరమందలి సౌధశిఖరముల నొకింత విశ్రమించి బయలుదేరుము. నీవు పైనుండి నిర్గమించునప్పుడు అట్టాలికలపై నుండు విశాలస్థలములు, గోపురములు, శిఖరములు, శిఖరాగ్రములు నిన్నాహ్వానించుచుండును. వాని మనోరథమును సిద్ధింపజేసి మరి నిర్గమించుము. ఉజ్జయినీపురవాసినుల నయనములు మిక్కిలి మనోహరములు. అత్యంతచంచలములగు వారి యపాంగవీక్షణములు నేత్రకోణముల యందు నృత్యమొనర్చుచుండును. ఆ నృత్యచాంచల్య మపారము సుమా! వాని యెదుట విద్యుత్ఖేలన మత్యంతసామాన్య మనుట సాహసము కాదు. ఆవిద్యుద్విలాసనయనములతో కేళి సల్పనియెడల నీవు వంచితుడ వగుదువు. ఆత్మవంచనకు లోనైతివా, నీ జన్మయే విఫల మగును.

## నిర్వింధ్యానది

విదిశకు నొకింత పశ్చిమమున నిర్వింధ్య యున్నది. అది వింధ్యయొక్క కూర్మపృష్ఠమునుండి యుత్పన్నమై యుత్తరముఖముగ బోవుచుండును. అది దక్షిణమున సన్నతప్రదేశమున ప్రవహించుచు ఉత్తరమున కరిగినకొలదిని క్రిందికి దిగుచుండును. అందు పెద్దపెద్ద రాతిగుండ్లును, బండలును మిక్కుటముగ నుండును. జలప్రవాహము వానిచే నడ్డగింపబడి వెనుక కొకింత మరలి, తిరిగి వక్రగతుల వానిని దప్పించుకొని, వాని మీదుగ దూకి పారుచుండును. రాళ్లు బండలు మొదలగునవి లేనిచోట ప్రవాహము మిక్కిలి గంభీరముగను, నిశ్చలముగను నడచుచుండును. దానిమధ్య నందు సుడిగుండములు మిక్కిలి మనోహరములు సుమా! అవి విలాసినులు నాభిని చూపించుచుండునటు లుండును. నాభిని చూపించుట స్మృతిశాస్త్రములయందు నిషేధము. అయిన నేమి? నిర్వింధ్య లజ్జావిహీనురాలు, అందువలననే నాభిని చూపుచున్నది. నిన్ను మిక్కుటముగ వలచియున్నది. మొలనూలు ఘుం ఘు మ్మని ధ్వనించుచుండ నృత్యము చేయుచున్నది. మొలనూ

లెచ్చుట లభించె నందువా? హంసశ్రేణులు దానిని వరుసగ నతిక్రమించుచుండును. ప్రవాహవేగమున కడ్డు తగిలి శబ్దించినకొలదిని హంసలు 'ఫాక్, ఫాక్' అని యరచుచుండును. చంద్రహారశబ్ద మావిధముగ జేగదా యుండును? నిర్వింధ్య నీకొరకింత పిచ్చదైయున్నప్పుడు నీ వామెను వంచించుట పాడిగాదు. నన్నేల పిలుచు వని నీ వడుగవచ్చును. అది యత్యంతరంగభంగిమములనిన్నుగాక మరెవ్వరిని ఆహ్వానించును?

## విరహిణి సింధునది

సంస్కృతసాహిత్యమందు 'సుభగ' యను శబ్దమును స్త్రీలచే ప్రేమింపబడు పురుషుల సంబంధమునసే వాడుదురు. మిత్రమా, నీవు సుభగుడవు. సమస్తనదులు నిన్ను గోరుచుండును. అటు చూడుము. సింధునది వింధ్యకూర్మపృష్ఠమునుమీద నుత్పన్నమై సరిగ నుత్తరముఖమున ప్రవహించుచున్నది. పాపము! నీ విరహమునకు తాళజాలక రోగగ్రస్తయైయున్నది. అందు సన్నని జలధారమాత్రము పారుచుండును. అది దినముల వరుసను కృశించిపోవుచున్నది. విరహము వలన రక్తవిహీనమై పాలిపోవుచున్నది. తీరమందలి తరుసముదాయమునుండి రాలిన పండుటాకులతో నిండుచున్నది. ఇట్లు విరహవిహ్వలయై యుండుట సౌభాగ్యవిషయముగదా! ఎవని విరహమువలన రమణీమణి కాతరత నొందుచుండునో, వానికంటె సుభగుడనువా డెవ్వడు వారిమణికి? ఆహా! ఆమె యెట్టి పతిప్రాణయో గమనింపుము. పాపము! ఇప్పుడామె క్షీణత్వమును బోగొట్టుటకు ప్రయత్నింపుము. ఆలసింపకుము. అది నీహస్తమందే యున్నది.

సింధునదిని దాటి యవంతిని జేరుము. ఆదేశవాసులు బృహత్కథను చదువుచుందురు; ఇతరులకు జెప్పుచుందురు. తాము వినుచుందురు. అవంతిదేశమునకు రాజధాని విశాల, లేక ఉజ్జయిని. అది సమస్త సంపదలతో నద్వితీయముగ ప్రకాశించుచుండును. అది పార్థివనగరము కాదు. స్వర్గఖండమని యెరుగుము. అత్యంతశోభాయమానమగు నది భూతలమున కెట్లు వచ్చెనని శంకింపవలదు. దాని పుణ్యమింకను పూర్తిగ క్షయము కాలేదు. ఆపుణ్యఖండము తీవ్రవేగమున స్వర్గమునుండి భూతలమున బడియున్నది. అచ్చటి స్త్రీలు కేళీవిలాసముల క్లాంతలైనప్పుడు, శీతలస్పర్శతోగూడిన శిప్రానదీవాయువు వారి క్లాంతిని దూర మొనర్చుచుండును. మరియు నది వికసితకమలముల సౌరభమును శరీరమునకు బట్టించుకొని, సురభిమయముగ నొనర్చుచుండును. సారసములు సరోవరములయం దవ్యక్త మృదుమధుర ధ్వను లొనర్చుచుండును. అది యాధ్వనిని చాలదూరమువరకు దోడ్కొని యరుగుచు విశాల మొనర్చుచుండును. శిప్రానది చేయు కార్యమును చేయగలవా డెవ్వడు? ప్రియతముడు మాత్రమే. కాని యాత డెట్లు క్లాంతిని దూర మొనర్పగలడు? వినుము. ప్రథమమున అంగానుకూలకార్యము లొనర్చును. అనగా శరీరమును, హస్తపాదములను నొక్కి దళితపుష్పముల సుమధుర పరిమళమును సుష్కింపజేయుచు, అనేకవిధములగు పల్కులవలన మానసోల్లాసమును కలిగించుచుండును. ఉత్కృష్ట మధుర సుగంధయుతములును, సుదీర్ఘములును నగు నాపల్కులు సారసకూజనములకు తుల్యమని నుడువ బోనగునా?

ఉజ్జయిని కరుగుటవలన నీకు మహోపకారములు గలుగును. అచ్చట స్త్రీలు సుగంధధూపములను తలవెండ్రుకలకు పట్టించుకొనుచుందురు. ఆ సుగంధము సౌధముల కిటికీలనుండి వెలుపలికి వెళ్లి విరియును. అది నిన్నావరించును. అప్పుడు నీవు శరీరమును బలిష్ఠ మొనర్చుకొనుము. దీనివలన నీ దేహము తేలికదైనటుల మరి జేనికలనను కాదు. అచ్చట ప్రతి గృహమునందును నీకు పరమమిత్రు లున్నారు. నీరాక కానందోన్మత్తులై నిన్ను సమ్మానించుటకు నృత్యము సల్పుచుందురు. గొప్పవార లరుదెంచినప్పుడు గౌరవార్థము వేశ్యానృత్యము జరుగుచుండదా? అటులనే మయూరముల నృత్యము జరుగును. ఆ సౌధరాజముల శోభను గాంచుము. పుష్పగంధము నాఘ్రాణించుము. గృహములన్నిటియందును లక్ష్మీపూజాదినమున స్త్రీలెల్లరును పాదములకు లత్తుక పూసుకొనువిధమున నందలి స్త్రీల పాదము లలరారుచుండుటను గాంచుము.

## మహాకాల మందిరము

గంధవతీనది యుజ్జయిని చాయకొని పారుచుండును. దాని తీరమందే మహాకాలమందిర మున్నది. నీ వచ్చట కరుగునప్పుడు ప్రమథగణము నిన్ను తదేక దృష్టిని జిలకించుచుందురు. ఏల యన, సుమధుర శ్లోకులు వెలిగ్రక్కుచుండు నీ సునీలచ్ఛాయయందు మహాదేవుని కంఠశోభను గాంచి తన్మయు లగుచుందురు. ఆ మందిరసంలగ్నమైయున్న పుష్పోద్యానవనము సర్వవిధముల ప్రకాండము. గంధవతినుండి బయల్వెడలు సుశీతల సుగంధవాయువులు పద్మగంధమున మిళితమై శరీరమం దంతటను పద్మరజము నలదుకొని, యువతీమణు లుపయోగించు తైలము మొదలగు వాని సుగంధము నపహరించుకొని యుద్యానవనమందలి ప్రతియొక ఫలవృక్షమును, పుష్పతరువును, లతా గుల్మమును కదలించుచుండుట మనోహరము గాదా?

మహాశయా, నీ వెప్పుడు మందిరమున కరిగినను సూర్యాస్తమయమువరకు వేచియుండుము. ఏల యన, చండీపూజానంతరముగదా ఆరతియొసగుట? కావున అప్పటివరకును కాచుకొనియుండి గర్జించిన యెడల నీగర్జనములు ఢక్కానేవ యగును. అందువలన నీగర్జనము సార్థక మగును. నీవు ధన్యుడ వగుదువు.

ఆరతిసమయమున వేశ్యలు చామరములు వీచుచుందురు. తాళమునకు సరిగ వారి పదములు పడుచుండును. వారిచంద్రహారములు ఝున్-ఝున్ అని శబ్దించుచుండును. మణిమాణిక్యఖచితమగు ఆభరణముల సుదీప్తియుతమగు తళతళకాంతులు వింజామరలమీద బడుచుండును. క్షణకాలము వింజామరలను బూనుటవలన వాసుకుమారస్త్రీలు మిక్కిలి యలసిపోవుదురు. గతరాత్రి నఖక్షతము లుండిన ఆహస్తములు వివశమగును. ఆసమయమున — ఆమహేంద్రయోగమున నీ వాక్షతములమీద ముత్యములనుబోలిన నీటిబిందువులను రాల్చినచో వారికి సుఖముగ నుండును. రసికశిఖామణి వని తలచి వారు నిన్నత్యంతవిలాసయుక్తమగు క్రీగంటి చూపుల జూచుచుందురు. కజ్జలముల గ్రమ్ముకొని యుండు నేత్రకోణములయందు తిరుగుచుండు తారలు రెండును పడిపోవును. ప్రతియొక దృక్కునందియు ఆ నల్లని భ్రమరములు బహిర్గతమై వరుసగ బడుచుండుటవలన భ్రమరహారములు నేత్రములనుండి బహిర్గత మగుచున్నవా యని నీకు దోచుచుండును.

## మహాదేవుని తాండవ నృత్యము

సాయంసమయమున మహాదేవు డొనర్చు తాండవ నృత్యము మహానందప్రదము. ఆతే డప్పుడు గజ చర్మమును ధరించియుండును. రక్తము స్రవించు దిక్కు క్రిందివైపునను, మిగిలినభాగము పైభాగమునను నుండును. ఆయన నాల్గుహస్తములను — నాల్గుహస్తము లేమి, అరవై భాస్కరుడు తలచినచో ఆహస్తములను జంటజంటలుగ నెంతవరకైనను పెంచగలడు — సుప్రసార మొనరించి నృత్య మొనర్చుచుండ గజచర్మాంబర మిటునటు కొట్టుకొనుచుండును. ఆనృత్యము పార్వతికి చక్షు శ్శూలము. ఎంతైనను ఆమె స్త్రీయేగదా! రక్తాంబరముతోగూడిన ఆనృత్యవ్యాపార మామె కెట్లునచ్చును? అది ఆమెకణుమాత్రమైనను యుదారహము కాదు. నీవు పార్వతీదేవికి భక్తివినమ్రుడవు గాదలచినను, స్నేహభావమున సుస్థిరదృక్కుల . ఆమె నిన్నాశీర్వదింపవలయునని తలచినను నీవు గర్జన మొనర్పక మౌనమును దాల్చుము. గందరగోళపడక స్థిరముగ నుండుము. జపాకుసుమకాంతులను ధిక్కరించుచుండు సంధ్యారాగమును నీశరీరమునకు క్రిందిభాగమున నలదుకొని, మందిరసమీపమందు వేచియుండుము. అంత మహాదేవుడు హస్తిచర్మమును వీడి నిన్నుగైకొని నృత్యము చేయును. నిండుమనమున పార్వతి నిన్నాశీర్వదించును. నీవు ధన్యుడ వగుదువు.

## ఉజ్జయినిలోని అభిసారికలు

గభీరనిశియం దభిసారికలు స్వగృహములను వీడి తాలువలతో మోములు గప్పుకొని మదనమోహన విలాసమున ప్రాణప్రియులకొరకు కరుగుచుందురు. రాజపథము గాఢాంధకార బంధురము. అప్పుడు నీ వొక కార్యమును తప్పక చేయవలయును సుమా. నీ సౌదామినిని ఒకింత ప్రకాశింపజేయుము. కాని దానిని చంచలమును, చపలమును గానీయకుము. ఒరపిడిరాతి

మీద నుండు స్వర్ణరేఖను బోలి సౌదామిని యొకింత వడి నిశ్చలముగ నుండవలయు ననుమాట మరవవలదు. అందువలన నభిసారికలకు మార్గ మొకింత స్పష్టముగ గనపడును. మిత్రమా, మరియొక మాట. అప్పుడు వర్షింపవలదు. ఉరుముచు నీ వెవ్వరిని బిలువవలదు. వా రబలలుగదా! తమ్మెవరైన చూతు రను భయమువలన కంపితలై, పాతబుద్ధులై, దిగ్భ్రమ కెంది ప్రమాదమునకు లోనగుదురుసుమా!

ఈవిధముగ సౌదామిని దీర్ఘకాలము ప్రకాశించుటవలన మిక్కిలి డస్సిపోవును. ఆమె నీకు ప్రియసంగిని. కాబట్టి యామె కొకింత విశ్రాంతి యొసగుట యుచితము. నాపల్కు లాలించి యారాత్రి యేదియో యొక యున్నతగృహమున విశ్రమింపుము. అప్పటికి పావురములు మైమరచి నిద్రించుచుండును. కావున మీకు నిద్రాభంగకరములగు శబ్దములు వినబడవు. సూర్యోదయ మైనంతనే యటనుండి బయలుదేరుము. మిత్రకార్యనిర్వహణకు బయల్వెడలిన మీవంటి యుత్తమోత్తములు కార్యవిలంబన మొనర్పరనుట నిశ్చయము.

మహాశయా, గమనింపుము. సూర్యదేవుడు మిక్కిలి యనుచితకార్య మొనర్చియున్నాడు. ప్రియరమణియగు నళినిని వీడి రాత్రియంతయు నెచ్చటనో గడిపెను. పాపము! నళిని యారాత్రియంతయు దుఃఖించి శిశిరబిందువుల నిండియున్నది. స్త్రీలంపటుడు ఉదయముననే గృహమునకు వచ్చి రిక్తహస్తముల భర్త పత్నినేత్రజలములను దుడుచుచు ఓదార్చుచుండువిధముననే సూర్యదేవుడు నళిని నేత్రజలముల దుడుచుటకు సహస్రకరముల నుపయోగించును. అతడు దేవత. కావున నీవు మిక్కిలి జాగ్రత్తగ మెలగవలయును. లేకున్న నిన్నాత డేమిచేసినను చేయగలడు. నీవు మధ్య చేరి యాయనకరముల నడ్డగింపవలదు. అటుల చేసినచో సూర్యునితో నీకు గల వైరము మిక్కుటమగును. నీవు నాశనమగుదువు.

## గభీరానది

ఉజ్జయినిని దాటగనే నీవుగభీరానదిని గాంతువు. అందలి జలము సుస్వచ్ఛము. అది తళతళ లాడుచు, అడుగునుగూడ చక్కగ గాన్పించుచుండును. యౌవనప్రారంభమందు భావుకులు – కవులు – రచించు ప్రేమరచనలముగాని, ప్రేమయొక్క ప్రథమోద్వేగమున విలసిల్లిన శకుంతహృదయమునుగాని నీ జలములతో బోల్పజనదు. నీవు సుభగుడవు. అంగనలచేత కామింపబడువాడవు. కావున నీవు ఛాయారూపమున నొక్కమారు గభీరానదిహృదయమందు ప్రవేశింపుము. ఆమె నిన్ను గాంచినంతనే సునిర్మలహృదయమున నాకర్షించును. ఇంకొక సంగతి. అత్యంతచపలచిత్తలగు శేడిపచేపలు గంతులువేయుచు తలక్రిందులగుచు చంచలకటాక్షములను నీపై ప్రసరింపజేయుచుండును. ఆకటాక్షములయందు నలుపుజీరయైన నుండదు. ఉండునది కుముదపుష్పములబోలి తెలుపు— సంపూర్ణముగ తెలుపు. కాని యాచూపుల యర్థమును గమనింపుము. ఈసమయమున జితేంద్రియుడవై కూర్చుండవలదు. ఆమె యుజ్జ్వలనేత్రములనుండి బయల్వెడలుచున్న స్వచ్ఛస్ఫటికమును తలదన్నుచుండు చూపులను వ్యర్థ మొనర్పకుమా!

## దేవగిరి

కాని నేను దురదృష్టవంతుడను— ఆలస్యమగుచున్నది. ఏమిచేయుదును? ఉజ్జయినినుండి మందసోరుకు బోవు మార్గమందు 'చంబల' నది నతిక్రమించి కొలదిదూర మరిగినచో నొక యున్నత పర్వతము గాన్పించును. దాని పేరు దేవగిరి. గభీరానది మనోరథమును దీర్చి నీవు దేవగిరికి జనునప్పుడు మహోదారుణముగ నుండు వేడిగాలికి బదులు చల్లని గాలి వీచుచుండును. ప్రథమవర్షమున భూమి తడిసి సుగంధము వెల్విరియుచుండును గదా! ఆ సుగంధమున చల్లగాలి మత్తిల్లియుండు నని వేరుగ నుడువవలయునా? మదగజములు వేడికి తలక్రిందులగుచుండును. అందువలన నవి తొండముల నెత్తి యొకవిధమగు శబ్ద మొనర్చుచు చల్లగాలిని పీల్చుచుండును. ఆగాలివలన నడవి మేడికాయలు పండును. మృదుమధురశీతలతరంగములు దేశమంతయు వ్యాపించును.

కార్త్తికేయునకు చిరనివాసస్థలము దేవగిరి. ఆయనను సామాన్యదేవునిగ దలపజనదు. అతడు మహాదేవుని పుత్రుడు. నీవు దేవగిరి కరిగి పుష్పమేఘుడవు గమ్ము. ఆ పుష్పములను మందాకినీ జలములయందు దడుపుము. పుష్పధారావృష్టిని కార్త్తికేయుని స్నానము చేయించుము.

కార్త్తికేయున కొక మయూర మున్నది. దానితో తుల్యమగు భాగ్యవంతుడు జగత్తునం దెవ డున్నాడు? దాని యీక క్రింద బడినయెడల, పలు వన్నెల పలుకాంతు లీనుచుండు ఆయీకను చేత ధరించి పార్వతీదేవి యది కార్త్తికేయుని మయూర పుచ్ఛమందలి యీక యని సంతోషించుచు, పద్మములతో గలిపి చెవులకు ధరించుచుండును. ఆహా! దాని భాగ్య మేమి! అట్టిభాగ్యము లభించినవారలు జగత్తునందు మరియెవ్వ రున్నారు? అంతేకాదు. మహాదేవు డా మయూరమును స్వీయదృష్టులయం దుంచుకొనును. ఆయనశిరమందలి విమలధవళకాంతులవలన నెమలినేత్రము లత్యంత శోభాయమానము లగుచుండును. కార్త్తికేయునకు ప్రియము, శివునకు ప్రియము, పార్వతికి ప్రియతమ మగు దాని కొకింత వ్యవధి నొసగుము. గర్జన మొనర్పుము. ఆ గర్జనము ప్రతి పర్వతకందరమునుండియు ప్రతిధ్వనింపవలయును. వెంటనే యామయూరము నృత్యమునకు గడగి నేత్ర పర్వ మొనర్చును.

## చర్మణ్వతి

కార్త్తికేయుని పూజించి నీ వగ్రేసరుడవు గమ్ము. సిద్ధమిథునయుగళము ఆకాశమార్గమున వీణాగాన మొనర్చుచు స్వచ్ఛందముగ విహరించుచుండును. నిన్ను గాంచినంతనే చినుకులు పడుటవలన వీణానినాద మపస్వర మగు నను భయమున వారు నీమార్గమును వీడి పలాయన మగుచుందురు. అనంతరము నీవు చర్మణ్వతీనదిని సమీపించెదవు. దాని మర్యాదను గాపాడుట కచట నీవు నెమ్మదినెమ్మదిగ వ్రేలాడుచు క్రిందికి దిగుము. చర్మణ్వతీనది సామాన్యమగు నది కాదు. రంతిదేవుడు గోమేధయజ్ఞములం దెన్నియో గోవులను వధించియుండెను. వాని చర్మపుగుట్టలనుండి పారిన రక్తము ప్రవాహరూపమును దాల్చెను. అదియే యిపుడు చర్మణ్వతి పేర బరగుచున్నది.

చర్మణ్వతీనదీప్రవాహము మిక్కిలి విస్తృతము. గట్టుపైనుండి చూచినయెడల నది క్షీణించియుండును. మరియు పెద్దపెద్ద రాతిగుండ్లు మొదలగునవి ప్రవాహము నడ్డగించుచుండును. అందువలన ప్రవాహము కొంత దిగ వెనుకకు మరలి వానిని దప్పించుకొని పారుచుండును. కొంతదూర మేవిధమగు అడ్డంకులు లేక ప్రవాహము స్థిరముగ నడచుచుండును. పైనుండి చూచువారలకు నదియందలి ఫేనసముదాయము ఆణిముత్యపు రాసులను ధిక్కరించు బృహత్తరముక్తాగుచ్ఛహారమును బోలియుండును. దాని మధ్యభాగమందలి దట్టమగు నల్లరంగును విడదీసి జలములు గ్రోలునప్పుడు గగనచరులగు దేవతలు నిన్ను గాంచి ముత్యముల మాలయం దొక యుజ్జ్వలనీలమణి యున్నదని తలతురు.

## దశపురము

చర్మణ్వతి నతిక్రమించి దశపురమున కరుగుము. ఇప్పుడు దాని నామధేయము 'మందాశోరము'. అందలి స్త్రీలు సాభిలాషముగ నిన్ను గాంచుచుందురు. వారి భ్రూలతలు నిరంతరము కంపించుచుండును. అందువలన వారి హావభావములు సుస్పష్టముగ ప్రకటిత మగును. వా రుపరిదిక్కును గాంచునప్పుడు ప్రథమమున నేత్రముల శ్వేతచ్ఛాయయు, వెంటనే దట్టమగు సునీలచ్ఛాయయు గాన్పించుచుండును. ఆహా! ఆదృశ్య మెంత మనోహరము! పై కెగరగొట్టబడిన మల్లెపూవుల వెంట తుమ్మెదలు దిరుగుచుండునటుల దోచును.

## బ్రహ్మావర్తము

అటనుండి బయలుదేరుము. చాలదూర మరిగినతో బ్రహ్మావర్తమున జేరుదువు. అది దేవనిర్మితదేశము. సరస్వతీ, దృషద్వతీనదుల మధ్యమం దున్నది. దాని నార్యభూమి యని యెరుగుము. చాతుర్వర్ణ్యముతో గూడిన ఆర్యసంఘపు ఉత్పత్తిస్థాన మదియే. నీ వచట ఛాయనుమాత్రము ప్రసరింపజేసి యటనుండి నిర్గమిం

త్రము, కురుక్షేత్రమును చేరుదువు. ఇప్పటికిని అచట ఘోరతర కురుక్షేత్ర యుద్ధచిహ్నములు గన్పట్టును. కమలసముదాయముమీద నీవు వర్షించు విధముననే మహాధనుర్ధరుడను అర్జునుడు క్షత్రియగణముమీద శరవర్షమును గురిపించెను.

పూర్వమేఘమందలి సమస్త జడపదార్థములును చైతన్యమయములు. మేఘము, రామగిరి, ఆమ్రకూటము, నర్మద, వేత్రవతి, నిర్వింధ్య మొదలగున వన్నియు చేతనములు. అందు ముఖ్యముగా నదులు చైతన్యమయములు; ప్రేమోన్మత్తములు. కాళిదాసు ప్రతియొకవాక్యమందును వాని చైతన్యమును, బుద్ధిని, హృదయమును వెలువరించియున్నాడు. అవియన్నియు హృదయమందలి ప్రేమచేనాకులములు. ప్రేమాకులుడగు మానవు డొనర్చు కార్యములనే అవియన్నియు నొనర్చినవి. అందువలన వానిని జడములుగ గ్రహింప వీలులేదు. కాళిదాసు రామగిరినుండి అలకానగరపర్యంతము సమస్తమును చైతన్యమున నింపివైచెను. ఆ మార్గమందలి నదీనదములు, పర్వతములు, కందరములు, భూచరఖేచరములు, జలచరములు, చివరకు జేడిసచేపలవరకును యక్షుని దుఃఖమునకు దుఃఖింప దొడగెను. యక్షుని విరహమును గాంచి పరితపింప జొచ్చెను. ఆ యక్షునకు దూతరూపమున అలకాపురమున కరుగుచున్న మేఘునకు జడజగత్తంతయు నేకాత్మభావమున సర్వవిధముల సహాయ మొనర్చెను. జడజగత్తంతయు యక్షునితో సమవేదన ననుభవించెను.

## సరస్వతి నది

మహాపరాక్రమశాలియగు బలరాముడు కురుపాండవయుద్ధమున జేపక్షమును చేరక సరస్వతీతీరమందు యోగనిమగ్నుడై యుండెననువిషయము నీ వెరిగియే యుందువు. అతడప్పుడు సురను బరిత్యజించెను. సరస్వతీనదీసలిలముల పిపాసను దీర్చుకొనుచుండెను. మిత్రమా, నీవుగూడ నాజలమును పానము చేయుము. అందువలన హృదయశుద్ధి యగును. కాని నీవర్ణముమాత్రము మారదుసుమా!

అటనుండి కనకఖలమున కరుగుము. దక్షు డొనర్చిన యజ్ఞకుండమును గాంచుము. చేతియందు పైసాపనినచో పండా లిప్పుడుగూడ అచట హోమముచేయుచుందురు. కనకఖలమునకు సమీపముననే— రెండుమూడు మైళ్లదూరమందు గంగానది హిమాలయమును వీడి సమతలమును ప్రవేశించును. అటనుండి పైకి చూచినయెడల గంగనిర్గమనము సగరతనయులు స్వర్గమునకరుగుటకు నిర్మించిన సోపాన పంక్తులుగ విరాజిల్లుచుండును. హరిద్వారము సముద్రమట్టమునకు అయిదారువందల యడుగుల యెత్తునమాత్ర ముండును, అచటనుండినీవు ఉన్నతమార్గమున పైకిబోయి చూచినయెడల గంగ మెట్లనతిక్రమించుచు ౨౨౦౦౦ అడుగులవరకు పైకి బోవును. ఆసోపానశ్రేణి నతిక్రమించియే గదా సగరతనయులు స్వర్గమును ప్రవేశించినది!

## గంగామతల్లి

అచటనుండి గంగాప్రవాహ మత్యంతవేగమున క్రిందికి దిగునప్పుడు ప్రతియొక సోపానమందును రాశీకృతమగు ఫేనరాసు లుండును. నీవు పైనుండి కాంచునప్పుడు, ద్విపార్శ్వములయందలి మహోన్నత పర్వతముల మధ్యనుండి ఫేనరాసులతో తళతళలాడుచు ప్రవహించునప్పుడు, గంగామతల్లి నగవుమ–౨౨౦౦౦ అడుగులయెత్తుననుండి క్రింద ౫౦౦ అడుగులవరకు వ్యా

పించియుండు నగవును—గాంచుదువు. గంగోత్రికి ఉపరి భాగమందు గంగ యుండును. గంగాధవాని విష్ణు పాదములనుండి బ్రహ్మకమండలమునకును, అటనుండి శివుని జటాజూటమునకును బ్రవేశించి, యచ్చటనుండి హిమాలయమందు పడుచున్నది. మరియు తరంగ హస్తముల విస్తార మొనర్చి గంగ మహాదేవుని జటా జూటమును బట్టుకొని యుండును. తరంగములు కపాల మందలి చంద్రకళను ఆఘాత మొనర్చుచుండును. సవ తిని చూచి గౌరి ఈర్ష్యతో గూడిన కషాయితనేత్ర ముల గాంచుచు భ్రుకుటి నొనర్చుచుండ, గంగ తల వంచుకొని కాతరకంఠమున నవ్వుచుండినటుల గాంచ గలవు.

గంగాజలము సునిర్మలము. స్ఫటికమును బోలి స్వచ్ఛకాంతుల నీనుచుండును. నీకును సురగజమున కును మిక్కిలి పోలిక గలదు. నీవు నలుపు. తొండ మును బోలిన ఆకృతి వహించి నీరమును గ్రోలుము. నీవు గంగాజలమును గ్రోలుటకు దిగినచోట నీయుజ్జ్వలనీల కాంతులు సుస్వచ్ఛస్ఫటికమును ధిక్కరించుచుండు గంగాజలముమీద తేలియాడుచుండును. అప్పుడు గంగా యమునాసంగమము ప్రయాగయందేగాక మరి యొకచోట గలిసినటుల దోచును.

## హిమవన్నగము

క్రమక్రమముగ పైకి బోవుచు హిమాలయ మును జేరుము. ఆతడేసుమా గంగకు తండ్రి. ఆత డెప్పు డును మంచుచే ఆవరింపబడి యుండును. నీ వా మహా పర్వతముమీదకు కెగసి మంచుశిఖరములమీద విశ్రమించి నప్పుడు నీవు మహాదేవుని వాహనమగు వృషభరా జము భూమిని కోరాడి కొమ్ములకు బురద పట్టించు కొనినటుల దోచుచుందువు.

అచ్చటచ్చట దేవదారుతరువు లొకదాని కొకటి రాచుకొనుటవలన అగ్ని యుత్పన్నమై దవా నలరూపమున వ్యాపించుటను గాంచగలవు. అది వ్యా పించుచు కిలకేగి చమరీమృగముల తోకలను గాల్చు చుండుటను గాంచినయెడల నికేమి కాలమైనను విళంబ మొనర్పక మిక్కుటముగ వర్షించి యా దవానలమును చల్లార్పుము. మిత్రమా, ఉత్తముల సంపదలు విపన్నుల ఆపదలను నివారించుటకొరకేగదా!

మరియు అచట నెనిమిది పాదముల జంతువు లను గాంచెదవు. వాని పేరు శరభములు. అవి నిన్ను మ్రింగవలయు నను తలపున నీమీదకు లంఘించును. అప్పుడు అంధకార మొనర్పుము. తీవ్రముగను, దట్టము గను వర్షించుచు వడగండ్లతో వానిని గొట్టుము. నిష్ఫల కార్యములకు బ్రయత్నించువారికి అవమానము తప్ప దనుట నిశ్చయమేగదా!

అచ్చోట మహాదేవుని పదచిహ్నములు రాతి మీద సుస్పష్టముగ గన్పించును. సిద్ధులాపాదములను నిరంతరము పూజించుచుందురు. స్నేహితుడా, నీవు మెల్లమెల్లగా క్రిందికి దిగి పాదముల చుట్టు ప్రదక్షిణ మొనర్చి మిక్కిలి భక్తిశ్రద్ధలతోడ నాదివ్యపదముల గాంచుము. వానిని పూజింపుము. నీవు దేహాంతమందు అవినశ్వరమగు గణపదమును బొందుదువు.

అచ్చటనుండు వెదురుచెట్లకచ్చటచ్చట రంధ్రము లుండును. వానినుండి గాలి బహిర్గత మగునప్పుడు మనోహరమగు నాదము బయల్వెడలును. కిన్నర స్త్రీలు త్రిపురవిజయమును బాడుచు మహాదేవుని మహిమను శతముఖముల కీర్తించుచుందురు. నీవు గర్జిం పుము. ఆధ్వని కందర కందరములనుండి శబ్దించి మృదంగకార్య మొనర్చుచుండును. అందువలన మహా దేవుని నృత్యము వివిధోపకరణములతో సుసుందరముగ నుండును.

## క్రౌంచరంధ్రము

మహాశయా, హిమాలయమందు చూడదగిన విశేషము లనేకము లున్నవి. వానిని గాంచుచు క్రమ ముగ క్రౌంచరంధ్రము (నీల్ పాస్)ను జేరుము. అది ౧౬౦౦౦ అడుగులయెత్తున నుండు నొక కనుమ. ద్విపార్శ్వమందలి మహోన్నతపర్వతముల మధ్యనుండి వక్రగతుల బోవుచుండు నాస్రోతనుండియే భారత వర్షమునుండి టిబెట్టుదేశమునకు పథికులు వచ్చుచు బోవుచుందురు. పూర్వ మది యొక మహాపర్వతమై యుండెను. కాని పరశురాముడు బాణప్రయోగమున

నాపర్వతమును చీల్చెను. అందువలన నది కనుమగ నేర్పడినది.

## కైలాసము

ఇంతవరకును నీవు ప్రశస్తమగు మార్గమున, జెప్పదగు అడ్డంకులును లేక సుఖముగ ప్రయాణమొనర్చుచుంటివి. కాని యిక నీవు నిర్గమింపవలసిన మార్గము మిక్కిలి దుర్గమము. ఆ కనుమనుండి పోవునప్పుడు ముకుళించుకొనిపొమ్ము. కాని రెక్కలల్లార్చుచు నాకసమున విహరించు పక్షులవలె స్వేచ్ఛగా పోజాలవు. కావున ముకుళించుకొని—మిక్కుటముగ ముకుళించుకొని, ఆ కనుమ నతిక్రమించినచో కైలాసమును చేరుదువు. అది తెలుపు - ఎటుచూచినను తెలుపు! స్వర్గ సుందరీ మణుల కచట ముకురములతో పని లేదు. సుస్వచ్ఛమగు మంచువలన నాక్రమింపబడియుండు కైలాసమే వారికి దర్పణముగ నుపయోగపడును. అచ్చట శిఖరములు మహోన్నతములు. అవి యన్నియు ఘనీభవించిన మంచువలన నావరింపబడి యుండును. మహాదేవుని యట్టహాసము దినముల వరుసను ఘనీభవించి శ్వేతఖండరూపమును దాల్చిన దని తోచుచుండును.

కజ్జలకాంతివలన నేత్రములు మనోహరముగ నుండును. కాని దట్టముగ దానిని దొలగించినయెడల లోపలనుండు రంగు మిక్కిలి మనోమోహనకారి గదా! అటులనే నీ వుందువు. కాని కైలాసమో? కోసిన యేనుగుదంతములోపలి భాగమందలి ధావళ్యము నతిక్రమించి తళతళ మెరయుచుండును. అహా! ఆరంగు నేత్రానంద మొనర్చుటయే కాక, హృదయ మోహనకారిగ నుండును. మిత్రమా, నీ వా భూధరముమీద విశ్రమించినప్పుడు మానవులు నిన్ను తదేకదృష్టుల గాంచుచు, ప్రకాండదేహుడగు బలరామునిమీద నుండు నీలాంబరమా యని తలచుచుందురు.

అచట నీవు చూచునప్పుడు, మహాదేవుడు పార్వతి భయపడునను తలంపున సర్పహారమును దీసివైచి యామెచేతిని ధరించి, కాలినడకను క్రీడాశైల మెక్కుచుండును. అప్పుడు నీ శరీరమందలి జలమును స్తంభన మొనర్పుము. మహాదేవ దంపతు లరుగు మార్గమునం దంతటను పర్వతము వంటుకొని యుండుము. అప్పుడు సోపానప్రాయముగ నుండు నీమీద పాదము లిడుచు పార్వతి సుఖముగ నిర్గమించును. నీజన్మ సార్థకమగును.

కాళిదాసు మేఘమును విశాలమగు నీటి తోలుతిత్తితో బోల్చియున్నాడు. వేదమతముగూడ నంతియే.

కాని యచట వేసవికాలమందు క్రీడలొనర్చు సురాంగనలచే జిక్కినచో నీ వారు చేతికంకణములయందలి వజ్రముల యంచులతో నిన్ను గోసి ఛిద్ర మొనర్తురు. అప్పుడు నీనుండి వేలకొలది సెలయేర్ల ప్రవాహములవలె జలము బహిర్గత మగును. కావున నీ వా కుటిలకార్యము లొనర్చినవారిమీద జలమును గుమ్మరించుము. అదియును వ్యర్థమైనచో, తీవ్రముగ గర్జించుచు అదలగొట్టుము. తప్పు లేదు. ఆటలాడుకొనుచుండువారల కంత చాపల్య మెందుకు ?

నీవు మానస సరోవరమందలి జలమును తృప్తిగ ద్రావుము. ఆ జలమం దగణిత సువర్ణ పద్మములు వికసించియుండును. ఐరావతమునకు క్షణకాలము ముఖపటముగా నుండుము. అందువలన నది మిక్కుటముగ నానందించును. గాలికి వస్త్రములు కదలుచుండు విధమున కల్పద్రుమపత్రములను నాడించుము. స్నేహితుడా, నీ వీ విధముగ నా పర్వతరాజము నుపభోగింపుము.

## అలకానగరము

ఆ పర్వతాంకమం దొకనగర ముండును. పర్వతగాత్రమందలి యెచ్చుతగ్గుల ననుసరించి గృహములు నిర్మింపబడినవి. ఆనగరము రసికురాలగు ప్రణయిని పర్వతక్రోడమందు మైమరచి నిద్రించుచున్నటు లుండును. ప్రక్కనుండి గంగాస్రవంతి పారుచుండును. నీ వొకింత దక్షిణమున కరుగుము. ఉన్నతప్రదేశము నుండి చూడుము. అప్పు డొక కామిని యొకింత వస్త్రమును గప్పుకొని శయనించినటు లుండును. ఆకాలమున నా నగరమందలి గొప్పగృహములయందు మేఘము లుండును. అందువలన గృహముల

మీదనుండి వర్ష బిందువులు బొటబొట రాలుచుండును. అదృశ్యము కృష్ణవర్ణమున నలరారు స్త్రీల కేశముల యందు ముత్యముల సరము ప్రకాశించినటుల దోచును. నీవు, చిరపరిచితుడ వగుటవలన, దానిని గాంచగనే యలకానగర మని గ్రహింతువు, సందియము లేదు.

పూర్వమేఘమందలి సమస్తజడపదార్థములును చైతన్యమయములు. మేఘము, రామగిరి, ఆమ్రకూటము, నర్మద, వేత్రవతి, నిర్వింధ్య, గంభీర, గంధవతి మొదలగు నన్నియు చేతనములు. ఇందు ముఖ్యముగ నదులు చైతన్యమయములు; ప్రేమమయములు; ప్రేమోన్మత్తములు. కాళిదాసు ప్రతియొక వాక్యమందును వాని చైతన్యమును, బుద్ధిని, హృదయమును వెలువరించియున్నాడు. అవి యన్నియు హృదయమందలి ప్రేమచే వ్యాకులములు. ప్రేమాకులుడగు మానవు డొనర్చు కార్యములనే అవన్నియు నొనర్చియుండెను. అందువలన వానిని జడములుగ గ్రహింప వీలు లేదు. కాళిదాసు రామగిరినుండి అలకానగర పర్యంతము సమస్తమును చైతన్యమున నింపి వైచెను. ఈమార్గమందలి నదీనదములు, పర్వతములు, కందరములు, భూచర ఖేచరములు, జలచరములు, దినరకు జేడినచేపలవరకును యక్షుని దుఃఖమునకు దుఃఖింప దొడగెను. యక్షుని విరహమును గాంచి పరితపింప జొచ్చెను. యక్షునకు దూతరూపమున మేఘము అలకాపురమునకు జనుచున్నది. మార్గమందున్న వన్నియు సాధ్యమైనంతవరకు మేఘుని సంతోషపరచవలయునని ప్రయత్నించుచుండెను. కొన్ని మేఘునికి శరమున స్థానమొసగుచున్నవి. మరికొన్ని సౌధోపరిభాగమున విశ్రాంతి గొనుచున్నవి. వేరొకకొన్ని బలవర్ధనమునకు జలముల నిచ్చుచున్నవి. కొన్ని మేఘునినుండి జలమును బహిర్గతమొనర్చి యానతనికి తీవ్రగతిని గలిగించుచున్నవి. జడజగత్తంతయు నేకాత్మభావమున యక్షునకు సర్వవిధముల సహాయ మొనర్చుచుండెను. మేఘము యక్షుని ప్రాణము. కాని యది యరుగుచుండునప్పుడు యక్షుని ప్రాణమే యరుగుచున్నదనియు, కనుపడినదానినంతను తన కుపయోగించుకొనుచు, సొంతముగ జేసికొనుచు, స్వీయప్రాణముతోడ ప్రేమమయమును, ఆవేశమయమును అగు భావముతోడ మత్తిల్లిపోవుచుండినట్లును గాన్పించును. కావుననే జడమం దిట్టి సౌందర్యవికాసము ప్రస్ఫుటమైనది.

రఘువంశమున త్రయోదశసర్గయందు సముద్ర నదీనదములు, పర్వతకాననములు మొదలగువానితో గూడిన జగత్తంతయు సీతారాముల పునర్మిళనమువలన ఆనందమయమైనవిధముననే మేఘసందేశమందు సమస్త జగత్తు యక్షుని విరహము, యక్షునిభోగలాలస, యక్షుని యసంతృప్తాకాంక్షలయందు మునిగి తేలజొచ్చెను.

రఘువంశమున త్రయోదశ సర్గయందు రాముడు శత్రునాశన మొనర్చి, సీత నుద్ధరించి, జగత్తంతటను వీరకీర్తిని బ్రసరింపజేసి, కులకళంకమును దొలగించితి నను ఆనందముతో సీతను మానవమండలికి చూపించుచుండెను. ఆ దివ్య దృశ్యమువలన జగత్తు మహానంద నిమగ్నమాయెను. పాపము! యక్షుడో? మనమునకు నచ్చిన మానిని లభించుటవలన సుఖసౌఖ్యముల నున్మత్తుడై యుండ ఆకస్మికముగ ఘోరదండనము విధింపబడెను. అందువలన వాని హృదయము దగ్ధమాయెను. కాని యేమి చేయగలడు? దేవతలైనను కుబేరుని దండింపగలరా? అట్టితో యక్షుడు ఘోరశిక్ష ననుభవింపక తప్పదు. కాని యిప్పు డొక సందేశమును బంపించి భార్యను బ్రతుకునటుల చేసినచో నదియే మహాక్షేమము. అతనికి భార్య చింతనము దప్ప మరియొకటి లేదు. అందువలన నా చింతనము జగద్వ్యాప్తమైనది.

రఘువంశమందు సీతారాములు సశరీరముల నేగుచుండిరి. వారు లక్ష్మీనారాయణావతారము. జడజగత్తుకు వారు రక్షితులు. అందువలన వారు గగనమందు మేఘములకు క్రిందుగను, మేఘములకు పైగను, మేఘములమండియు నరుగుచుండిరి. మరియు దేవతలకుగూడ దేవతలగువా రెట్టివస్తువులతో నిర్గమించుచుందురో, సీతారాము లట్టి వస్తువులతోనే పోవుచుండిరి. జడజగత్తునకు వారు చాల ఎత్తుగ నుందురు. మరియు దూరమం దుందురు. వారు చైతన్యమునకు చైతన్యస్వరూపులు. వారి యెదుట జడజగత్తు అత్యంతసామాన్యము, బాలక్రీడ. మేఘ

నూతియందు యక్షుడు దుఃఖవిరహముల గూడిన ప్రాణమును బహిరింపజేసెను. వాని జడదేహముమాత్రె మెచ్చుటనో పడియుండెను. వాడు ప్రాణముతో పరుగెత్త జూచును. కాని యొకింత ముందున కరిగి వెంటనే యంతకుమూడురెట్లు క్రింద బడుచుండును. దుర్భర దుఃఖమువలన కన్నీరు కార్చుచు యక్షుడు జగత్తును ఉపభోగించుచున్నాడు. మరియు, సమస్త జడజగత్తు సమ్ముఖమందును సమవేదనాభిక్ష నొసగుడని తిరుగుచున్నాడు. కవులకు కవియు, కవికులగురువు నగు కాళిదాసు వాని హస్తములయందు సమవేదనను గ్రుమ్మరించుచున్నాడు. మరియు జగత్తంతయు వ్యాపించి యుండిన సమవేదనాప్రవాహమును బహిర్గత మొనర్చినాడు.

[అనువాదకుడు : ఆర్. రంగనాథశాస్త్రి]



ఆర్షరసాయనశాల
ముక్త్యాల, కృష్ణా

స్థాపితము 1925

ప్రశస్తాయుర్వేదౌషధములకు నిలయము. ఏ మందు కావలసినను మాకు వ్రాయుడు. నమ్మకమైనవి లభింపగలవు.

ఆయుర్వేద భూషణ
వేటూరి శంకరశాస్త్రి
CONSULTING PHYSICIAN

## ఇప్పుడు భీమా చేసుకొనుట వివేకము కాదా?

అనిశ్చయమైన భవిష్యత్తునకు ముందుగానే సాధనములను కాపాడుకొనుటకు లేక గట్టిపరచుకొనుటకు ప్రతి మానవుడు ఆసక్తితో ప్రయత్నించుట విధి. మీరు జీవితము ఇదివరకే భీమా చేసికొనిన, దానిని విడిచిపెట్టవద్దు. దానిని తప్పిపోకుడు. మీరు భీమా చేసుకొనకపోయిన ఇప్పుడు దానికొరకు ప్రయత్నింపుడు. భీమా పాలసీ మీకు ఘనమైన రక్షణ నిచ్చును. మరియు ఇప్పుడు చేసికొన్నచో తరువాతకంటె తక్కువ ఖర్చగును. ముందు హెచ్చరికగలిగియుండుట అనగా కవచమునుధరించుటయగుననుమాట నూటికి నూరుపాళ్లు నిజము.

ఇతర వివరములకు, సలహాలకు మాకు వ్రాయుడు:—

**నేషనల్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్**

(హెడ్డాఫీసు:- కలకత్తా :: స్థాపితము 1906)

నేషనల్ ఇన్సూరెన్సు భవనము,
362, చైనాబజారురోడ్డు, ఎస్ప్లనేడు, మద్రాసు.

సబ్ ఆఫీసులు:
171, న్యూస్ట్రీటు,
మధుర.

సబ్ ఆఫీసులు:
5, కెంపెగౌడా రోడ్డు,
బెంగుళూరు సిటి.

# చెవుడు

అద్భుతమైన క్రొత్తశాస్త్ర పరిశోధన




చెవులో చీము కారుట, పోటు, మంట, ధ్వని, దురద, చెమటకాయలు, చెవులో గుంయిమను ధ్వనివినబడుట, చెవిలోని ధ్వనిపొరలు సక్రమముగా లేక మాట సరిగా వినబడకుండుట, జ్వరమువలనగాని, క్వినైన్ సరిగావాడకపోవుటచేతగాని, కలిగిన కొంచెముగాని లేక పూర్తిగాని చెవుడు మున్నగునవి మా **బధిరతా హరణ్** తైలమువలన పూర్తిగా నిమ్మళించి, శబ్దము బాగుగా వినవచ్చుచున్నది. గుణము కన్పించనిచో సొమ్ము వాపసు చేయబడును. ఖరీదు రు. 2-0-0.

**AROGYA SADAN.**
**ఆరోగ్య సదన్, దుర్గాదేవివీధి, బొంబాయి 4**

## రాజమోహన హేరాయులు



శ్రేష్ఠమయిన సువాసన గల తలనూనె. మెదడుకు చల్లదనమును కలిగించి వెంట్రుకలను అభివృద్ధి చేయుటలో అత్యుత్తమ మయినది.

తలపోటు, కూడు పోటు, శిరోవేడిమి, చుండు మొదలగువాటిని పోగొట్టి కన్నులకు చలవ నొసంగి వెంట్రుకలను మృదువుపరచి, నల్లగా పెంచుటలో అత్యుత్తమ మయినది.

స్త్రీలకు ఆనందమును కలుగజేయును.

సీసా 1-కి రు. 0-12-0 6 సీసాలు రు. 4-4-0

పోస్టేజి ప్రత్యేకము.

పి. శి. ఏ. అండు కంపెనీ,
ఆయుర్వేదసమాజం,
పెరిదేపి, నెల్లూరుజిల్లా.

మన వ్యాఖ్యాతలూ, పాశ్చాత్యులూ అపార్థంచేసిన

# కొన్ని ఋక్కులు

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

[గతసంచికతరువాయి]

"త్రిస్రో ద్యావః సవితు ర్ద్వా ఉపస్థాఁ
ఏకా యమస్య భువనే విరాషాట్
ఆణిం న రథ్య మమృతాధితస్థు
రిహ బ్రవీతు య ఉ తచ్చికేతత్"

—౧.౩౫.౬

(ఉన్న మూడులోకములలో రెండు మాత్రము సవితదగ్గర ఉన్నవి. మూడవది యోధులను స్వీకరించెడి అగ్ని(యమ) భువన మం దున్నది. చక్రమునందలి పలకలు ఇరుసుపై నాధారపడినటుల మరణరహితము లైన వస్తువు లన్నియు సవితయం దున్నవి (అగ్ని భూలోకసవిత). ఆ సవితృరూపము తెలిసిన మానవుడు ఈ విషయమును విశదీకరించెడుగాక !)

ఋగ్వేదకవులు మూడు లోకాలను అంగీకరించారు — ద్యులోకము, అంతరిక్ష లోకము, భూలోకము. ద్యురంతరిక్షశబ్దాలను ఋగ్వేదంలో మొత్తంమీద ప్రపంచ మనే అర్థంలో కూడా ఉపయోగించారు. యథా క్రమముగా ద్యులోకము మూడవది. కాబట్టి 'త్రిస్రో ద్యావః' అనేపదానికి మూడవదైన ద్యులోకమనీ, మూడులోకాలనీ రెండర్థాలు చెప్పవచ్చును. సాయణుడు మూడులోకా లనే అంటాడు. కాని సాయణుల ప్రకారము అంతరిక్షలోకము రెండవపాదములో సూచింపబడ్డది. మిగిలిన రెండులోకాలూ సూర్యుని దగ్గర ఉన్నవి. అందొకటి 'త్రిస్రో ద్యావః' అని సూచించినప్రకారము ద్యులోకము; రెండవది పారిశేష్యేణ భూలోకము. కాని సవితృ దేవత నుద్దేశించి చెప్పుతున్న ఋక్కులో 'ద్యావః' అని ప్రయోగమున్నా ఆ దేవత నివసించే లోకమైన ద్యులోకమును గురించి చెప్పలే దంటే చాలా హాస్యాస్పదంగా ఉంటుంది. అందుకనే ఆ పదానికి రెండర్థాలు చెప్పుకోవాలి. సవిత తనలోకంలో ఉండి తనలోకాన్ని ప్రకాశింపజేసుకొంటూ భూలోకాన్నికూడా ప్రకాశింపజేస్తున్నాడు. అందుకని ఆయన కీ రెండులోకాలూ సమీపంలో ఉన్నై. మూడవదియగు అంతరిక్షలోకము యముని దగ్గర నున్నది.

కాని స్కందస్వామివ్యాఖ్య పరిశీలిస్తే ఇంతకంటే ఎక్కువ న్యాయసమ్మతమయిన వివరణం దొరుకుతుంది. "అగ్నిం యమం మాతరిశ్వాన మాహుః", "యమో హ జాతో యమోజనిత్వం" అనే ఋక్కులనుంచీ యముడంటే అగ్ని అని తేలుతుంది. దానికి బలంగా 'భువనే' అనే శబ్దముంది. భూమికి భూః, భువన అని పేర్లున్నాయి. అలాంటి సమయంలో ద్వితీయపాదంలో భూలోకం సంగతి వస్తుంది. ఈ మూడులోకాలూ ద్యులోకము, అంతరిక్షలోకము, భూలోకము అన్న క్రమంలో ఉన్నవి. అలాంటప్పుడు ద్యులోక దేవతయైన సవితకు ద్యులోక, అంతరిక్షలోకాలే సమీపంగా ఉన్నవనటం చాలా సమంజసము. అంతేకాని భూలోకం గాదు. భూలోకమంటే, మధ్య అంతరిక్షలోక మంటే

భూలోక మెట్లా దగ్గిరౌతుంది? ఒకవేళ ఐనా మూడులోకాలూ సవితదగ్గి రున్నా యని అనవలసి ఉంటుంది. కాని రెండే నని చెప్పినారు. అందుచేత ప్రథమపాదంలో ద్యురంతరిక్షలోకాలూ, ద్వితీయపాదంలో భూలోకమూ పేర్కొనబడ్డ వని చెప్పక తప్పదు. ఈ సందర్భములో సాయణుల వ్యాఖ్య అంత సమంజసముగా లేదు.

రెండవ పాదంలోని 'విరాషాట్' అనే పదం చాలాచిక్కులు కలిగిస్తుంది. "ప్రార్థ్యంతే ఇతి విరా, విరాః గంత్ర్యః సహాతే. ప్రేతాః పురుషాః అంతరిక్షమార్గేణ యమలోకే గచ్ఛంతి త్వర్థః" అని సాయణులు వ్యాఖ్య చేసినారు. అంటే చనిపోయిన తర్వాత యమలోకాన్ని కోరుతూ పోయేవారిని సహిస్తుందిగనక ఆ అంతరిక్షలోకము 'విరాషాట్' అయిందంటారు.

కాని ఈపాదము అంతరిక్షలోకానికి చెందినదని సాయణులతో ఒకవేళ అంగీకరించినా ఈరూపనిష్పత్తి అసమంజసము. అసలు శబ్దము 'వీర + సహ్' అని. వీరులను సహించేది. ఆకాలంలో ప్రతికవీ వీరులైన పుత్రుల నివ్వమనే ప్రార్థించేవాడు. ప్రతిమనుష్యుడూ వీరుడే. అంటే ఒకమోస్తరు నిర్బంధసైనికశిక్షణ (Compulsory Military Training) వారికుండే దన్నమాట. కొండల్లోనూ, కోనల్లోనూ అనాగరకంగా తిరిగే అనార్యజాతిని అణగగొట్టి రూపుమాపివేయటానికి ప్రతివాడూ యోధుడుగా తయారయేవాడు. ఆ అంతరిక్షలోకము వీరులనూ, పిఱికిపందలనూ ఒకేరకంగా స్వీకరించదు. వీరుడంటే గౌరవ మిస్తుంది. అందుకనే అది వీరులను సహించేది. అట్లా కాకపోతే పిఱికిపందలైన అనార్యులనుకూడా ఆ అంతరిక్షలోకముస్వీకరించాలి. అలాంటిసందర్భము ఋగ్వేదంలో ఎక్కడా కనబడదు. అంతే కాని 'వృఞ్ వరణే' అన్నధాతువునుంచి నిష్పన్నమైనదేమీ కాదు. వీరశబ్దమునుంచే ఈ రూపము వచ్చింది. కాని సంగీతముపై నాధారపడిన ఛందస్సుకొరకై 'వీ'ని హ్రస్వముగాచేసి, రేఫను దీర్ఘంగా చేశారు. అందుకనే 'విరా' అని వచ్చింది. ఇల్లాంటిఛందశ్చిత్రాలు చాలాకనపడతై ఋగ్వేదంలో. ఉదాహరణకు — 'అభివృతం'అనటానికి బదులు "అభీవృతం కృశనైర్విశ్వరూపం" అనీ, 'ఋతవరీ' అనటానికి బదులు 'ఋతావరీ' అనీ అన్నారు. కాని ఇక్కడ రెండక్షరాలు మార్పుచెందటంచేత పదపాఠంలో అవి విడదీయబడలేదు. 'విరాషాట్' అనే ఉంచబడ్డది.

స్కందస్వామివ్యాఖ్యప్రకారము ఈ పాదము భూలోకమును గురించి చెప్పేటట్లైతే దీన్ని చాలా బాగా అర్థము చేయవచ్చును. స్కందస్వామి ప్రకారము ఈలోకము వివిధములైన వీరులవలని ప్రదీప్తులతో వెలుగుచున్నదని అర్థము. కాని శబ్దము సరిగా నిష్పన్నము కానందున అది అసంభవ మని తర్వాత చెప్పెదను. 'విరాషాట్' అనేపదానికి వీరులను సహించేది అని అర్థమును నిశ్చయించితిమి కదా. ఈ భూలోకము వీరులను సహించేది. ఆర్యులు వీరత్వానికీ, శూరత్వానికీ ప్రసిద్ధి గాంచినవారు. వీటిల్లో వీరిని మించినవారు లేరు. వీరులు కాని ద్రావిడులను తమ వీరత్వము చూపి వశపరచుకొన్నారు. అట్టి సందర్భములో వీరులు కానివారికి ఈభూలోకమున స్థానమే లేదు. అందుకని తమ ప్రతాపమును స్పష్టీకరిస్తూ "ఈ భూలోకము వీరులైన ఆర్యులనే

సహిస్తుంది. అందుకనే ఇది నూత్నకళలతో ప్రజ్వరిల్లుతున్నది." అనే ధ్వని వచ్చేలాగా చాటినారు. మన పూర్వులైన ఆర్యుల జ్ఞానసంపత్తి ఇక్కడ తెలియక మానదు.

'అమృతాధితస్థుః' అనే పదంలో అమృతశబ్దమును నిర్వచిస్తూ "జ్యోతీంషి, జలాని వా" అని వ్యాఖ్యచేసేకన్నా మర్త్య భిన్నములైన వన్నీ అంటే చాలా బాగుంటుంది.

ఇంతగందరగోళంతో కూడుకొన్న ఈ ఋక్కును సాయణులవ్యాఖ్య ననుసరించామన్న పాశ్చాత్యులు కొందరు సరిగా అర్థం చేసుకోలేకపోయినారు. వారిలో ఒకరు *"The interpretation of this stanza is somewhat difficult; for it is meant, as the last pada indicates, as an enigma"* అని అన్నారు. "ఆ సవితృరూపం తెలిసిన మానవుడు దీనిని వివరించుగాక" అన్న నాల్గవ పాదాన్ని పట్టుకొని నిజంగా ఈఋక్కుకు అర్థంలేదనీ, అర్థంతెలిసినవాళ్లు వివరించెదరుగాక అనీ ఆనాటికవులు ఒక విడదీయలేని విషయాన్ని వదలినా రనటం చాలా శోచనీయం.

కవి భూలోకమండలివాడు; సవిత ద్యులోకదేవత. భూలోకము మర్త్యము; మిగిలినవి అమర్త్యాలు. అమర్త్యస్థానాల కాశ్రయమై మర్త్యామర్త్యలోకాలను ప్రకాశింపజేసే సవితృమహిమను మర్త్యుడు వర్ణింపలేడనే ధ్వని వచ్చునట్లు వ్రాసినారుగాని, "మాకు తెలియదు,ఏమో,వ్రాశాము, తెలిసినవాళ్లు చెప్పండి" అని ఆనాటికవులు ఏమీ తలచలేదు. వారెప్పుడూ ప్రకృతిలో ఆటపాటల నాడుకొంటూ, వర్తమానకాలము సరిగా ఉందా లేదా అనుకొంటూ తమజీవితాన్ని అతిమనోహరంగా వెళ్లబుచ్చారేగాని, అర్థరహితాలైన వ్రాత లేమీ వ్రాయలేదు. ఒకవేళ వ్రాసినా అవి మనకు లభ్యములు కావు. అవి ఎప్పుడో నశించి ఉంటై. ఇప్పుడు మనకున్న ఋక్కులలో ఒక్కపంక్తి గూడా అలా వ్యర్థముగా ఉన్నది లేనేలేదని నొక్కి చెప్పవచ్చును.

సాయణులకన్న ఏడెనిమిది శతాబ్దముల పూర్వపువాడైన స్కందస్వామి వ్యాఖ్య పరిశీలనార్హము. 'విరాషాట్' అనేపదానికి 'వి' పూర్వమైన 'రాజృదీప్తౌ' అని ధాతువు చెప్పినాడు. వివిధమైన దీప్తులు గల లోకమన్నమాట. కాని 'రాజ'ధాతువుకు షకారటకారాలు ఎక్కడనుంచి వస్తవో? సూర్యునికిసమీపంలో ఉన్న రెండులోకాలూ ద్యురంతరిక్షలోకా లంటాడు. యమభువనమం దున్నది భూలోకమంటూ, అగ్నికి యముడనేపే రుందని చూపటానికి

"యమో హ జాతో యమో జనిత్వం"
—౧.౬౬.౮

అన్న ఋక్కును ఉదాహరించినాడు.

తర్వాత 'అమృత' శబ్దానికి జల మనే అర్థం చెప్పి, సూర్యకిరణాలు హరించే ఉదకానికి సవిత స్థానమనిగాని, లేకపోతే దేవతలకు ఆశ్రయమనిగాని చెప్పవచ్చు నన్నాడు.

ఈ వ్యాఖ్యప్రకారం కొన్ని కొత్తసంగతులు లభించినై. కొద్దిమార్పులతో ఈ ఋక్కునకుగూడ ఈతని వ్యాఖ్యనే అనుసరిస్తే ఆ విడదీయలేని సమస్య తేలికగా విడిపోతుంది.

3

"ప్రయే శుంభంతే జనయో న సప్తయః
యామన్రుద్రస్య సూనవః సుదంససః
రోదసీ హి మరుతశ్చక్రిరే వృధే
మదంతి వీరా విదథేషు ఘృష్వయః."

—౧.౮౫.౧.

( సుందరరూపులును, శీఘ్రగతులును గల్గి, గమనవేళల స్త్రీలవలె అలంకరించుకొన్న రుద్రుని పుత్రులగు మరుత్తులు ద్యావాపృథివీలోకములను సౌందర్యవంతముగా చేసినారు. ఘర్షణశీలురైన ఆవీరులు పండిత పరిషత్తులలో ఆనందము నొందుచున్నారు.)

'సుదంససః' అనే పదాన్ని పాశ్చాత్యులు 'ఆశ్చర్యకరమైన' అనీ, సాయణులు 'శోభన కర్మాణః' అనీ వ్యాఖ్య చేశారు. 'దసి దర్శనదంసనయోః' అని ఒక ధాతు వుంది. ఆ ధాతువు ప్రకారము 'దంస' శబ్దానికి దర్శనము అను అర్థమే చెప్పవలెను. అందుచేత సుందరమైన రూపము గలవారని అర్థము వస్తుంది. కాని సాయణులు ఆ ధాతువును తోసివేసి "దంస ఇతి కర్మనామ" అన్నారు. వారి కేమాధార ముందో ?

మరుత్తులు రుద్రునికిని (౨–33) పృశ్నికిని జన్మించినవారట. "పితర్మరుతా" మనీ, "పృశ్ని మాతరః"అనీ కనవస్తున్నది. పృశ్ని అనేది వర్షాకాల మేఘమండలంతో కూడు కొన్న ఆకాశం.

'వృధే' అనుశబ్దానికి వృద్ధిపొందట మనే అర్థం తీశారు పాశ్చాత్యులు. మరుత్తు లీ లోకాలను యేవిధంగా వృద్ధిపొందిస్తున్నారో వారికే తెలియాలి.

సాయణులు "వృధే వృష్టిప్రదానాదినా వర్ధనాయ" అని వ్యాఖ్య చేశారు. కాని వస్తుతః సుందరరూపులైన మరుత్తులు చక్కగా అలంకరించుకొని వచ్చారంటే ఈ రెండులోకాలకూ అది ఒకవిధమైన సౌందర్యము వచ్చిందన్నమాటే. సుందరంగానే ఉన్న యీలోకాలు మరీ సుందరాలైన వన్నమాట. అందుచేత 'వృధే' అనుపదానికి వర్షణాదులచేత, తమరూపాలచేత సుందరంగా చేస్తున్నారనటమే యుక్తము.

'మదంతి' అంటే తృప్తిజెందుతున్నారన్నమాట. సోమపానము మదమును, అంటే తృప్తినీ, ఆనందాన్నీ కలుగజేస్తుంది. సురాపానం దుర్మదాన్ని తెస్తుంది, అంటే మత్తుగా ఉండటం మొదలైనగుణాలు. ఋగ్వేదంలో ఈవిధంగా సోమం, సుర అనే రెండు రకాల పానాలనూ కన్పరచినారు: 'షూ ప్రేరణే' అన్న ధాతువునుంచి వచ్చింది సోమం. అందువలన అది ఒక మంచి ఉల్లాసకారి.

'విదథేషు' అనే శబ్దానికి 'విధ విధానే' అనేధాతువును తీసుకొని పూజావిధు లనే అర్థం పాశ్చాత్యులు చెప్పినారు. సాయణులు "విదంతి యేషు యష్టవ్యతయా దేవా నితి విదథా యజ్ఞాః" అని యజ్ఞపరంగా అర్థం చెప్పినారు. కాని ధాతువు నిస్తూ 'విద జ్ఞానే' అని ఇచ్చినారు. 'విద' ధాతువైనప్పుడు జ్ఞానమునకు సంబంధించిన కలాపమే ఉండాలి కాని కర్మకాండకు సంబంధించే అర్థం చెప్పటం పొరబాటు.

కాని ౮.౫౧.౫ లో "ద్విపా చ్చతుష్పాత్ చరథాయ జీవమ్" అనే పాదంపై వ్యాఖ్యచేస్తూ "చరథాయ చరణాయ,

గమనాదివ్యవహారాయ" అని వ్రాశారు. ఆవిధంగానే ఇక్కడకూడా "విదథేషు జ్ఞానస్థలేషు పరిషత్సు" అంటే సరిపోయేది. అట్లా కాకుండా యజ్ఞయాగాదుల పరిసరాలలో పెరుగుటచేత యాజ్ఞికార్థమే ఇచ్చారు.

అందుచేత Intellectual activity జరుగుతున్న పరిషత్తులనే విదథ లనటం యుక్తం. ఆకాలంలో కర్మజ్ఞానకాండలు విరోధం లేకుండా ఒకదాని కొకటి తోడుగా పోతుండేవి. ఒకప్రక్క యజ్ఞం జరుగుతున్నా మరొక ప్రక్క జ్ఞానకాండకు చేరిన పరిషత్తులుకూడా జరుగుతూ ఉండేవి.

'ఘృష్వయః' అనే శబ్దాన్ని చాలా వింతగా వ్యాఖ్యచేశారు పాశ్చాత్యులు. అది కేవలం విరుద్ధం. 'ఘృష్ ఘర్షణే' అన్న ధాతువునుంచి నిష్పన్నమైన దీరూపము. సాయణులప్రకారం మహీరుహ శిలోచ్చయాదుల భంజకు లని అర్థము. కాని తమ పరాక్రమముచేత మేఘములలో సంఘర్షములను కలుగజేసి, తత్ఫలితాలైన మేఘగర్జనలకు కారకు లంటే బాగుంటుంది.

౮

"సవితా.........వేతిసూర్యం"

—౧. ౩౫.౯

(సవిత సూర్యునికి మార్గము చూపుచున్నాడు.) సవిత, సూర్యుడు ఒకేదేవతయినప్పటికిన్నీ మూర్తిభేదంచేత గంతృగంతవ్యభావం చెప్పకొమ్మన్నారు సాయణులు. కాని ప్రథమార్థంలో ద్వితీయ చెప్పకొమ్మన్నారు స్కందస్వామివారు. అప్పుడు సూర్యుడు అస్తపర్వతమును గురించి పోతున్నాడనే అర్థము వస్తుంది. అలా కాకపోతే 'సూర్యం' అనేపదానికి సూర్యసంబంధమైన అస్తపర్వతమని అనుకోమన్నారు. అప్పుడు సవితృసూర్యపదాలు భిన్నార్థబోధకాలౌతాయి. ఇబ్బంది ఏమీ ఉండదు.

స్కందస్వామివారి రెండవ సమాధానము చక్కగా సరిపోతుంది. దానికి ఒప్పకోనివారికి నాదో చిన్నసమాధాన ముంది. సవిత లోపలనున్న ఆత్మ, సూర్యుడు దేహము. అంటే సూర్యసవితలకున్న సంబంధము శరీర శరీరిసంబంధమువంటిది. అప్పుడు చేతనుడై శరీరియైన సవిత అచేతనమై శరీరమైన సూర్యునికి మార్గం చూపుతున్నాడంటే తప్పకుండా ఒక పెద్ద తాత్వికసమస్య (Philosophic problem) ఇక్కడ దొరకక మానదు. లేకపోతే సూర్యుడు బింబాని కున్న చక్రంగానూ, సవిత చక్రాని కధిష్ఠాన దేవతగానూ చిత్రింపబడిఉండవచ్చు. అప్పుడు 'వేతి' అనే ధాతువుకు ఆవరించుకొంటుంది (Encompasses) అనే అర్థం వస్తుంది.

౯

"దోషా వస్తర్ధియా వయం."

—౧.౧.౭

ఇక్కడ దోషాశబ్దానికి సాయంకాలమని అర్థం చెప్పి, వస్ To shine అనే ధాతువుతో Illuminer of gloom అని అర్థం దిద్దినారు పాశ్చాత్యపండితులు. 'సాయం ప్రాత' రనే సమాసంలో ద్వితీయాక్షర ముదాత్తమగుటచేత సాయంకాలమునా ప్రొద్దునా అని చెప్పవచ్చును గాని, ఇక్కడ ప్రథమాక్షర ముదాత్త మగుటచేతనూ,వస్తరనునది విడిగా Adverb గా ప్రయోగింపబడక పోవుటచేతనూ సాయణుడు చెప్పినట్లు రాత్రింబగళ్లనరా

దన్నారు. ఏది ఎలా ఉన్నా 'దోషా' అనేపదం సాయంకాలవాచిమాత్రం కాదు. 'రాత్రి' అనే దాని అర్థము.

స్కందస్వామి దోషాశబ్దము రాత్రివచనమనియు, 'వస ఆచ్ఛాదనే' అనుధాతువునుంచి వస్తరను శబ్దము వచ్చినదనియు చెప్పి "రాత్రియందు స్వీయజ్యోతిస్సుతో తమస్సునాచ్ఛాదించుచున్నావు" అని వ్యాఖ్య చేసినాడు. ఈ వ్యాఖ్యయే సాయణుల వ్యాఖ్యకన్న బాగుగా ఉన్నది. సాయణులు స్వరభేదములను చెప్పక తప్పించుకొనిపోయినారు. పాశ్చాత్యులు దోషకు సాయంకాలమని తప్పుడర్థము చెప్పినారు. వస్ To shine అను ధాతు వేమియు కనబడదు. 'వశ కాంతౌ' అనే ధాతువుంది కాని 'వస కాంతౌ' అని వేరే లేదు. అందుచేత "రాత్రివేళ స్వీయ జ్యోతిస్సుతో తమస్సు నాచ్ఛాదించుచున్న అగ్నిదేవుడా నీ కివే మా నమస్కారము" లని చెప్పటమే యుక్తము.

ఈవిధంగానే ౧.౩౫.౧౦ లో "ప్రతి దోషం గృణానః" అనేదాన్నికూడా Towards eventide అని పాశ్చాత్యులు భాషాంతరీకరించారు. అది చాలా అన్యాయము. "ప్రతిరాత్రీ మాచేత స్తోత్రము చేయబడేటటువంటి" అని తర్జుమా చేస్తే బాగుంటుంది. "అత్రచ సాహచర్యా దహని వర్తతే" అని పగటినికూడా స్కందస్వామి తీసుకొనివచ్చినాడు.

మొత్తంమీద 'దోషా' అనుపదం వచ్చినప్పుడల్లా సాయణులు "దోషా ఇతి రాత్రినామ" అనే ఊరుకొన్నారు.

౬

"తేఽవర్ధంత స్వతవసో మహిత్వనా
నాకం తస్థు రురు చక్రిరే సదః
విష్ణు ర్యద్ధావ ద్వృషణం మదచ్యుతం
వయో న సీద న్నధి బర్హిషి ప్రియే"
— ౧. ౮౫. ౭.

(స్వాశ్రయమైన బలముగలవారై మరుత్తులు వృద్ధిపొందుచున్నారు. తమమహాత్త్వము చేత అంతరిక్షలోకమును పొందగలిగి, విశాలమైన సదనము నేర్పాటు చేసుకొనగల్గుచున్నారు. సోమపానముచే గర్వియై అశక్తుడైన ఇంద్రునికి విష్ణువు సహాయ మొనగి యజ్ఞశాలకు తీసుకురాగా, విహంగములరీతి వీరు తమ ప్రియతమములైన బర్హిస్సదనము లందు నాసీనులైరి.)

ఈఋక్కులో ప్రథమపాదాన్ని ఒకపూర్ణ వాక్యంగా పాశ్చాత్యులు తీసుకొన్నారు. అలా తీసుకొనేటట్లైతే "తమ మహాత్వము చేత స్వాశ్రయమైన బలము గలవారై మరుత్తులు వృద్ధిపొందుచున్నారు" అని చెప్పవలసి వస్తుంది. అది కేవలం సత్యానికి దూరము. స్వాశ్రయమైన బలమంటేనే మహాత్వం గోచరిస్తుంది. అందుచేత 'మహిత్వనా' అనే పదాన్ని రెండోపాదంలోకి లాగి "తమమహాత్వంచేత అంతరిక్ష లోకంలో ఒక విశాల వేదిక నేర్పరచుకొన్నా" రని వ్యాఖ్యచేస్తే చాలా సబబుగా ఉంటుంది. సాయణులు ఈ విధమైన ఆకాంక్షను తీసుకొన్నా "నభోవలక్షితమైన స్థానాన్ని స్వకీయనివాసానికి విస్తీర్ణం చేసుకున్నా"రని వ్రాశారు. కాని "మహిత్వనా స్వీయమహిమ్నా, నాకం అంతరిక్షలోకం, తస్థుః ఆస్థితవంతః" అనేది ఒకవాక్యంగానూ, "తత్ర ఉరు విస్తీర్ణం సదః యజ్ఞార్థం

వేదిం చక్రిరే కృతవంతః" అనేది రెండో వాక్యంగానూ తీసుకుంటే బాగుంటుంది. అంతరిక్షలోక దేవతల్లో ఇంద్రుడు, మాతరిశ్వుడు, అపాంనపాత్, రుద్రుడు, మరుత్తులు మొదలైనవారున్నారు. వారినందరినీ తోసివేసి తమకొరకై అంతరిక్షాన్ని విస్తీర్ణం చేశారనేకన్నా అంతరిక్షంలో ఒక విశాలమైన వేదిక కల్పించారంటే చాలా బాగుంటుంది.

మూడవ పాద వ్యాఖ్యలలో ఒకదానికీ రెండోదానికీ పొత్తు కలియనే కలియటం లేదు. పాశ్చాత్యులలో ఒకరు "మదంతోనూ, మత్తుతోనూ తూలిపోతూ ఉన్న వృషభానికి విష్ణువు సహాయపడినవ్వాడు" అని వ్రాశారు.

"మరుత్తులకొరకు కామాభివర్షకము, హర్షోత్పాదకము నైన యజ్ఞాన్ని విష్ణువే వచ్చి రక్షించినవ్వాడు" అని సాయణులు వ్యాఖ్య చేశారు.

"విష్ణువనేశబ్దం యజ్ఞనామం. సప్తమ్యర్థంలో ప్రథమ ప్రయోగింపబడ్డది. యజ్ఞమందు యజమానుడు సోమమనే మదాన్ని గురించివచ్చిన మరుత్తులను తృప్తిపొందించుచున్నవ్వాడు" అని శ్రీ స్కందస్వామివారు వ్రాశారు.

'వృషణం' అనే శబ్దానికి ఒకరు వృషభమనీ, మిగిలిన ఇద్దరూ యజ్ఞమనీ అర్థం చెప్పినారు. కాని సాయణులే

"ఆపోషా అనసః సరత్సం పిష్టాద హ బిభ్యుషీ.
నయత్సీం శిశ్నథ ద్వృషా."

—౩.౬.౧౦

దీన్ని వ్యాఖ్య చేస్తూ వృషా శబ్దాన్ని "వృషా కామానాం వర్షితా ఇంద్రః" అని నిర్వచించారు. విష్ణువునుద్దేశించిన సూక్తాలలో కొన్నిచోట్ల ఇంద్రునొక్కణ్ణే అతని ముఖ్యస్నేహితునిగా చేర్చినారు. వృత్రహననంలో ఇంద్రునికి విష్ణువు బాగా తోడ్పడ్డాడట. ౬.౬౯ లో ఇంద్రవిష్ణువుల నిద్దరినీ కలిపి స్తోత్రంచేశారు. వృత్రగాథ ద్వారా ఇంద్రునికి మిత్రులైన మరుత్తులు విష్ణువుకుకూడా మిత్రులే అయినారు అందువలననే ౫.౮౭లో విష్ణువు మరుత్తులు ఇద్దరూ ఒకచోట కొనియాడబడ్డారు. అదేగాకుండా మరుత్తులు ఇంద్రుని మిత్రమండలిలోనివారు. అందుకనే అతనికి మరుత్వంతుడనేపేరు వచ్చింది. ఇంద్రుడు చేసిన ఘనకార్యాలన్నీ మరుత్తుల సహాయంతోనే నెరవేరినై. వృత్రవధలో మరుత్తులకుగూడా పెద్ద భాగమే ఉంది. ఈవిషయాలన్నీ దగ్గర పెట్టుకొని చూస్తే మరుత్తుల కుద్దేశించిన సూక్తాలలో ఇంద్రుడుచ్చరింపబడలేదనటం సాహసమాత్రం. అంతేకాకుండా 'మదచ్యుతం' అనే విశేషణం సోమ ఇంద్రులకే ఉపయోగింపబడ్డది. కాబట్టి 'వృషణం' అనేశబ్దానికి ఇంద్రుడని అర్థం చెప్పుకోవటమే ఉచితము. 'మదచ్యుత' మనే పదానికి "హర్షస్య ఆసేక్తాం"మనే అర్థం కుదరదు. వృషణశబ్దానికి యజ్ఞమనే అర్థంకుదరదనీ, ఇంద్రుడనే చెప్పుకోవాలనీ నిర్ణయించాము కాబట్టి, ఈ శబ్దాన్ని ఇంద్ర విశేషణంగా ఇతరస్థలాలలో ప్రయోగించారు గనక ఆవిధంగానే సమన్వయించాలి. 'చ్యుఙ్ గతౌ' అనే ధాతువు ఇక్కడ ప్రయోగింపబడ్డది. సోమపానమంటే ఇంద్రుని కత్యంత ప్రీతి అనీ, వృత్రవధ అయిన తర్వాత మూడు సరస్సుల సోమం త్రాగినాడనీ కథలున్నై ఋగ్వే

దంలో. అందుచేత మదమంటే సోమపానం చేత కలిగిన ఉత్సాహమాంద్య శక్తులచేత చ్యుతం—దారితప్పో, లేక యేదో పరధ్యానం గానో, లేకపోతే అసలు తూగిపోతూనో పోతున్నట్టి ఇంద్రునికి విష్ణువు సహాయ మొనర్చి యజ్ఞశాలయందలి వేదికకు తీసు కొనివచ్చినప్పుడు అని అర్థం చెప్పాలి.

ఈ సంగతులను మనస్సులో పెట్టుకొని స్కందుని వ్యాఖ్యను చూస్తే అది కాస్త దారితప్పిపోయి, అన్వయానికి కొంచెం అడ్డంగా పోయేలాగా కన్పించకమానదు.

౭

"శూరా ఇవేద్యు యుధయో న జగ్మయః
శ్రవస్యవో న పృతనాసు యేతిరే
భయంతే విశ్వా భువనా మరుద్భ్యో
రాజాన ఇవ త్వేష సందృశో నరః"

—౧.౮౫.౮

(శూరులరీతిగా, యోధులమాదిరిగా వేగంగా పోతూ, కీర్తికాములవలె యుద్ధ భూములలో యత్నములు చేస్తున్నారు. భయంకరంగా ఉండే రాజులనుచూచి నరులు భయపడేమాదిరిగా అన్నిభువనాలూ మరుత్తు లంటే భయపడుచున్నవి.)

ప్రథమోపమానమును శూరులైన పురుషులు శత్రువుల నెట్లా జయిస్తారో అదే మాదిరిగా మరుత్తులకూడా ఎదురులేకుండా పోతున్నారని వివరించాలి. యుద్ధశీలురైన మనుష్యులు శత్రుదేశాలను ఎంత శీఘ్ర కాలంలో ఆక్రమించుకొంటారో, అంత వేగంగా మరుత్తులు వ్యాపించుతున్నవని రెండవ ఉపమానము. అన్నధన కీర్తికాములైన మానవులు యుద్ధాలంటే ఎలా వెను దీయరో అలాగే మరుత్తులుకూడాను అని తృతీయోపమానము.

'శ్రవస్యవః' అనేశబ్దాన్ని సాయణులు 'అన్నం' అని వ్యాఖ్యచేశారు. శ్రవశ్శబ్దానికి అన్నధనకీర్తులని మూడర్థాలున్నా, మనుష్యుల Psychological instinct కీర్తినే కోరుతూ ఉంటుంది. కీర్తికోసమే యుద్ధంలోకి దిగుతుంది. పైపెచ్చు ఆకాలంలో వాళ్లంతా వీరులే కాబట్టి కీర్తే వారికి ప్రధానం. అన్నధనాలకోస మాకాలంలో యుద్ధాలు జరగనేలేదు. దేశం పుష్కలంగా ఉన్నరోజుల్లో అన్నానికి యుద్ధంచేయాలసిన కారణా లేవీ లేవు. అందుచేత 'కీర్తి' అనే శ్రవశ్శబ్దార్థము.

'త్వేషసందృశః' అనేశబ్దానికి ఉగ్రరూపం చేత దీప్తదర్శనులైన రాజులని సాయణుల వ్యాఖ్య. నిత్యాలంకృత శరీరులైన రాజుల రీతిగా మరుత్తులుకూడా దీప్తదర్శనులని స్కందస్వామివారు. 'త్విషదీప్తౌ' అని ధాతువు. కాని ఉగ్రత్వంచేత దీప్తు లనటమే సమంజసం. కాకపోతే అలంకృతులను చూస్తే భయానికి కారణం లేదు. కాబట్టి సాయణుల వ్యాఖ్యే ఇక్కడ బాగుంది. భయంకరరూప (Terrible aspect) మని ఆంగ్లేయులు చేసిన వ్యాఖ్య చింత్యము.

౮

"త్వష్టా యద్వజ్రం సుకృతం హిరణ్యయం
సహస్రభృష్టిం స్వపా అవర్తయత్
ధత్త ఇంద్రో నర్యపాంసి కర్తవే
హన్ వృత్రం నిరపా మౌబ్జ దర్ణవమ్"

—౧. ౮౫. ౯.

(స్వర్ణమయమును, అనేక ధారలతో కూడుకొన్నదియు నైన వజ్రమును నేర్పరి

మైన త్వష్ట చేయగా, వీరపురుషోచితమైన శత్రుహననాది కృత్యములు చేయుటకై ఇంద్రుడు దానిని తీసుకొని వృత్రుని చంపెను. వృత్రుని చంపుటచే ఉదకములను స్వేచ్ఛగా తిరుగనిచ్చెను.)

'అవర్తయత్' అనేపదాన్ని "ఇంద్రం ప్రత్యగమయత్ దత్తవాన్ ఇత్యర్థః" అని సాయణాచార్యులు వ్రాశారు. త్వష్ట ఇంద్రున కర్పించినాడని వారియూహ. కాని ఇతరస్థలాలను పరిశీలిస్తే ఇత డింద్రునికై వజ్రాన్ని చేసినట్లే కనబడుతుంది గాని ఇచ్చినట్లు లేదు. ౧.3౨లో

"అహ న్నహిం అన్వప స్తతర్ద
త్వష్టా స్మై వజ్రం స్వర్యం తతక్ష."

(అత డాసర్పమును చంపి, ఉదకములను నిర్బంధమునుంచి విడచిపెట్టెను. ప్రకాశించెడి వజ్రమును అతనికై త్వష్ట తయారుచేసెను.) అని ఉంది. ఇలాంటివాటి నన్నింటినీ పరిశీలిస్తే ఇక్కడ త్వష్ట వజ్రాన్ని చేసినాడని అర్థము చెప్పటమే యుక్తం. దీనికి తోడు స్కందస్వామివారి వ్యాఖ్య "శుద్ధమైనప్పటికిన్ని అవర్తయత్ అనే ధాతువును సోపసర్గార్థంలోనే తీసుకొనవలెను. అప్పుడు నిరవర్తయత్ ధాతువౌతుంది. దీనిఅర్థం చేసినాడు అని."

ఆవజ్రానికి విశేషణము 'హిరణ్యయం' అని. సాయణులు 'సువర్ణమయమైన' అని చెప్పకోమంటారు. 'యం' ప్రత్యయం 'చేయబడ్డ' అనే అర్థంలో వస్తుంది—హిరణ్యంతో చేయబడ్డ దని. కాని హిరణ్యంతో వజ్రాన్ని చేస్తే వధానుకూలం కావటం దుర్లభం. అయినా దానిని పట్టుకోవటం చాలాకష్టం. అందుచేత ఆవజ్రానికి వేసిన పిడిని సువర్ణంతో చేశారంటే బాగుంటుంది.

'నర్యపాంసి' అనే శబ్దం చాలా చిత్రమైంది. పదపాఠం "నరి అపాంసి" అని ఇస్తుంది. సాయణులు "నృసంబంధం ఉండటంచేత నృశబ్దం సంగ్రామవాచి ఔతుంది. అపాంసిశబ్దం కర్మవాచి. అందుచేత సంగ్రామంలో శత్రుహననాది లక్షణ కర్మలను చేయటానికి" అని వ్రాశారు.

"నరశబ్దం గణాపేక్షమైన ఏకవచనం. అందుచేత నరి అంటే నరాకారమైన మరుద్గణము. మనుష్యాకారమైన మరుద్గణానికి ఇంద్రుడు వజ్రాన్ని వృత్రవధాది కర్మలను చేయటానికి అర్పించినాడు. ఆవజ్రము అర్పింపబడగా మరుద్గణము మేఘాకారమైన వృత్రుని చంపెను" అని స్కందస్వామివ్యాఖ్య.

మరుత్తుల నుద్దేశించిన సూక్తంలోని ఋక్కును మరుత్తులపరంగానే చెప్పటానికి స్కందస్వామి ప్రయత్నించినాడు. కాని ఇంద్ర సూక్తాలలో మరుత్తులనుగురించీ, మరుత్తులసూక్తాలలో ఇంద్రుని గురించీ సంగతులు చెప్పటం ఋగ్వేదకవులకు మామూలు. ఈ సూక్తంలోని ఏడవఋక్కులో చివర రెండు పంక్తులలోనూ ఇంద్రుని గురించే చెప్పబడ్డ దని ఈవరకే చెప్పియున్నాను. అకథే మళ్లా ఇక్కడ చెప్పబడ్డది. చెప్పినదాన్నే చెప్పతూ పునరుక్తుల(Digressions) లోకి పోవటం వాళ్లకు మామూలు. అంతేకాకుండా వృత్రుని చంపింది ఇంద్రుడు కాని మరుత్తులు కారు. కొన్ని ఋక్కులలో వృత్రుణ్ణి కీళ్లకు కీళ్లూ, ఎముకకు ఎముకా ఊడబీకి, వాడుదాచిన ఆవులను బయటకు లాక్కొ

చ్చారనే ఉంది. కాని వాడు చంపబడలేదు. అలాంటి సమయంలో స్కందస్వామివ్యాఖ్య సరిపోదు. పైపెచ్చు 'ధత్తే' అను ధాతువుకు అర్పణార్థము చెప్పినారు. అది చింత్యం.

'సర్వతాంసి' అనే శబ్దం ఈఋక్కులోనూ, ౮.౯౩.౧౯ లోనూ తప్ప ఇంకెక్కడా కానరాదు. ఈ రెండుచోట్లా పదపాఠంలో మార్పేమీ లేదు. 'సర్యాణి' అనేశబ్దం ౭.౨౧.౪ లో ఒకసారి వస్తుంది. 'సర్యా' అనేది ౪.౧౯.౧౦ లోనూ, ౮.౯౩.౨౧ లోనూ రెండుసార్లు వస్తుంది. ఈ 'సర్యా' 'సర్యాణి' శబ్దాలు రెండూ 'అపాంసి' శబ్దానికి విశేషణాలుగానే వాడబడ్డవి. ౮.౯౩.౧ లో 'సర్యాపసం' అనేశబ్దం "పురుషోచితమైన కృత్యాలను చేస్తూ" అనే అర్థంలో ఇంద్రునికి విశేషణంగా ప్రయోగించారు. ఇక్కడ పదపాఠం "సర్య, అపసం" అని విడదీసింది. ఈవిధంగా ఋగ్వేదం మొత్తంమీద సర్యశబ్దంతో అపశ్శబ్దం ప్రయోగింపబడ్డవి కాని 'సరి' శబ్దం ఎక్కడా కనపడదు. అందుచేత ఈ ఋక్కులోకూడా 'సర్యాపాంసి' అని దిద్దుకుంటే సరిపోతుంది. 'సర్వతాంసి' అని అనుశ్రుతంగా వచ్చినరూపం అధ్యాపక అధ్యేతృపరంపరలో వచ్చిన అపశబ్దం. పదపాఠంలోకూడా "సర్యా, అపాంసి" అని దిద్దడం న్యాయసమ్మతం. అప్పుడు "శత్రువుకు వీరపురుషోచిత కృత్యాలు చూపి వాటి ననుభవించేలాగా చేయటానికి" అని తాత్పర్యార్థం తేలుతుంది. అప్పుడు సర్యాశబ్దానికి మూలం "సర్—సరీ—సరి" అనేలాంటి దేమన్నా అయి ఉంటుంది. 'సర్య' లో 'య' కారము మనుష్యోచితమైన అనే అర్థాన్నిస్తుంది. అందుచేత 'సర్యాపాంసి' అనే రూపం తీసుకోవటమే యుక్తము.

ఋగ్వేదంలోని వృత్రవధకూ, పురాణాలలో చెప్పే వృత్రవధకూ చాలా భేదముంది. వేదకాలపు వృత్రుడు రాక్షసుడు కాదు. 'వృఙ్ వరణే'అనేధాతువునుంచి నిష్పన్నమైన రూప మిది. 'ఆవరించిన' అని అర్థము. వృత్రుని చంపి నీటిని వదలినా డంటే వృత్రశబ్దానికి ఆవరించిన మేఘ మనే అర్థం చెప్పాలి. ఐతే ఈ సంగ్రామకథలను ఎట్లా సమన్వయించాలి అనే ప్రశ్నకు క్రీస్తుపూర్వము ౯,౧౦ శతాబ్దాలనాటి యాస్కుడు "అపాంచ జ్యోతిషాంచ మిశ్రీభావకర్మణో వర్షకర్మ జాయతే, తత్రోపమార్థేన యుద్ధవర్ణా భవంతి" అని నిర్వచించినాడు. ఈ సమాధానము సహృదయులను సమాధానపరచి ఆకాలపు ఋషులు కేవలము ఋషులే కాకుండా గొప్ప కావ్యాత్మ (poetic soul) కల్గిన కవిసార్వభౌము లనే భావాన్ని అంకురింపజేయగల దని నావిశ్వాసం.

వర్షాకాల మేఘము వర్షాత్పూర్వావస్థలో నీటిని వదలకుండా ఆకాశాన్నంతా ఆవరించుకొని (వృణోతి) ఉంటుంది. దాన్ని మరుత్తుల సహాయంతో ఇంద్రుడు తన వజ్రాయుధంతో (ఇంద్రధనుస్సే కావచ్చును) చెదరగొట్టి, వాటిని నాశనంచేసి వర్షం కురిపిస్తాడు. అందుకనే వృత్రశబ్దానికి వృష్ట్యుదకానికి ఆవరకమైన మేఘ మని సాయణులు నిర్వచనం చెప్పినారు.

'అర్ణవం' అంటే ఉదకమున్న స్థానము. మేఘంలో ఉండే ఉదకాన్ని ఇంద్రుడు (నిరాబ్జత్) స్వేచ్ఛగా వదలివేశాడు.

ఈ ఋక్కును సరిగా గమనిస్తే మన పౌరాణికుల మేధాశక్తి స్పష్టము కాగలదు. పాపము, వేదకాలపునాటి మేఘుడైన వృత్రుడు వారిచేతులలో బడి రాక్షసుడైనాడు! ఇలాగే చాలా వేదగాథలను తర్వాత మార్చివేశారు. కవిత్వసంపదతో తులతూగిపోయే ఈ వేదకథలు యజ్ఞయాగాదుల సంబంధమై కవిత్వ శూన్యమైన Matter-of-fact కథలుగా పరిణమించినవి.

ఇంద్రుని వజ్రాయుధము మెఱపును గానీ, ఇంద్రధనుస్సు (Rainbow) ను గాని చెప్పేదైఉండాలి. ఇది ఏపదార్థంతో చేయబడ్డదో తెలుసుకోవడం కష్టం. ఇనుముతో నని కొన్ని ఋక్కులూ, స్వర్ణంతో నని కొన్ని చెప్పతవి. కొన్నిచోట్ల ఏదో ఒక పెద్ద రాతినో, గుట్టనో వజ్రాయుధంగా చెప్పినారు.

త్వష్ట చాలా అందమైనవాడనీ, అందమైన ఆయుధాలు కలవాడనీ ఋగ్వేదం లో వర్ణింపబడ్డాడు. ఇతడు జీవరాశికి ఒక రూప మిచ్చినవాడట. మానవజాతికి ఆది పురుషు డని పొగడినారు కవులు. కాని చివరకు ఇంద్రునిచేత ఇతడు చంపబడ్డాడని కొన్ని ఋక్కులలో చెప్పబడింది. ఈ విషయంకూడా పౌరాణికగాథకు చాలా బాగా తోడ్పడిఉంటుంది. ఈఋగ్వేదగాథదగ్గర పురాణగాథను చూస్తే కథకు కాళ్లు లేవనే సామెత చక్కగా బోధపడకమానదు.

---

# విన్నపము

శ్రీ వెదురుమూడి
వెంకటకృష్ణారావు

అలుకం జెందిన కోకిలట్లు చెలి, నీ వత్స్యుగ్రచిత్తంబుతోఁ
బలుకం జింతిలఁగాని, తావకపదాబ్జద్వంద్వముం దాఁకి, చే
తులు జోడించి వచింతు - నేత్రములు జ్యోతుల్ రిక్తిఁ గావింపకే!
విలసన్నీరజ మంచు మోమున నఖుల్ బీభత్సముం జేయునే!

---

# విశిష్టాద్వైత-పరామర్శ

శ్రీ పూర్ణానంద

అమలకమలసంస్థా లేఖనీపుస్తకోద్యత్ కరయుగళసరోజా కుందమందారగౌరా
ధృతశశధరఖండోల్లాసి కోటీరచూడా భవతు భవభయానాం భంగినీ భారతీ వః.

'విశిష్టాద్వైతవాదము' అను నా వ్యాసములోని రెండుమూడు వాక్యములను పరామర్శించుచు శ్రీ భాష్యంవారు ఒకవ్యాసమును గత డిసెంబరునెల భారతిలో ప్రకటించియున్నారు. దానిని చదువగా, సంతోషము, విచారముకూడ నొక్కట గలిగినవి. సంతోషము: మాదృశులగువారి వ్యాసము ఆచార్యులవారినిబోలు పరమపండితుల దృష్టి నాకర్షించినందులకు. విచారము: సాంప్రదాయికమైన ఆలోచన కాస్కారము కలుగుటచే.

ఆంధ్రవాఙ్మయమున దార్శనికరచనలు మృగ్యములగుటవలన ఇట్టిరచనల అవసర మెంతేని యున్నది. పక్షపాతమునకు దావీయక, కేవలము విమర్శకదృష్టితో ఇట్టివాదముల నొనర్చుట సంఘశ్రేయమునకు కారణము కాగలదు. సంస్కృతసాహిత్యము మాట విడచినను, ఇతరభారతవర్షీయభాషలలోను, ఆంగ్లమునను ఉన్నదానిలో శతాంశమైనను ఆంధ్రమున లేకుండుట శోచనీయము.

శ్రీ శంకరరామానుజులలో నా కెవరియందును విశేషమగు పక్షపాతబుద్ధి లేదు. వారి మహాపురుషత్వ సాధుజీవనములు నాకు ఆదర్శప్రాయములు. కాని, నిరపేక్షమగు తర్కనియమముల శాణితఖడ్గధాటికి నిలబడు విషయములే నాకు గ్రహణీయములు—శంకరుడే యనుగాక, రామానుజుడే యనుగాక, లేక మఱియొక ఆచార్యులే యనుదురుగాక! నా లలాటమున శంకరులయొక్కగాని, తదితరులయొక్కగాని ముద్రలేదు. ఏకదేశిత్వవిరహితమగు సత్యాన్వేషణమే నా జీవితవ్రతము. అది జగత్తునందలి ఏకోణమునుండి అరుదెంచినను గ్రహించుటకు నేను జంకను.

నేను శ్రీభాష్యమును పఠించితినా, పఠించుచో అద్వైతవాసనాప్రాబల్యమువలన అవబోధితుడ నైతినా యను అవాంతరశంకలను విడచి 'ప్రకృత మనుసరామః'.

## ౨

జీవుని కార్యత్వనిత్యత్వములనుగుఱించి శ్రీ భాష్యమున ఆలోచింపబడియుండుట నిజమే. ఇది విశిష్టాద్వైతదృష్ట్యా సమంజసమును, అవిరోధమునుగూడ నై యున్నది.

కాని: తదితరులు ఈ విషయమును ఒప్పుకొనుదురా యనునదే ముఖ్యప్రశ్న.

స్వరూప-అన్యథాభావలక్షణమగు ఉత్పత్తికంటె అన్యమై, జ్ఞానసంకోచవికాసలక్షణమగు కార్యత్వము జీవునియందు ఉన్నదనుటకు శ్రుతిప్రమాణ మేమి? ప్రతిపాద్యవిషయము శ్రుతిసమర్థితమై ఉండవలెననికదా సర్వవాదిసమ్మతమైన నియమము? శ్రుతివలనను, తదితరయుక్తులవలనను సమర్థితము కానంతవఱకును ఈ విషయము అస్వీకృత మగును.

'అవస్థాంతరాపత్తిలేని కార్యము' అనుమాటయే 'వేడిమంచు' అను పదమువలె పరస్పరవిరుద్ధమై ప్రకాశించుచున్నది. నవ్యవ్యాఖ్యానుమోదితమగు భాషలో పడబోక, ఏతద్దోషవిరహితముగనే 'కార్యత్వ' మును నిర్వచించుకొనినను 'వికారము' అనుదోషము తొలగజాలదు. వికారరహితమగు కార్యమునకు దృష్టాంత మేమి? సర్వవాదిసమ్మతమగు దృష్టాంతమును చూపగలరా? చూపకున్న అనిత్యత్వదోషము తొలగదు.

౩

శరీర-శరీరిభావమును గుఱించి: శరీరగతములగు బాల్య యౌవన స్థవిరత్వాదులు ఆత్మను స్పృశింపనిమాట యథార్థము. కారణము? ఆత్మ శరీరమునుండి వేరు. శరీరఅభిమానమున్నవారికే తద్గతములగు సుఖదుఃఖముల అనుభూతి; వేరని గ్రహించినవారికి కాదు.

తథాచానుమానమ్: అయితే, ఈశ్వరుని —విశిష్టాద్వైతుల పరబ్రహ్మము— విషయమున గూడ ఇట్లే తలంపవలసియుండునా? జీవ జగద్యుక్తమైన శరీర అభిమానము, అస్మదాదుల శరీరఅభిమానమువలె, భ్రాంతి: 'పారమార్థికముగ' ఈ శరీరము ఆయనకు లేదు. కనుక ఏతత్ శరీరగతములగు దోషము లాయనను స్పృశింపవు. ఇట్లు పరిపుచ్చుకొనకున్న ఈదోషము తొలగదు; ఒప్పుకొనిన విశిష్టాద్వైతమే నిలువదు. అట్టి శరీర మున్నదని ఒప్పుకొనినను, 'నిత్యమగు జడపదార్థము' ఉన్న దనుమాట లోకవేద విరుద్ధము. ఉన్నను, 'ఆభూతసంప్లవ' కాలమును దాటి స్థిరముగ నుండజాలదు. కనుక అదియును వికల్పితమే యగును.

మఱి: నిత్యమగు జడవస్తువునకు దృష్టాంత మేది? దృష్టాంతాభావమువలన శరీరకల్పన నిలువదు.

౪

ఇక శ్రీ అనంతాళ్వార్ స్వామివారి 'న్యాయభాస్కర' మును గుఱించి: ఆగ్రంథము అప్రసిద్ధము. దాని పఠన పాఠనము లున్నట్లు నాకు తెలియదు. శాంకర శ్రీభాష్యముల కున్న ప్రసిద్ధి దానికి లేదు. ఇవి ఆసేతు హిమాచలము ప్రచారమున నున్నవి. న్యాయామృత, అద్వైతసిద్ధుల కున్న ప్రసిద్ధి ( Popularity ) దాని కున్నపట్ల, ఆచార్యుల వా రా గ్రంథము నరయ ఉపదేశించిన బాగుండెడిది.

కనుక: ఆచార్యులవారు అందలి విషయములను విమర్శించి ఒక వ్యాసమును వ్రాసిన, మాదృశు లగు అల్ప జ్ఞానులకును విస్తరముగ మేలు చేకూరగల దని మనవి.

కాకున్న: ఆ గ్రంథము నాకు దొరకనంతవఱకును నేను దానిపై ఎట్టి అభిప్రాయమును ఒసగజాలను. అందలి యుక్తులు యథార్థముగ న్యాయశాస్త్ర నియమముల ననుసరించి అద్వైత సిద్ధికారుని పంచమిథ్యాత్వ నిరుక్తిని ఖండింపగలిగియున్న — ఒప్పుకొనుటకు నా కభ్యంతరము లేదు. నేను Patent (పేటెంటు) అద్వైత వాదిని కాను.

౫

ఆచార్యులవారు ప్రాచీన-అర్వాచీన విశిష్టాద్వైతగ్రంథములను జూచి నా కించిజ్ఞత్వమును పోగొట్టుకొనవలెనని చెప్పినట్లు నేనుగూడ వారిని ప్రాచీన-అర్వాచీన అద్వైతగ్రంథములను నిష్పక్షపాతబుద్ధితో —విశిష్టాద్వైతవాసనను విడచి— చదివినయెడల శ్రీరామానుజుని వియుక్తులు పేలవములైనవి సుస్ఫుట-ఉదాత్తముగ తేలిపోవునని ప్రార్థించిన బాగుండదా?

బాగున్నను బాగుండకపోయినను నావ్యాసము సాంప్రదాయిక వివాదమునకు ఆకరమైనందుకు మిక్కిలి విచారించుచున్నాను. నా ఉద్దేశ్యము ఏయొక ఆచార్యుని సమర్థించుట గాదు. సామాన్యసిద్ధాంత ప్రవర్తనమునర్చి, నిగమనభారమును పాఠకులకు వదలుటయే.

ఈ వ్యాసమునందలి ఆక్షేపణలకు ఆచార్యులవారు మరల విశిష్టాద్వైత దృష్ట్యా సమాధానమిచ్చిన మూకీభావమే నాకు శరణ్యమగును. నిరపేక్షములగు యుక్తుల ననుసరించినచో, ఒప్పులనో, లేక తప్పులనో చూపగలనని మనవి.

వందే వేదాంత కర్పూర చామీకర కరండకమ్
రామానుజార్యమార్యాణాం చూడామణి మహర్నిశమ్.

---

# భారతీయవైద్యపు పుట్టుక

క్రమ పరిణామ వికాసములు

## శ్రీ చక్రవర్తి రామానుజాచార్యులు

హిందూదేశపు వైద్యము యొక్క పుట్టుక చాల పురాతనమైనది. ఈ వైద్యము యొక్క కాలనిర్ణయము రూఢిగా నిర్ధారణగాని సమయమున గూడ ఈ వైద్యము, దీని విభాగములతో (అనగా శల్యతంత్రము, పిండోత్పత్తి, వృద్ధి—వీటిశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము, విషతంత్రము, రోగనివారణ శాస్త్రము) సిద్ధాంతములరూపముగాను, ఆచరణ రూపముగాను (Both in Theory and Practice) వృద్ధిచెంది పరిపూర్ణతను బొందియుండెను.

హిందూదేశపు వైద్యములోనుండు నిదానభాగమును (Pathology) రమారమి నాల్గుభాగములుగా విభజింపవచ్చును: (౧) వేదకాలము, (౨) సంహితలకాలము, (౩) సంగ్రహకాలము (Period of compilations) (౪) వైద్యహీనకాలము (The Period of degeneration).

వేదకాలము:—ఇదియే ఆయుర్వేద మనెడి సూర్యునియొక్క అరుణోదయకాలము. ఇది చరక సంహిత (౧-౩౦-౧౩) ప్రకారము మానవప్రపంచము పుట్టినప్పటినుండి యున్నట్లు తెలియుచున్నది.

"అత్రోచ్యతే – తంత్రమార్షం కాత్స్న్యేన యథా మ్నాయ ముచ్యమానం వాక్యశోభవత్తుక్యం"

ఆయుర్వేదము నాల్గవవేదమగు అథర్వవేదము యొక్క శాఖ యనియు, మరికొందరు (బ్రహ్మవైవర్త పురాణములో నుండునట్టుల) అయిదవ వేద మేయనియు పరిగణించుచున్నారు. ఈ కాలనిర్ణయము ఇంకను వివాదప్రశ్నగానే యున్నది. ప్రాచ్య, పాశ్చాత్య దేశములందలి మహామేధావుల బుద్ధిని కలవరపరచినదే గాని క్రిందటి శతాబ్దమువరకును ఏమియు నిర్ధారణ గాలేదు. ఎటులైనను ఇది చరిత్రకు అంతులేని కాలమున నుండుననియు, వేదములే ప్రపంచమున కంతటికిని పురాతన సాహిత్యమనియు నొప్పిదమైనది. ఇట్టి పురాతనకాలమున నిదానము యొక్క ప్రాదుర్భావమునుగురించి చర్చించుట వృథాశ్రమ మేగాని వేరుగాదు.

ఇట్టి కాలమునందుగూడ ఆయుర్వేదమునందు ఎనిమిది ముఖ్యమైన విషయములనుగూర్చి విపులముగా చర్చింపబడినది. (౧) బృహత్ శస్త్రచికిత్స (Major Surgery), (౨) లఘుశస్త్రచికిత్స (Minor Surgery), (౩) అంతర్గత వైద్యము (Internal Medicine), (౪) మనశ్శాస్త్రము (Psychiatry), (౫) బాలుర వ్యాధులు, తచ్చికిత్సలు (Diseases of children), (౬) ఆరోగ్యశాస్త్రము (Hygiene), (౭) రసాయన చికిత్స (Elixir), (౮) కామశాస్త్రము (Sexual Science). శల్యశాస్త్రముయొక్క జ్ఞానము శవములను గోసి పరీక్షించుటమీదనే ఆధారపడియుండెను. హోయర్నల్ (Hoernle) శల్యపదములను గురించి వ్రాసిన దానిలో ఋగ్వేద అథర్వ వేదములనుండి సంగ్రహింపబడిన పదములు మనుష్యశల్యములకు సంబంధించినవని నిరూపింపబడెను.

రెండవకాలము సంహితలకాలము, లేక మూల గ్రంథముల కాలము. ఇదిగూడ చాల పురాతన మైనదిగలదియే. ఈ కాలమున మనము రెండు పెద్దవిభాగములను చూడవచ్చును. ఓషధులచేత చికిత్స, శస్త్ర చికిత్స అను రెండు మహాశాఖలు గలవు. మహోద్గ్రంథములను అగ్నివేశసంహిత, సుశ్రుతసంహిత అనునవి

యీకాలమునకు సంబంధించినవే. ఇవి యిప్పటికిని ప్రచారములో నున్నవి. అగ్నివేశసంహిత యనునది చరక మహర్షి చేత దిద్దుబాటు చేయబడినది. అదియే యిప్పటి చరకసంహితగా బరగుచున్నది.

లాటిన్ భాషలోనికి తర్జుమాచేయబడిన సుశ్రుత సంహితయందు ఆ గ్రంథముయొక్క పరిచయము హిందూదేశపుచరిత్రలో మిక్కిలి పురాతనమైన దనియు, దానియొక్క ప్రారంభ కాలనిర్ణయమును ఋజువుచేయుటకు అలవికా దనియు, దానియొక్క అంత్యకాలము సుమారు క్రీ. పూ. ౧౦౦౦ వత్సరము లనియు హెస్లర్ (Hessler) చెప్పియున్నాడు (Mukhopadhyaya's History of Indian Medicine Vol. iii. Page 578). హోర్న్లేను (Hoernle), తదితరులును ఇదే అభిప్రాయమును వెలిబుచ్చిరి. (Studies in the Medicine of Ancient India, Part 1 ; Osteology and Introduction, P. 9).

బృహస్పతి కుమారుడగు భరద్వాజ మహాఋషియు, అత్రిమహర్షి కుమారుడగు ఆత్రేయమునీశ్వరుడును అంతర్గతచికిత్సను (Internal Medicine) గూర్చి విపులముగా వ్రాసినవారిలో మొట్టమొదటివారు. ఆత్రేయమహర్షికి ఆర్గురు ముఖ్యశిష్యు లుండిరి. వారి పేర్లు—అగ్నివేశుడు, భేలుడు, జాతుకర్ణుడు, పరాశరుడు, హారీతుడు, క్షారపాణి. వీరు ప్రత్యేక ప్రత్యేకముగా వారివారి అభిప్రాయములను వ్రాసిరి. వాటిలో ముఖ్యమైనది అగ్నివేశసంహిత యనునది. ఈ గ్రంథముగూడ ఇతర గ్రంథముల వలె ఛిన్నా భిన్నమైయుండెను. అట్టి పుస్తకరాజమును చరకాచార్యుడు తన కాలమున (క్రీ. శ. ౨-వ శతాబ్దము) సవరించెను. అదియే యిప్పటికిని ప్రచారములో నుండి, ఆయుర్వేదమునకు ఆయువుపట్టుగా నలరారు చరకసంహిత. చరకమహర్షి ఆగ్రంథములో రెండుభాగములను మాత్రము సవరణచేసెను. అతని మరణమువల్లనో, లేక తదితర కారణములవలననో ఆ గ్రంథము పరిపూర్ణముగా సవరింపబడలేదు. చరకునిచేత సవరింపబడిన భాగమును, చరకునిచే సవరణ గావింపబడని భాగములను కపిలబాలుని కుమారుడగు దృఢబాలునిచేత (Dridhabala) సవరణ చేయబడెను. ఇతడు కాశ్మీర దేశీయుడు. ఇట్టిసవరణ చేయబడినది క్రీ. శ. ౪-వ శతాబ్దమున. ఈ విధముగా సవరింపబడిన గ్రంథమే చరకసంహిత యని పేరెన్నిక గన్నది. ఇందుచేతనే చరకసంహిత యందలి ప్రతిఅధ్యాయ ప్రారంభమునను "ఇతిహ స్మాహ భగవా నాత్రేయః" అనియు, అధ్యాయాంతమునందు "ఇతి అగ్నివేశకృతే తంత్రే చరకప్రతిసంస్కృతే......" అనియు కానవగును.

విశ్వామిత్రమహాఋషియొక్క పుత్రుడగు సుశ్రుతాచార్యులు బృహత్ శస్త్రతంత్రమును ధన్వంతరివద్దనుండి నేర్చుకొని క్లుప్తముగా సుశ్రుతసంహిత యను ఉద్గ్రంథమును లిఖించెను. ఇది ముఖ్యముగా శస్త్రచికిత్సనే వివరించును.

ధన్వంతరియొక్క శిష్యులగు భోజుడు, వాలుకుడు, కరవీర్యుడు, వైతరణుడు, అనుపధేనవు అను వారుగూడ శస్త్రతంత్రకారులై వెలయుచుండిరి.

సుశ్రుతసంహితగూడ మిగిలిన గ్రంథములవలె తారుమారై యుండెను. అందుచేత ఆ గ్రంథమునగూడ సవరించవలసియు, కొన్ని విషయములను చేర్చవలసియు నుండెను. అట్టికాలమున బౌద్ధమతానుచరులలో ముఖ్యుడగు నాగార్జునుడు దానిని సవరణచేసెను (క్రీ. పూ. ౪-వ శతాబ్దము). దానిలో నుండు విషయములు కొన్ని అప్పుడప్పుడు ఏటులనో శిథిలమైపోవుచుండినందుననే క్రీ. శ. ౧౧-వ శతాబ్దారంభమున చక్రపాణి మూల గ్రంథమునుండి వివరించిన కొన్ని విషయములు ఇప్పటి సుశ్రుతసంహితయందు కనబడుటలేదు.

ఓషధులచే చికిత్సచేయు పద్ధతియే మొదట ప్రచారమునకు వచ్చెనా, లేక శస్త్రచికిత్స మొట్టమొదట ప్రచారమునకు వచ్చెనా అనువిషయము ఇంకను సందేహాస్పదముగానే యున్నది. కొందరు అంతర్గత వైద్యమే ముందుగా వచ్చెననియు, మరికొందరు ఆకాలమున యుద్ధములు తరచుగా సంభవించుచున్నందున శస్త్రచికిత్సయే ప్రారంభమునుండి యుండినదనియు, ఆటుతరువాతనే అంతర్గతవైద్యము వచ్చిన దనియు వివిధాభిప్రాయములను వెలువరించిరి. పై గ్రంథకర్తల

పుస్తకములేగాక ఇంకను మరికొందరు మహానుభావులు వ్రాసిన పుస్తకములలో కూడ కొన్నికొన్ని భాగములు ఇప్పటికిని కనబడుచున్నవి. విశ్వామిత్ర, ఖారండ, గార్గ, గాలవ, చక్షుష్య, సాత్యకి, శౌనక, కరాల, కృష్ణాత్రేయ మున్నగువారియొక్కయు, మరికొందరియొక్కయు రచన లింకను సజీవముగానే యున్నవి. ఈ విషయములను గురించి ౧౦-వ శతాబ్దమున నున్న సాహిత్యమునందు విరివిగా వివరింపబడి యున్నది.

ఇట్టి మిక్కిలి పురాతనకాలమునందు గూడ నిదానమును గురించి యెక్కువ శ్రద్ధ వహించినట్లు లోచుచున్నది. చరకసుశ్రుత సంహితలయందు నిదానము గురించి వ్రాయుటకై ప్రత్యేకముగా కొన్ని యధ్యాయములు వదలివేయబడియున్నవి.

నిదానస్థానములో చరకమహర్షి ౮ అధ్యాయములను వినియోగించినాడు. సుశ్రుత సంహిత ఆరు భాగములుగా నున్నది. అందు రెండవభాగము ౧౬ అధ్యాయములు. ఆ అధ్యాయములయందు ప్రాముఖ్యముగా రోగనిదాన లక్షణములను గురించి వ్రాయబడి యున్నది.

ఈ రెండు గొప్పగ్రంథములను బాగుగా పఠించి, వివరించి, పరామర్శించినచో రెండుభాగములుగా నెట్లు విభజింపబడియున్నదో తెలియును: ౧. (ఓషధుల) వైద్యము (అగ్నివేశుని చికిత్సాక్రమము, లేక అతని గురువగు ఆత్రేయుని మతము), ౨. శస్త్రచికిత్స (సుశ్రుతుని చికిత్సాసూత్రములు, లేక అతని గురువగు ధన్వంతరి సిద్ధాంతములు).

వీరి కాలనిర్ణయమునందును, వీరువ్రాసిన గ్రంథముల తేదీనిర్ణయమునందును గూడ అభిప్రాయభేదములు గలవు. ఇది ముఖ్యముగా ఆయాగ్రంథకర్తల అనన్యతను నిరూపించు గందరగోళముచేతను, ఆయా గ్రంథములయొక్క పరిపూర్ణజ్ఞానము లేనందుచేతను ఏర్పడియుండును. కాస్టలేనీ (Castellani) అనువాడును, గారిసన్ (Garrison) అనువాడును ఆత్రేయుడు తక్షశిలలో క్రీ. పూ. ౬-వ శతాబ్దమున వైద్యశాస్త్రమును బోధించుచున్నట్లు సూచించిరి. మరియు చరకసుశ్రుతాచార్యులు క్రమముగా క్రీ. శ. ౨-వ శతాబ్దమునందును, ౫-వ శతాబ్దమునందును నున్నట్లు తెలిపిరి. ఈ కాలపరిమితిని గణించుటలో చరకమహర్షి కాలముతప్ప మిగిలినవారి కాలము చాలతక్కువగా అంచనా వేయబడినది. నిజముగా చరకుడు అగ్నివేశునికిని, సుశ్రుతునికిని వేయివత్సరముల పిమ్మట నుండెను.

చరక సంహితను చూచినచో ప్రతిఅధ్యాయమునందును ఆత్రేయుడు బోధించినట్లును, అతని శిష్యుడగు అగ్నివేశుడు రచించినట్లును చెప్పబడియున్నది.

"అత్రిజేనాగ్నివేశాయ భూతానాం హితమిచ్ఛతా"

—చరకచికిత్స, జ్వర. ౩౪౩

యథార్థముగా చరకసంహిత యనునది అగ్నివేశ సంహితయేగాని వేరుగాదు. మరియు దానిని చరకుడు సవరణచేసినట్లు ప్రతిఅధ్యాయముయొక్క కడపటను గలదు.

"ఇత్యగ్నివేశకృతే తన్త్రే చరకప్రతిసంస్కృతే చికిత్సితస్థానే..."

—చరకచికిత్స, రసాయన. ౬౩

ఇప్పటికిని మనము వాగ్భట, బృంద(Vrinda), చక్రపాణి, డాళన, విజయరక్షిత, శ్రీకంఠ మున్నగువారు వ్రాసిన సంగ్రహగ్రంథములను చూచుచున్నాము. ఇవి క్రీ. శ. ౬, ౧౨ శతాబ్దములమధ్య ప్రసిద్ధిగాంచినట్లు తెలియుచున్నది. ఆగ్రంథములయందు అగ్నివేశ సంహితనుండి కొన్ని విషయములను స్వీకరించినట్లు గన్పడుచున్నది. కాని ప్రస్తుతపు చరకసంహితయందు అవి కానరావు. చరకుని కాలమున ఈ అగ్నివేశసంహిత ఛిన్నాభిన్నమైపోయియుండెననియు, అందుచేత అది సవరణ గావింపబడవలసి యుండెననియు శ్రీ సేన్‌గారు చెప్పిరి. అట్లు సవరింపబడిన అగ్నివేశ సంహితయే యిప్పటి మన వాడుకలో నున్న చరకసంహిత. ఈ విషయము ఆత్రేయుని శిష్యుడగు భేలుడు రచించిన భేలసంహితయందు బాగుగా నిరూపింపబడెను. ఈగ్రంథము తంజావూరు గ్రంథాలయమునందు గలదు. అందు చాల భాగము నశించిపోయినది. నాటికి ౩౦ భాగములు పోయిన విషయములు సరి

చేయవలసియున్నది. ఈ వ్రాతప్రతి కలకత్తా విశ్వవిద్యాలయమువారిచేత సంస్కృతలిపియందు ఇటీవలనే ముద్రింపబడినది.

దురదృష్టవశాత్తు బుద్ధసాహిత్యమందు తక్షశిలలో ఆత్రేయుడు క్రీ. పూ. ౬ వ శతాబ్దమున వైద్యమును బోధించినట్లు కానబడుచున్నది. అందుచేతనే పాశ్చాత్యుల మనస్సు కలవరపడెను. ఇతడు వేరే పురుషుడు. ఇతని పేరు భిక్షుఆత్రేయుడు. ఇతడు బుద్ధ సాహిత్యమునకు చెందినవాడు. ఇతడు బుద్ధుని వైద్యుడును, బౌద్ధమతచక్రవర్తులలో నొకడగు బింబిసార చక్రవర్తివైద్యుడును అగు జీవకుని గురువు. ఇచ్చట ఒకవిషయమును జ్ఞప్తికి తెచ్చుకొనవలయును. అప్పటికాలమున తక్షశిలానగరము ప్రపంచమున కంతటికిని సాహిత్యమందు ప్రథమ తాంబూలమును పొంది యుండినను, సాహిత్యమునకు హృదయమై శోభించుచుండినను, భిక్షుఆత్రేయుడు ప్రాముఖ్యమువహించి ప్రధానగురువుగా నుండినను చరకసంహితయందు ప్రతిఅధ్యాయపు ఆదియందును అగ్నివేశ, ఆత్రేయఋషుల పేర్లుమాత్రమే కనబడుచున్నవిగాని, తక్షశిలనుగురించిగాని, భిక్షుఆత్రేయునిగురించిగాని ఒక్కపదమైనను గానరాదు.

బుద్ధుని సమకాలికుడును, శతపథబ్రాహ్మణము అను వేదభాగమును లిఖించినవాడును అగు యాజ్ఞవల్క్యుడు వ్రాసిన ప్రకారము అగ్నివేశుడు బుద్ధయుగమునకు పూర్వపువాడని తెలియుచున్నది. ఇతడు ఆత్రేయునియొక్కయు, సుశ్రుతునియొక్కయు సిద్ధాంతములను విశదీకరించెను. మహాభాగుడు (క్రీ. పూ. ౪-వ శతాబ్దమున) త్రిదోషములనుగురించి అప్పటికే విపులముగా తెలుసుకొనియుండెను.

చరకుని కాలనిర్ణయమునుగురించికూడ కొంత అభిప్రాయభేద మున్నది. పాణిని (క్రీ. పూ. ౬-వ శతాబ్దము-గోల్డుస్టకర్) రచించిన వ్యాకరణశాస్త్రమందు గల ప్రకరణములనుబట్టిచూడ చరకుడు పాణినికి ముందువాడని చెప్పవలసియున్నది. ఈ విషయము యథార్థమేకాని, ఈచరకుడు అగ్నివేశ సంహితయొక్క సవరణకర్త కాడు. ఈచరకుడు మూడవవేదమగు యజుర్వేదములోని కొన్ని ఋక్కులను వ్రాసెను. దీనిచేత ఈ చరకుడు అగ్నివేశునికిని, అతని గురువగు ఆత్రేయునికిని చాల పూర్వకాలపువాడని గ్రహించవలయును.

చరకసుశ్రుత సంహితలు ప్రాచ్యదేశములలోని కంబోడియాయందును, పాశ్చాత్యదేశములలోని అరేబియాయందును ౯, ౧౦-వ శతాబ్దములయందు ప్రచారములో నున్నట్లు కనబడుచున్నది.

చరకుడు కనిష్కుని ఆస్థాన వైద్యుడుగా నుండెననియు, క్రీ. శ. ౧-వ శతాబ్దమున జీవించియుండెననియు చైనాదేశస్థుల గ్రంథములవల్ల తెలియనగును.

బవర్ (Bower) అనునాతడు ౧౮౯౦-వ సంవత్సరములో వైద్యమునకు సంబంధించిన కొన్ని వ్రాతప్రతులను చైనాకు సంబంధించిన తురుష్కస్థానములోనుండు కష్గర్ పట్టణములో కనుగొనెను. ఈ ప్రతులయొక్క రచనాకాలము ౪-వ శతాబ్దమునకు చెందినదని రూఢిగా నిర్ధారణ గావింపబడినది. వాటిలో కనబడు భాగవత, తాతగత, బుద్ధ మొదలగు నామముల వల్ల ఇవి బుద్ధసాహిత్యకాలమునకు చెందినవని తెలుసుకొనవచ్చును. వీటియందు పునర్వసు, ఆత్రేయ, అగ్నివేశ, క్షారపాణి, జాతుకర్ణ, పరాశర, భేల, హారిత, సుశ్రుత మున్నగువారి పేర్లు చూడవచ్చును.

మూడవ ఆయుర్వేదకాలమునందు సుశ్రుతసంహిత నాగార్జునునిచే (క్రీ. పూ. ౪-వ శతాబ్దమున) సవరణ చేయబడినది. అగ్నివేశ సంహిత చరకునిచే సవరింపబడెను (క్రీ. శ. ౪-వ శతాబ్దము). దృఢబాలుడు క్రీ. శ. ౪-వ శతాబ్దమునకు చెందినవాడు. వాగ్భటాచార్యుడు బౌద్ధమతావలంబకుడు. ఇతడు బహుశః ౫-వ శతాబ్దమునకో, లేక ౬-వ శతాబ్దమునకో దివంగతుడాయెను. ఇతడు సింధూదేశపు గాలెన్ అను పేర వన్నెకెక్కెను. ఇతడు అష్టాంగ సంగ్రహము అను గ్రంథమును మనకు అందజేసెను. బాలవాగ్భటుడు అష్టాంగ హృదయసంహిత అను ఉత్తమగ్రంథమును ౭-వ శతాబ్దమునకో, లేక ౯-వ శతాబ్దమునకో రచించెను. ఈగ్రంథమే ఆయుర్వేద గ్రంథములలో అత్యున్నతపదమును

గాంచి యిప్పటికిని ముఖ్యావసర ఆచరణీయ పుస్తక రాజముగా బరగుచున్నది. ఇదియే ఆయుర్వేద సాహిత్యమునందు సర్వవిద్యా సంగ్రహగ్రంథ (Encyclopaedia) మను పేరును బడసినది. వృద్ధవాగ్భటుడు తన కాలమునందు పూర్వపు ఆయుర్వేదశాస్త్రమునకు సంబంధించిన సాహిత్యము త్వరత్వరగా శిథిలమైపోవుటను గ్రహించి, అప్పటిలో సజీవమైయున్న ఆయుర్వేద సిద్ధాంతముల నన్నిటిని క్రోడీకరించి సరియైన మార్గమున పెట్టుటకు ప్రయత్నించెను.

ఆయుర్వేదము ౮-వ కాలము. ఈకాలమునే ఆయుర్వేద నిదానకాల మని వ్యవహరింతము. ఈ కాలము మాధవకరునితో ప్రారంభమాయెను. అతని గ్రంథమును బట్టియే అతడు ఇందుకరుని కుమారు డని యూహింపవచ్చును. అతడు బెంగాలు దేశస్థుడు. ఓషధిద్రవ్యముల గుణములను గురించి రత్నమాల యను పేరోక గ్రంథమునుగూడ అతడు రచించెను. ఇతడే పూర్వ కాలపు ఆయుర్వేదశాస్త్రములో నుండు నిదానమును క్రోడీకరించి, సవరణచేసి వైద్యులకు అనుకూలముగా నుండునట్లు లిఖించినవారిలో అగ్రగణ్యుడు. ఇతడు వ్రాసిన నిదాన గ్రంథమును, చరకసంహితయు, సుశ్రుత సంహితయు, హారుల్ - అల్ - రషీదు యొక్క ఆజ్ఞానుసారముగా అరబ్బీభాషలోనికి తర్జుమా గావింపబడెను (క్రీ. శ. ౭౮౬-౮౦౨). దీనిచే అతడు క్రీ. శ. ౭-వ శతాబ్దము నాటివా డని రూఢిగా చెప్పవచ్చును. విల్సన్ అనువాడు ఈతర్జుమా చేయబడిన అరబ్బీ గ్రంథములు మూలగ్రంథములనుండి యైనను సంగ్రహింపబడి యుండవలయును, లేదా ఇదివరకే పర్షియాభాషలోనికి భాషాంతరీకరింపబడియున్న గ్రంథములనుండి యైనను తర్జుమా చేయబడి యుండవలయునని నుడివెను. దీనివల్ల మాధవకరుడు ఇంకను పూర్వకాలపువాడని తెలియుచున్నది.

భారతదేశముయొక్క చరిత్రాత్మకమైన విషయములనుబట్టి మాధవకరుని కాలమును సులభముగా నిర్ణయించవచ్చును. మాధవ నిదానము వృందునిచేత ఉదాహరింపబడియున్నది. మాధవకరుని గురించియు, బృందునిగురించియు 'చక్రదత్త' కర్త యగు చక్రపాణి చేత పేర్కొనబడియున్నది. చక్రపాణి నాయపాలుడను చక్రవర్తియొక్క ఆస్థానమున నున్నట్లు తెలియుచున్నది. నాయపాలుడు బెంగాలుదేశములో నుండు గోర్ అను పట్టణమును సుమారు క్రీ. శ. ౧౦౬౦-వ సంవత్సరమున పరిపాలించుచుండెను. ఈతేదీలనుబట్టి వృందుడు క్రీ. శ. ౯-వ శతాబ్దమున నున్నట్లు అనుకొనవచ్చును. సుశ్రుత సంహితయొక్క వ్యాఖ్యానకర్తయగు శ్రీమాధవుడును, వేదములకు వ్యాఖ్యానము వ్రాసిన మాధవాచార్యుడును, మాధవనిదానగ్రంథకర్తయగు మాధవకరుడును ఒకడేయని కలవరపడకుందురుగాక. వారు వేరువేరు పురుషు లని జ్ఞప్తియందుంచుకొనవలయును.

ఆయుర్వేదచరిత్రముయొక్క నాల్గవకాలము ౯౦౦ సంవత్సరములవరకు నుండినట్లు తెలియుచున్నది (౭-వ శతాబ్దమునుండి ౧౬-వ శతాబ్దమువరకు). మాధవకరుడు (౭-వ శతాబ్దము), సోఢల (౮-వశతాబ్దము), వృందుడు (౯-వ శతాబ్దము), చక్రపాణి (౧౦౬౦), వంగసేనుడు (౧౧ లేక ౧౨-వ శతాబ్దమున), గయదాస్ (౧౧-వ శతాబ్దము), డాళన (౧౨-వ శతాబ్దము), అరుణదత్తుడు (౧౨౨౦), బిల్హణుడు (౧౨౨౮), హేమాద్రి వాచస్పతులు (౧౨౬౦), శారంగధరుడు, విజయరక్షితుడు (౧౨౮౦), బోపదేవ (౧౩౦౦) శ్రీకంఠుడు (?), శివదాసుడు (?) తిష్ట (౧౮-వ శతాబ్దము)—వీరి కాలము మొదలుకొని భావమిశ్రుని కాలమువరకు (౧౬-వ శతాబ్దము). ఈభావమిశ్రుడు వ్రాసిన గ్రంథమే భావప్రకాశిక అనుపేర ప్రసిద్ధిగాంచినది. వీరిమధ్య ఇంకను పెక్కుమంది యుండిరి. ఈ పైవారి రచనలు ఇప్పటికిని సజీవముగానుండి, ప్రచారము గలిగి ఆయుర్వేద వైద్యులకు పునాదిగా రాణించుచున్నవి.

మ్లేచ్ఛజాతుల (మహమ్మదీయుల)దండయాత్రల వల్ల హిందూదేశపు వైద్యము ఎట్లు అడుగంటినదియు తెల్పుట నా ముఖ్యాశయము గాదు. క్రీ. శ. ౧౧-వ శతాబ్దమున పిరికితనముగా దోచిన గజనీమహమ్మదువల్ల కళలు ఎట్లు నశించినదియు, అటుతరువాత మహమ్మదుఘోరి (౧౧౯౧), అల్లాఉద్దీన్,

చెంగిస్ఖాన్ (౧౩-వ శతాబ్దము), తామర్లేన్ (౧౪-వ శతాబ్దము) అనువారి అల్లరులవల్ల ఎట్లు నశించి నదియు, పఠాను నవాబులవల్లను, సింహాసనము నాక్ర మించుటకు వారసులు జేసిన పోరులవల్లను, అంతః కలహముల వల్లను, మొఘలాయీల కుట్రలవల్లను, అక్బరు కాలమున తప్ప తదితర మొగలాయీల కాల మున బుద్ధిబలమును ఉపయోగించుటకు వీలులేని పరిసరములు ఏర్పడుటవల్లను హిందూవైద్యము ఎట్లు క్షీణించినదియు తర్కించుటకూడ నా అభిప్రాయము గాదు. పైహేతువులవల్లను, మ్లేచ్ఛుల కాలమున యూనానీ వైద్యమునకును, హూణులకాలమున పాశ్చాత్య వైద్యమునకును రాజాదరణ యుండుట వల్లను ఆయుర్వేదము శీఘ్రముగా నశించిపోయెను. ఆయుర్వేదము, హిందూ మతము అను వృక్షములు ఎన్ని తుపానులు వీచినను, ఎన్ని గాలివానలు వచ్చినను, ఎన్ని వేరుపురుగులు తొలిచినను, ఎన్ని భూకంపములు వచ్చినను నశించిపోక ఇంకను సజీవముగానే యున్న సమాచారమును బట్టి వాటి మహిమాతిశయమును పాఠకులే గ్రహింతురుగాక.

## ఈజిప్టు దేశ వైద్యమహోదశ

ఇంహోటెప్ (Imbotep క్రీ. పూ. ౩౨౦౦) మొట్టమొదటి ఈజిప్టుదేశపు వైద్యుడు. కాహూన్, స్మిత్, ఈబర్స్, హర్స్టు, లండన్, బెర్లిన్ మున్నగు తాళపత్రములను (Papyrus) పరిశీలించినయెడల త్రిదోషసిద్ధాంతమును, నిదానస్థానమును అప్పుడున్నట్లు సాక్షీభూతముగా కనుగొనవచ్చును. మనము లోపలికి పీల్చునట్టి వాయువే ప్రాణాధారమని పరిగణింపబడెను. పరిపూర్ణముగా వృద్ధిజెంది కొరతలేని రుగ్వినిశ్చయపు పద్ధతులలోను, ఓషధులచికిత్సలోను(Drug Therapy) అనుచరణీయశస్త్రచికిత్సలోను(Practical Surgery) పూర్వపు ఈజిప్టులు పరిపూర్ణ జ్ఞానమును కలిగియుండిరి.

## చైనా దేశపు వైద్యము

ఈ వైద్యము క్రీ. పూ. ౧౫౦౦ సంవత్సరము నాటికి మంచిదశలో నున్నట్లు గన్పట్టుచున్నది.

## హిప్పోక్రేట్సు వైద్యము

హోమర్ యొక్క పితలాటకముగా నున్న అశాస్త్రీయమైన జనసామాన్య వైద్యము(Emperical folk Medicine), ఎస్కులపియస్(Euskulapius) యొక్క మతసిద్ధాంతములును, బ్రాహ్మణమతానుసారియైన యొక ఋషి యొక్క(Pythagoras) వేదాంతమును, ఎంపొడికిల్సు(Empodekles) యొక్క నాల్గుభూతముల(తేజస్, అప్, పృథివి, వాయు) యొక్క సిద్ధాంతమును ముఖ్యాంశములుగా గల జ్ఞానముతోటి హిప్పోక్రేట్సు యొక్క వైద్యము ఏర్పడెను. హిప్పోక్రేట్సు వైద్యము శారీరకదోషములయొక్కయు, నిదానము యొక్కయు సిద్ధాంతములకు పునాదిగా నున్నది. మరియు ఈ వైద్యము కొన్ని ఓషధుల నిచ్చినతరువాత కలుగు ఫలితాంశములమీద ఆధారపడియుండెను.

## అలెగ్జాండర్ వైద్యము

ఈ వైద్యము గ్రీకు, హిందూ, ఈజిప్టువైద్య శాస్త్రములయొక్క గట్టి సంపుటీకరణమే. ఈవైద్య కాలముననే మానవకళేబరములపై శల్యతంత్రము నేర్చుకొనుటయు, వ్యాధిగ్రస్తమై చనిపోయినతరువాత కనుపడు శల్యపరిణామములను నేర్చుకొనుటయు ప్రథమమున నేర్పడెను.

## గాలెన్ వైద్యభాగము
## గ్రీకురోమనుల వైద్యమూలము

గాలెన్ యొక్క రచనలే యిప్పటి గ్రీకువైద్యములో నగభాగము నాక్రమించినవి. ఈశాస్త్రమున చికిత్స (Medicine), శల్యతంత్రము, పదార్థతత్వవిచారశాస్త్రము, నిదానము, (రోగ) వైద్యసిద్ధాంతము, ఓషధుల గుణకర్మల తంత్రము, శస్త్ర చికిత్స, రోగి యొక్క శయ్యదగ్గర వైద్యుడు తనశిష్యులకు ఆరోగ్యమును గురించి చేయు ప్రసంగసంబంధ వైద్యము మున్నగునవి కలవు.

## ప్రాచీన వైద్యశాస్త్రముయొక్క అంత్యకాలము

ఇది మహమ్మదుపుట్టుకతోను, హరుల్-అల్-రషీదుయొక్క ఘనమైన పరిపాలనతోను అలంకరింప

బడినది. ఈ కాలముననే అరేబియా వైద్యము ఉన్నతస్థితికి వచ్చెను. ఆరాజాజ్ఞ చేత ఆకాలమున హిందూ, ఈజిప్టు, గ్రీకు దేశములలో ప్రచారమునమున్న వైద్య విషయములు అరబ్బీభాషలోనికి తర్జుమా చేయబడెను. ఈ యుగమున నవరచనాకర్తలలో అవిసెన్నా, ఆల్బుకాసిక్ అనువారు ముఖ్యులు.

### నవీనవైద్యము

నవీనవైద్యము వాసలియస్ (Vasalius), పారాసెల్కస్ (Paracelcus), మాల్పిఘీ (Malpigbi), హార్వే (Harvey)లు ఏర్పరచిన సిద్ధాంతములనుండియు, జెన్నర్, లీవర్ హాక్, బిచాట్ (Bichat) బ్రైట్ మున్నగువారును మరికొందఱును చేసిన కొన్ని సిద్ధాంతములనుండియు జననమును బడసినది.

---

# ఆశ్వాసాంతం

శ్రీ రుక్మిణీనాథశాస్త్రి

లలాటాన కుంకుమాగ్ని
బుజమ్మీద మబ్బుదుబ్బు
కాళ్లకింద కిర్రుచెప్పు
అంగోస్త్రం పొడుంకాయ
వ్యవధిలేని అవధానం
వెళ్లిపోయిం దెళ్లిపోయింది!

చెళ్లపిళ్ల పద్యావళి,
చిలకమర్తి గయుడి కథా,
వడ్డాదీ, పానుగంటీ,
బావిలీలు బ్రహ్మసమాజ్
తాటికాయ సీటికాడ,
ఫుల్లుమూను టాటాటా,
'ప్రచారిణీ' చింతామణీ
వెళ్లిపోయా వ్వెళ్లిపోయాయి!

గిరజాలూ లాల్చీలూ
వల్లెవాటు కళ్లజోళ్లు
టాగోరూ పొడుగురవిక
రిస్టువాచి రోషనార
బైరన్ బ్రౌనింగ్ వోల్టేర్
ఇబ్సెన్ షా షెలీ కీట్సు
ఎంకిపాట హాసీదూర్యాలు
కాంతంకథ జలవైద్యం
టాల్మాడ్జీ గృహలక్ష్మి
లారెన్సూ లాంగ్‌ఫెలో
సాయ్‌బ'బా ఫెవర్ లుబా
వెళ్లిపోయా వ్వెళ్లిపోయాయి!

రాచప్పా రాజెట్టీ
స్విన్‌బర్నా రెన్ బెసెట్
స్టార్ గోహర్ డాడ్జిబస్సు
విఠల్ క్రాపు సఖీపత్రిక
చీరాలా పేరాలా
హోంరూలూ మాగ్డోనాల్డు
ముద్దుకృష్ణ జ్వాలగోల
ఐపోయిం దైపోయింది!
మాకళ్లముందు కాళ్లముందు
వెళ్లిపోయా య్యెళ్లిపోయాయి!

కపిలవాయి గంధర్వా
స్థానంనటి చలంవ్యథా
రాయప్రోలు దేశభక్తి
విశ్వనాథ విసురుళ్లూ
డాడాయిజం ఇమేజిజం
వెళ్లిపోయా య్యెళ్లిపోయాయి!

వైజాగులో కొత్త గద్ద
ఎముకముక్క చేదుపాట
జరుగ్గొడ్డు సొడ్డులడ్లు
ఘునాజటా జనార్దనం
శరత్ బాబు రష్యన్ కథ
ఐపోయిం దైపోయింది!

లేతవాళ్ల దారులకే
కృష్ణశాస్త్రి దిగివచ్చిన
ఆకలి కాకలి కేకలు
చాంబర్లేన్ మంత్రిపెళ్లి
ఐపోయిం దైపోయింది!
ప్రజలెరుగని మనసెరుగని
సంచారం రూపించే
పరిమళాలు పలికించే
రాజ్యాగ్నుల రగిలించే
యూ బోటూ, టార్పెడో
బాంబుదెబ్బ టార్నాడో
డాలీబొమ్మా మాక్స్ రేబొమ్మా
వొచ్చేశా యొచ్చేశాయి!

ఎడిత్ సిట్వెల్, ఎజ్రాపౌండ్,
జేమ్సుజాయిస్, జీన్ కాక్టో
పఠాభికవి ఫిడేల్ డజన్
పిఠాపురం యువరాజా
శ్రీ నారాయణ బాబూ
అశాంతిలో ఇంద్రకాంతి
పూరీలో పురిపండా
బెంగుళూరు హరీన్ చటో
పరిమళాల సిసీమాలు
మూడుకాళ్ల మొగలిపూలు
పిల్లికళ్లపాము చెవులు
సంగీతపు గడియారం
కెమెరాల పంపుషూలు
అతివిస్మృత అతిరాజిత
అతిపూజిత అతికామిత
అతివాస్తవికాకారం
ఆహారం ఆచారం
వొచ్చేశా యొచ్చేశాయి.

పిచ్చేస్తే అచ్చేస్తాము!
మాకళ్లముందు ఇవిపోయి
ఇవియేలే రాజ్యాన్ని
పగలగొట్టి, పాలించే
కొత్తకాంతి కొత్తబతుకు
వినబడుతూ కనబడుతోంది
కనబడుతూ వినబడుతోంది!



# బాలానందం





## చిట్టి గడుసుతనం

చిట్టి మా అక్కకూతురు. దానికి ఆరోయేడు మొన్ననే వచ్చింది. అయినా, దాని కెంత తెలివి! నే నేమిచెప్పినా అది యెంతో శ్రద్ధగా వింటుంది. నే నే కథలు చెప్పమన్నా సరదాగా చెప్పతుంది. ఏ పాటలు పాడుమన్నా ముచ్చటగా పాడు తుంది. నా దగ్గర దాని కెంతో చనువు. మొన్న దీపావళిపండుగనాటికి మా అక్క వస్తే, చిట్టికూడా మాయింటికి వచ్చింది. అపు డది యెంత అల్లరి చేసిందీ! దీపావళి పండుగలు అయిపోయిన తరవాత వాళ్ల వూరు నేనే స్వయంగా వాళ్లని తీసుకుని వెళ్లి అప్పగించివచ్చాను. మధ్య త్రోవలో రైలులో చిట్టి ఒక్కక్షణమైనా నన్ను వదలి ఉండ లేదు. దారిపొడుగునా, "మాంవయ్యా! అదేమిటి, యిదేమిటి" అని నన్ను అడుగుతూ వుండటమూ, నేను విసుక్కోకుండా చెప్పడమున్నూ జరిగింది.

రైలుబండి కిటికీదగ్గరగా నేను కూర్చున్నాను. మా అక్కయ్య, "చిట్టీ, అలా తొంగిచూడకే! భడవా, పడతావు!" అని కేకలు వేస్తోంది. అయినా చిట్టి లెక్కపెట్టకుండా నా ఒడిలో కూర్చుంది. అవీ యివీ చూచి అడుగుతూ వుంది.

"చిట్టీ! చిట్టీ! తమాషా చూపించనా" అన్నాను నేను.

"ఆఁ ఆఁ, ఏంచక్క? ఏది?" అని చిట్టి చేరింది.

"చిట్టీ, అలా చూడు: కొండమీద ఏమి కనిపిస్తున్నాయి?"

"మబ్బులు, మేఘాలు"

"అయితే పొద్దు ఎక్కడ ఉంది?"

"కనిపించటం లేందేఁ?"

"చూడు, నేను తెప్పిస్తాను"

"ఏదీ తెప్పించు"

"వుఫ్—మహాంకాళీ, ఒకటి రెండు మూడు, వన్, టూ, త్రీ..." వెంటనే మబ్బుల్లోంచి పొద్దు బయిటికి వచ్చింది.

"అదుగో! పొద్దు" అని చిట్టి చూచి ఎంతో ఆశ్చర్యపడినట్టు కళ్లుపెట్టింది. మళ్లీ నేను—

"ఇదిగో, యీ రైలుబండీలో ఎండ వుందా?"

"లేదు, మాంవయ్యా"

"చిట్టీ, ఎండ తెప్పించనా?"

"తెప్పించమ్మా?"

"వుఫ్ మహాంకాళీ,..." అంటే ఎండ రైలులోకి వచ్చింది.

"అమ్మా, మాంవయ్య నయమేనే! ఎండ తెప్పించాడు" అని చిట్టి వాళ్లమ్మ దగ్గరికి పరుగెత్తింది. అంతా నవ్వుకున్నాము.

వాళ్లింటికిచేరిన రెండురోజుల తర్వాత: పొద్దున్న కొంచెం చలిగా ఉంటే వాళ్లతోటలో ఎండ వచ్చేచోట పడకకుర్చీలో పడుకుండి ఏదో చదువుకొంటున్నాను. ఆ చదువుతో కొంచెం మత్తుగా వుండి కన్నుమూశాను. ఇంతట్లో, వంటినిండా వర్షంపడినట్టయింది. ఉలిక్కిపడి లేచి చూచాను. కిలకిలా నవ్వుతూ, చిట్టి చేతిలో మొక్కలకి నీళ్లువేసే ఆ 'స్ప్రే' డబ్బా పట్టుకుని తయారయింది.

"దొంగముండా!" అన్నాను.

"మాంవయ్యా, నువ్వు ఎండ తెప్పించావు కాని నేను వాన కురిపించాను చూచుకో" అని గెంతుతూ పారిపోయింది.

చూడండి దాని గడుసుతనం!

— శ్రీ వాత్సవ

---

## విజ్ఞానతరంగిణి:

### పుష్పములకు పరిమళముతో ప్రయోజన మేమి?

మొక్కలు స్వోపయోగార్థము తమలో తాము తయారుచేసుకొను ఒకవిధమైన సుగంధతైలములవలన పుష్పములకు పరిమళము కలుగుచున్నది. మొక్కలు ఈ తైలములను సృష్టించుకొనుట ఆత్మజీవనోపయోగార్థమే కాని నిజముగా మనకోసము గాదు. ఈ పరిమళము సాధారణముగా మొక్కలందు ఒక్క పూవులలోనేయుండును. వేరులలోగాని, కాండములందుగాని, ఆకులందుగాని ఉండదు. ఈ ప్రత్యేకలక్షణము ఒక్క పూవులకే యున్నది. పువ్వులెందుకు పుట్టుచున్నవో గ్రహించినయెడల ఈ ప్రత్యేకధర్మము పువ్వులలోనే ఎందు కుండవలెనో తెలియగలదు. పువ్వులలోనుండి గింజలు పుట్టి, పరిపక్వమై, నేలమీద బడి మరల నవి మొక్కలగును గనుకనే మొక్కలు పుష్పించుచున్నవి. సాధారణముగా తుమ్మెదలు మొదలైన ఒకజాతి పురుగులు పువ్వులపై వ్రాలుటవలననే, భూమిలోపడి మరల మొక్కలుగా మొలవగల బీజములు తయారగుచున్నవి. సజాతీయమైన ఇంకొక మొక్క యొక్క పూవుపై మొదట వ్రాలి, అక్కడనుండి బీజోత్పత్తి గావింపగల ఒకానొక పదార్థమును సంగ్రహించి తెచ్చి తుమ్మెదలు ఒక మొక్కపూవులో బడవేయుచుండును. కనుక ఈపనికై తుమ్మెదలు మొదలైన పురుగులు పువ్వులవద్దకు ఆకర్షింపబడవలెనుకదా! అందుకోసము మొక్కలు తమ పుష్పములను ఆపురుగులకు సులభముగా కనబడునట్లును, వాని కన్నులకు అతిసుందరముగా నుండునట్లును చేసుకొనును. ఇది మొక్కలుచేయు మొదటిపని. ఇంతే కాదు, పురుగుల ఘ్రాణేంద్రియము మిక్కిలి సూక్ష్మముగా నుండును. అనగా దూరమునన్న పరిమళమును సైతము అవి సునాయాసముగా పసిపట్టగల వన్నమాట. అందుచేత మొక్కలు తమపూవులలో తరచుగా పరిమళద్రవ్యములను కల్పించుకొని,తద్ద్వారా పురుగులను తమ దగ్గరకు ఆకర్షించుకొనును. ఇది మొక్కలుచేయు రెండవపని. వ్యాధికారకములైన కొన్ని సూక్ష్మజీవులు— చీడపురుగు మున్నగునవి— చుట్టును ఉండి అమూల్యములైన ఈ పుష్పములకు తరచుగా హాని కలుగజేయుచుండును. పుష్పములలో పుట్టు సుగంధతైలములు అటువంటి సూక్ష్మజీవులను చంపి, పూవులను వానిబారి నుండి రక్షించును. అందుకై మొక్కలు పరిమళద్రవ్యములను సృష్టించుకొనును. ఇది మొక్కలుచేయు మూడవ పని. అయితే, అన్నిపువ్వులును మంచివాసన కొట్టవే అదెందుచేత అని సంశయము కలుగవచ్చును. బీజోత్పత్తికి అన్నిపట్లను ఒక్క పురుగులే కారకములు కావు. ఒకపూవునుండి ఇంకొక పూవునకు పుష్పపరాగమును తీసుకొనిపోవు ఆపనిని పెక్కుపట్ల గాలియే చేయుచుండును. ఈజాతి మొక్కల పూవులు సాధారణముగా చిన్నవిగాను, నిరాడంబరముగాను ఉండును. వానికి పరిమళమే ఉండదు. ఉన్నను మిక్కిలి స్వల్పముగా నుండును. ఎందుచేతనో తెలియునా? పురుగులను ఆకర్షించుకొనవలసిన ఆవశ్యకత వానికి ఏమాత్రమును లేదు గనుకనే. పురుగులతో అక్కరలేని మొక్కలపూవులే సామాన్యముగా పరిమళములేని పూవు

లై యుండును. ఇతరజాతి పువ్వులలోఁగూడ మిక్కిలి చిన్నవిగాను, కంటికి కనబడకుండ నిగూఢముగాను ఉండునవి కొన్ని ఉన్నవి. కాని అవి అతిమనోహరమైన తమ గాఢపరిమళముచేత తుమ్మెదలు మొదలైన పురుగుల నాకర్షించి తమ అల్పపరిమాణలోపమును కప్పిపుచ్చుకొనుచున్నవి.

## తానే తన కాహారమై నిత్యజీవనము చేయు నిప్పు

ఈ యద్భుతపదార్థముయొక్క పేరు రేడియము. కొన్ని సంవత్సరముల క్రిందటివరకును దీనినిగూర్చి ఎవరికిని ఏమియు తెలియదు. బంగారు, వెండి మొదలైన లోహపదార్థములవలెనే ఇదికూడ భూమిలోపలనే దొరకును. కొంచెమో గొప్పో ఈ పదార్థము భూమిలోపల అంతటను ఉన్నది. భూగోళము చల్లబడకుండ వెచ్చగానుంచు వస్తువులలో ఈ రేడియము ఒకటి. గాలినుండి మొక్కలు తమకు కావలసిన ఆహారమును కల్పించుకొనునట్లే ఈ రేడియము తనలోనుండి తాను వేడిని సృష్టి చేసుకొనును. ఆమర్మము ఎవరికిని తెలియదు. ఇంతవరకును ప్రపంచము మొత్తముమీద మనుష్యులు కనిపెట్టిన రేడియము అంతయు ఒక చిన్న మాత్రలబణి నిండుటకైనను చాలదు. మానవుల దృష్టిగోచరమైన ఆ రేడియమునంతటిని ఒక చిన్న నాణెము మీద చేర్చిపెట్టవచ్చును. కాని ఇది కొంచెముకొంచెముగానైనను భూమిలోపల అంతటను నిండియుండుట వలననే భూమి వెచ్చగా నుండుట తటస్థించుచున్నది. ఈ రేడియమును సర్వవ్యాపకమైన అగ్నికణముగా మనము తలపవచ్చును. ఇది ఎప్పటికిని ఆరిపోని నిప్పు. భూమండలమును యుగములకొలది ఉష్ణముగా నుంచ జాలిన నిప్పు. ఈ రేడియము చేయు అద్భుతకృత్యముల నన్నిటిని చెప్పబూనుకొన్నచో వానికి అంతేయుండదు. ఇది తనలోపలనుండి వేడిమిని సదా సర్వకాలములందును సృష్టి చేసుకొనుచుండును. సీసము, వెండి మొదలైనవి అట్లు చేయలేవు. అవి వెచ్చబడుటకు వాటికి బాహ్య పదార్థములతో సంయోగము కావలెను. ఇనుపగరిటె కాడ నిప్పులో పెట్టినచేకాని వేడి కాదు. పైనుండి వెచ్చదన మేమియు రాకుండ దానిని ఒంటరిగా పెట్టినను ఈ రేడియము వేడిమిని స్వయముగానే సృష్టి చేసుకొనును. ఎక్కడనున్నను సరే రేడియము తన చుట్టును ఉండు ద్రవ్యములకంటె కొంచెము వేడిగా నుండక మానదు. నిప్పుతప్ప ప్రపంచములో ఇట్టి వస్తువు మరొకటి లేదు. ఇతరవస్తువుల అపేక్ష లేకుండ, ఏకో కొంత ప్రయత్నమైనను లేకుండ ఆనిప్పుయినను పుట్ట జాలదు. కాని రేడియమును వెచ్చచేయుటకు దానిని కాల్పవలసిన పనిలేదు. ఉండుటకేమో ఇది స్వల్పముగా నుండినను ఇది కల్పించు ఉష్ణతమాత్రము ఉద్దండమైనది. ఆ ఉష్ణతయొక్క పరిమాణమునుకొలిచి చెప్పుట దుస్సాధ్యము. అనుదినమును ఈ భూమండలము అంతరిక్షములోనికి గోల్పోవుచున్న వేడిమిని ఈ అల్పమాత్రపు రేడియమే పూడదీయుచున్నదన్నచో ఈ రేడియము సృష్టించు ఉష్ణత యెట్టిదో సులభముగా ఊహించు కొనవచ్చును.

—కూ. న.





# ఆంధ్రాభ్యుదయము

డి. రామకృష్ణయ్యగారు, యం. ఏ.



మైసూరుమహారాజావారి కళాశాలలో ప్రొఫెసరుగా నున్న డా. యం. వి. గోపాలస్వామిగారివద్ద నాలుగేండ్లపాటు మనస్తత్త్వశాస్త్రపరిశోధనలు గావించి, తత్ఫలితముగా వీరు తయారుచేసి పంపిన 'హేతువాదములో తప్పులవిచారణ' అను వ్యాసమును ఉత్తమమైనదానినిగా పరిగణించి ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు ఈ ఆంధ్రపుత్రునికి మొన్నటి పట్టప్రదానసభలో డాక్టరు (పి. హెచ్ డి) పట్టము నిచ్చి సత్కరించిరి.

---

టి. వి. రత్నావళిగారు



దక్షిణ భారత హిందీప్రచారసభవారు ఈ డిసెంబరునెల మధ్యలో జరిపిన పట్టప్రదానసభలో ఈ ఆంధ్రయువతి 'విశారద'పట్టమును బడసెను. ఆంధ్రస్త్రీలలో ప్రప్రథమముగా 'విశారద'పట్టమును బడసిన భాగ్యము ఈమె దక్కించుకొన్నది.

---

# తిమ్మరుసు - కృష్ణదేవరాయలు

శ్రీ దోమా వేంకటస్వామిగుప్త

అలసాన్యన్వయ పెద్దనార్య ముకుతిమ్మన్నార్య సూరన్నము
ఖ్యుల సూరీంద్రులఁ గృష్ణరాయఁడు కరం బొప్పన్ దెలుంగమ్మ సొ
మ్ముల కైసేఁతను జెందె, రాజ్యము నొగిం బ్రోఁచెన్ మహామంత్రి ని
స్తులుఁడౌ తిమ్మరుసుండు గానియెడఁ గృష్ణుం డింతవాఁ డౌనొకో?

క్రొంబూఁదేనెల సోనలం దవరు తళ్కుందీఁపులం గూర్చి భ్రాం
గంబుల్ లెక్కడఁ గద్ది తెచ్చియిడు వన్యాకాంత నగ్గించు చం
దంబే కాదొకొ, రాజ్యభార మొకయింతం దోఁపఁగానీక చం
డంబౌ శక్తిని దాఁ గనం గవులఁ గృష్ణక్ష్మావరుం డేలెఁ, దె
ల్గుంబున్నెంబిటుఁ బండెఁ గృష్ణనృపు నే కొండాడ నిం దొప్పునే?

చిన్నటనాఁడు సంపుటకుఁ, బెత్తన మించుక గన్నయప్పుడుం
గన్నుఁ దియఁ జేయుటకుఁగాని జనంబులు పన్నినట్టి బల్
పన్నుగడల్ మతిం దెలిసి ప్రాణము గాఁచియు నెల్ల వేళలన్
మిన్నగు శ్రద్ధఁ గృష్ణనృపునిన్ మనిచెన్ గద తిమ్మమంత్రియున్.

మాధుర్యంబుల తేఁట మాట, మనమా మంత్రాలకున్ మూట, సు
శ్రీధుర్యంబగు ఠీవి, పోక మెటనేన్ క్షిత్యద్భుతప్రక్రియా
ప్రాధాన్యంబగు రాజనీతికిని దార్క్యాణంబుగా నొప్పె రా
జ్యాధారంబుగఁ దిమ్మమంత్రి మన కృష్ణాధీశు ప్రాణంబుగన్.

"అప్పాజీ!"యని గొప్ప భక్తిమెయిఁ దిమ్మామాత్యునిం బిల్చు కృ
ష్ణప్పా! యాతని వార్ధకంబునఁ దదీయాక్షిద్వయిం దుల్చ నె
ట్లొప్పె న్నీ మతి? చేయుఁ గాత నిలు నేదో? నీ కతం దిడ్డ బల్
మెప్పో మేలునకున్ క్షమించుటకు నెమ్మిన్ బూన లేవైతివే?

"రాజన్యుం డెలమానిపండువలెఁ బైరంగు ల్విసాళింపుచున్
లోఁ జూడం గడు వక్రిమం దనరు"నన్ లోకోక్తి నీయందు నే

నే జూడన్ వృథ గాక పోయెఁగద? పూర్ణేందుస్వరూపంబుతో
నోజోవ్యోమమునందు నీ వెనఁగఁగా నో రాజ! నీయాకళం
కాశైవాత్మకగర్భమందుఁ గనఁగా నొఁగాదె వీఁకం గదన్.

"రాజున్ మంత్రియు రాజ్యపున్ శకటముల్ రక్షింపఁ జక్రంబు లై
గాజిల్లం దగు, వార లెవ్విధమునన్ వర్తించినం గల్గు చి
క్కైజాడం బరిమార్చు వారిదగు రాజ్యోద్ధత్వ"మన్ మర్మమున్
లోఁ జర్చించి యి దల్ల తిమ్మరుసు చెన్నొప్పం గ్రియాసిద్ధి నా
నేఁ జక్రీచ్ఛ తదంత్యకాలమున వక్రించెన్ బలీయంబుగన్.

బానేఁడు తేనెయందు రసపాలు విసంబును జేర్చినంత స
త్తేనియ ప్రాణహాని నిడు తేఁకువ జీవిత మెల్ల సూరిస
న్మానముతోఁ జెలంగిన వదాన్యశిఖామణి నేఁడొ చేరి కృ
ష్ణానుప మావనీంద్రుఁ దుది నందఁగఁజేసెను నింద నిమ్మెయిన్.

"తెలుఁగుంగైత దెలుంగునేలలను నెంతే దివ్యమారందధా
రలు వోలెన్ బ్రవహింపఁ గారణము సత్ప్రాజ్ఞుండు సూరీంద్రవ
త్సలుఁ డా కృష్ణనరేంద్రుఁ" డన్న నుడి కంతర్యామి హేతుత్వని
స్తులతం దిమ్మరుసయ్య రాజ్యభరణాస్తోకప్రభల్ వెల్గెడిన్.

లోకుల్ కాకుల్ గదప్పా! శ్రుతిచయభణితశ్లోకసుశ్లోకుఁ గృష్ణున్
లోకశ్లాఘానమర్హున్ గ్రుథమెయి సుధ నేలో రవం తుప్ప నిడ్డ
ట్లీకాకా మచ్చనిడ్డ ల్లెదఁ దలఁచెడివా రిందు నందున్న వారల్
ధీకిం బ్రాఁ కొను నీతిస్థిరుఁడు నలుపునే ధీరుఁ డాతండు చెట్టన్?

వాఁకిటి కావలివానికిఁ - జూఁకలి వానికిని మేలు సల్పిన భూపుం
డా కీ డప్పాజీ కిడు-నే కొంకక? తగునె వార్త యిది నమ్మంగన్?

"అప్పాజీ"యగుఁ దిమ్మరు-"నప్పాజి"కిఁ దగినపట్టియగుఁ గృష్ణవిభుం
డెప్పాప మెఱుఁగునో కో- ?-గొప్పాళ్వారు కతఁ దీర్చు కోవిదుఁడు గదా!

---

# కలగూరగంప

## డా. కట్టమంచి రామలింగారెడ్డిగారి షష్టిపూర్తి మహోత్సవము

ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఉపాధ్యక్షులైన శ్రీ డా. కట్టమంచి రామలింగా రెడ్డి గారికి మొన్న డిసెంబరు 9-వ తేదీతో అరవై యేండ్లు పూర్తి యైనవి. 10-వ తేదీనాడు వారి షష్టిపూర్తి మహోత్సవము జయప్రదముగా జరుపబడెను.



గవర్నరుగారు బహిరంగపరచిన రెడ్డిగారి లోహప్రతిమకు ఛాయ

రామలింగారెడ్డిగారు విద్యావ్యాపనము కొరకును, ముఖ్యముగా ఆంధ్రవిశ్వకళాపరిషత్తు కొరకును చేసిన అఖండసేవకు ఉచితముగా వారిని గౌరవించుటకై పెద్దలచే ఆమధ్య ఏర్పరుపబడిన కమిటీ ఆంధ్రవిశ్వకళాపరిషత్తుఆవరణలో రెడ్డిగారి విగ్రహమును ప్రతిష్ఠించుటకును, వారిపట్ల గౌరవచిహ్నముగా రెండు గ్రంథములను ఒకటి ఇంగ్లీషులోను, మఱియొకటి తెలుగులోను ప్రచురించుటకును, సదరువిశ్వకళాపరిషత్తులోని విద్యాబోధనకు సహాయకారిగా ఒక గొప్ప ప్రయోజనమును నెలకొల్పుటకును ఏర్పాట్లు చేసినారు. ఈ యేర్పాట్లు త్వరలోనే కార్యరూపమును దాల్చనున్నవి. రెడ్డిగారి షష్టిపూర్తి జ్ఞాపకార్థముగా ప్రచురింపబడనున్న గ్రంథములు ఈనెలలో ముద్రణకెక్కనున్నవి. రెడ్డిగారి సహచరులగు పండిత ప్రముఖులు రచించిన ఉత్తమ రచనలు ఆగ్రంథములందు చేర్పబడనున్నవి. రెడ్డిగారి రూపచిత్రములను మూడింటిని శ్రీ కౌతా రామమోహన శాస్త్రిగారు రచించినారు. ఆ పెన్సిలు డ్రాయింగులుగూడ సదరు సంపుటములలో చేర్పబడును.

ఇది కాక రెడ్డిగారి ఆకారము సరిగామూర్తీభవించినట్లుగా ఒకలోహప్రతిమకూడ తయారుచేయబడినది. దేవీప్రసాదరాయి చౌదరిగారు ఆ ప్రతిమను తయారుచేసిరి. దానిని పై మహోత్సవమునాడు విశ్వకళాపరిషత్తు ఆవరణలో గవర్నరుగారు బహిరంగపరచిరి.

శ్రీ రెడ్డిగారి ప్రతిభను గురించి శ్రీ ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు రచించిన లేఖను ఈ దిగువ ఉల్లేఖించుచున్నాము:

జగద్వికాసమునకు కార్యకారణ సంబంధము అన్వేషించుట తగినదయితే, మానవజీవితమునకుకూడ ఆసూత్రము నన్వయించుట అసమంజసము కాజాలదు. రెడ్డిగారు ఆంధ్రదేశములో పుట్టిపెరిగి దిగంతాకర్షకమైన సుగంధపుష్పము. వీరి వంశమువారు ఆంధ్రులు. అందును రెడ్లు. నైసర్గికముగా ఈ దేశానికి చెల్లెలికట్ట కట్టుకొని సముద్రుడున్నాడు. నిర్మల జీవనప్రసాదమును పంచిపెట్టుచు నదీమతల్లు లున్నారు. మహౌషధీగర్భములగు పర్వతములు కలవు. నానా దారుసంతానములగు కాంతారములు, సకలసస్యసంపన్నములగు భూములు, నాతిశీతోష్ణప్రసన్నములగు ఋతువృత్తములు ఈదేశమునందు ప్రకృతిసిద్ధములుగా లోకయాత్ర ననుకూలించుచున్నవి. సుఖోపచార సమృద్ధమయిన ఈ ఆవరణమహత్త్వ మీ జనసంపర్కమునందు నిష్ఫలమగునా?

ఆంధ్రులు ఉపనిషత్కాలమునుండియు అవిచ్ఛిన్నముగా వర్ధిల్లిన జాతి. వారు సామ్రాజ్యములు నిర్వహించిరి. వాఙ్మయసాధకులై ప్లాటానిక ప్రతిపాదకమగు కావ్యరచనమును సంఫుల్లశోభాయమానముగా గావించిరి. ఆనందలక్ష్యములగు శిల్పకళాదులకు పెంపుసొంపులు సమకూర్చిరి. సౌందర్యపక్షముగా సంస్కృతసాహిత్యమును వ్యాఖ్యానించిరి. సంగీతప్రియులై కర్ణాటక సంప్రదాయమును పారము నందించిరి. విజ్ఞానపారంగతులై గీర్వాణభాషా నిష్ణాతులైనను స్వస్థానవేషభాషలను ప్రేమించి, అన్యముల నపాకరించిరి. రసప్రలబ్ధబుద్ధుల కిదియే ఉపాస్యమనికూడ చాటిరి. ఈవిషయావలోకనములవలన ఆంధ్రుల స్వరూపస్వభావములు కొన్ని పొడకట్టకపోవు.

జాతీయములయిన చైతన్యరేఖలు సామాజిక ప్రవృత్తియందును, సాహిత్యాది శిల్పములయందును కళగట్టి ప్రతిఫలించును. ఆంధ్రదేశమునందు సామాజిక జీవితమును తీర్చి దిద్దినవారిలో రెడ్డివారి శాఖ ప్రముఖమైనది. మొట్టమొదట హాలసవనము నాచరించిరి. పాడిపంటల రుచిసౌఖ్యముల ననుభవించిరి. దేశవిప్లవసమయములలో కాడి వదలి కత్తి బట్టిరి. నాయకులై చతురంగబలములు నడిపిరి. రాజ్యము లేలిరి. సంధివిగ్రహములలో నీతిచాతుర్యములు చూపిరి. సుగంధద్రవ్యములకు భాండారములు కట్టిరి. సౌందర్యప్రపన్నములగు ఉద్యానవనములు పోషించిరి. రాజభోగముల ముచ్చట తీరెను; కాని జీవితమునకు చారితార్థ్య మేది అను మీమాంసమాత్రము తీరినదికాదు. ఈ మీమాంసయందే సంస్కృత సారస్వతమథనము జరిగియుండును. అపుడే తురీయపురుషార్థమును వివరించు గ్రంథజాలమేగాక, త్రివర్గనిదానప్రధానములగు కామసూత్రాదులును బయటపడియుండును. ఈ సందర్భమునందు ఒక్కవిషయము మన మూహింపవచ్చును. ఇరుతెగల గ్రంథనిర్మాణమునకును ఋషులే కారకులు. కొందఱు బ్రహ్మర్షులు, కొందఱు మహర్షులు. కావున వారిదర్శనములలో పాతిత్యసాధనములు బుద్ధిపూర్వముగా ప్రతిపాదింపబడిన వనుట పొసగదు.

మానవజీవితమునందు నాగరకవ్రతమును ప్రతిపాదించిన మహర్షి వాత్స్యాయనుడు. ఆవ్రతమునకు లక్ష్యలక్షణము లందు గలవు. వానిని అవికలముగా నవలోకించినయెడల ఒక్కటేరహస్యము స్ఫురించును. ఏవిధముగా సాధించినను జీవితమునకు 'ఆనందమే' పరమావధి యనుటయే ఆరహస్యము. ఏతత్సిద్ధికొఱకు వ్యక్తు లవలంబించు సాధనలు రెండువిధములుగా నున్నవి: నివృత్తిపరములు కొన్ని; ప్రవృత్తిపరములు కొన్ని. ఈ విభాగమువలన పూర్వపక్షము పవిత్రమనియు, ఉత్తరపక్షము అపవిత్రమనియు భావమురాదు. రెడ్డిరాజులీ ఉత్తరపక్షము ననుష్ఠానమునకు తెచ్చి, మతవైవిధ్యదగ్ధమయిన జీవితక్షేత్రమును అభిమతవైదగ్ధ్యదుగ్ధముతో తడిపి మధుర మొనర్చిరి. బ్రహ్మసూత్రములకు భాష్యములు వ్రాసినట్టే అమరుకాది శృంగారసంహితలకు వ్యాఖ్యలు రచించిరి. నాగరకప్రవృత్తిని నిత్యానుష్ఠానమునకు తెచ్చిరి. ఆనందవ్రతమునకు సాంగకలాపము సంఘటించిరి. చరితార్థులయిరి. ఏల కారు? మహాకవి రవీంద్రుడుకూడ

"ఈచిన్నిమురళితో ఎల్లపొద్దులు నిచట
వన్నెవన్నెల గీతి వాయింపగల్గికే
వలదు మోక్షము నాకు వలదు ముక్తియు నాకు"
అని పాడిన పాట కిదే భావమేమొ?

"ఆనందమార్గమునుబట్టిన జీవధారులకు జన్మాంతరజాతమువలన భయమేమి?" అని మాధుర్యోపాసన సలిపిన బౌద్ధాచార్యులకుగూడ నిదియే పరమ లక్ష్యమేమొ?

రెడ్డికులమునకు ఉపసంక్రమించిన వాసన లిట్టి వని చరిత్ర చెప్పుచున్నది. ఉపవనములలోని పూలమల్లెకును, ఉమ్మెత్తలవంటి రిక్తకుసుమములకును సజాతీయసంపత్తి లేదు. అందు సగంధకుసుమములే సోపపత్తికములుగా శోభిల్లును.

రామలింగారెడ్డిగారిని కన్న మాతాపితరులు ధన్యులైనట్లే ఆతల్లిదండ్రుల కవతరించిన పుత్రుడును కృతార్థుడనవచ్చును. పాడిపంటల చవి యెఱిగినది తల్లి; పాటపద్యముల రుచులు తెలిసినవాడు తండ్రి. ఇక వారు రెడ్డిబిడ్డకు పోసిన ఉగ్గుబాలలో భోగమాధుర్యమేల యుండదు? నేర్పిన నుడికారములో తీరు తీయము లేల నెలకొనవు? ఈ పూర్వరంగమును గుర్తింపనిది రెడ్డిగారి జీవితరూపకమును రక్తి కట్టించిన ప్రధానసూత్రము గోచరింపదు. ఏల యన, మానవజీవితమునకు ప్రతిభా వ్యుత్పత్తులు రెండును రెండుచక్రములు. ప్రతిభ చాలవఱకు వాసనావాప్తము; వ్యుత్పత్తి విశేషముగా ప్రయత్నోపలబ్ధము. ఈ రెంటి పరిణామ వికాసములను రెడ్డిగారి జీవితమందు అద్దమందు వలె జూడనగును. పశ్చిమఖండమునందు నవనాగరకులలో అభినవ నాగరకుడై మెలగినను ఆయన నాల్కనుండి తెనుగు నుడికారము జారినది కాదు. షేక్స్పియరు సాహిత్యము సత్కాంతముగా అధ్యయనము చేసినను సూరనార్యుని కవితా సుధాస్వాదనముపై వెగటు పుట్టినదికాదు. ఇంతేకాదు. సంస్కార వికసితమైన ప్రజ్ఞారోచిస్సుతో ఆంధ్రవాఙ్మయము నవలోకింపగలిగిరి. మఱుగుపడిన మధురకుంజములను చూచి చూపించిరి. వినబడని ధ్వనికలాపమును విని విన్పించిరి. పాడకట్టని సౌందర్యరేఖలను పోల్చి పోల్చుకొనజేసిరి. ఇందే వీరి ప్రతిభాలీన మయియున్న సృజనశక్తి ఉపలక్షింపదగును. ఇందే నవ్యసాహిత్యమునకు దృశ్యాదృశ్య చోదనమును గుర్తింపనగును.

ఆంధ్రవాఙ్మయము పూచి కాచి అతి ఫలభారమున వంగిన రసాలవనమువంటిది. కాని కాపు ఉడిగిన వృద్ధవృక్షములు, పూతపూయుట మానిన ముదురు తీగలుమాత్రమే సమస్తాలవాలమును ఆక్రమించుకొని నిలబడినవి. అంట్లు కట్టలేదు. క్రొత్తజాతులను నాటలేదు. పాదుకాల్వలనైనను చక్కపెట్టలేదు. ఇట్టి స్థితిలో స్థవిరమైపోయిన తోటలకు దోహదపరామర్శ లక్కఱలేదా? కావలెను. ఈ అవసరమును రెడ్డిగారు నిరూపించిరి. పండ్లలో మామిడిపండు మేల్తరమైనదే. కాని మామిడిపండ్లలోగూడ క్రొత్తరకములు కలవు. స్వాదిమయందును అపూర్వరుచు లున్నవి. అవియును ఉపాదేయములే. విశాలమైన వన మున్నప్పుడు, వివిధమైన పరికరసమృద్ధి యున్నప్పుడు, అనుకూలమైన బుభుక్షాహాకార మెచ్చినప్పుడు నవీనజాతిరసాలముల నేల నాటి పోషించి తత్ఫలసౌభాగ్యము ననుభవింపగూడదు? వివిధసాహిత్యఫలరసముల నాస్వాదించి, ఆయాభోగరుచుల నెఱిగిన రెడ్డిగారు ఈ నవ్యవ్యవసాయమునకు దారిదీయుట కర్హులనుట నిర్వివాదము.

రెడ్డిగారి పరామర్శకాండయు ఇంతె సుశిక్షమైనదే. ఏల యన, క్రొత్తపనికి క్రొత్త కొఱముట్లవసరము. పాదులను పెకలించుటయు అవశ్యమే. పొలము తిరుగదోలినప్పుడే పంట బాగుగా పెరుగును. అట్లే కాలువలు మార్చవలసినచో మార్చవలెను. క్రొత్తవి త్రవ్వవలసినచో త్రవ్వవలెను. ఈ పరామర్శయందు రెడ్డిగారి కలము కఱకుగా నడిచినది. కలుపుతీయునప్పుడు కనికర మెందుకు? అది అస్థానకృతము.

"వయసు వంకరతీర్చు"నని సామెత. అందుచే కాబోలు వంకరయెఱుగని వయసులోనున్న కవికుమారులు రెడ్డిగారి అభిమానాదరములకు పాత్రమైరి.

రెడ్డిగారు గొప్పవక్త. అయితే వీరి వాక్కు గంగావేగవతి కాదు. విహారగిరినితంబనిర్ఝరిణి. తరంగ

వతిరైనను ప్రసన్నతయ్యలు కలది. గతివిభ్రమము లున్నను గమనభంగిమలు వదలవు. హేతుధాతువుల మధ్య బడి నడిచినను సాజమైన జీవనమధురిమను కోలుపోదు. వెల్లివోయినను తొణకదు. వంకర తిరిగినను భంగము కాదు. చెలరేగినను చీలిపోదు. తన తేటముల యందున్న తరుణతరులతాదుల నేమరదు. తాను తాకి తడుపవలసిన రమ్యోపాంతములను మరువదు. కన్నె వలె జంకినను, గడుకుకత్తెవలె చెలిలాడినను నిసర్గ మయిన మనోహరత్వమును మానివేయలేదు. ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానదరులనడుమ ఇరుకుడుపడక, ఇంకి పోక, సంకరముగాక స్వచ్ఛందముగా, సుందరముగా, హృదయంగమముగా ప్రవహించు 'రెడ్డివాణి' ప్రౌఢ యనుట నిస్సంశయము.

ప్రతిభకు జాతకము లేదు. కావున రెడ్డిగారికి షష్టిపూర్తి యయినను వారి ప్రతిభ నిత్యపుష్టితో ఆంధ్ర భాషాంబరమున నిత్యాభినవరేఖలతో శోభిల్లుముగాత.

---

## ఘంటసాల గొప్పదనము

కృష్ణాజిల్లా దివితాలూకాలో ప్రస్తుత మొక పెద్దపల్లెటూరుగానున్న ఘంటసాలను గురించిన మహిమ ప్రాచీనేతిహాసము 'ఉదయ భారతి'— త్రైమాసికపత్రికలో ఈరీతిగా వెల్లడింపబడినది:

ఇది చాల పురాతనపట్టణము. ఇచ్చటనున్న కాలభైరవ,సరస్వతీవిగ్రహముల శిల్పము మొహెంజోదారో శిల్పమును బోలియున్నది. మొహెంజోదారో ఇప్పటికి ఆరువేల సంవత్సరములకు పూర్వపుది. దీనినిబట్టి ఈ గ్రామము క్రీ. పూ. 4000 నాటికే మిక్కిలి యుచ్ఛ దశలో నున్నట్లు తెలియగలదు

ఇది ప్రాచీనాంధ్రరేవుపట్టణములలో నొకటి. ఇచ్చటనుండి రోము, ఈజిప్టు మొదలగు దేశములకు వజ్రములు, నూలుబట్టలు ఎగుమతి యగుచుండెడివి. ఇచ్చటి బౌద్ధస్తూపములో ప్రాచీన రోమకనాణెములు దొరికినవి. అప్పుడు కృష్ణానది గూడూరువద్ద సముద్రములో కలిసెడిదని చరిత్రలలోనున్నది. అప్పుడు కృష్ణా ప్రవంతి బహుశః శ్రీకాకుళమువద్ద కొద్దిగా నుత్తర మునకు ప్రవహించి అచ్చటినుండి ఆగ్నేయముగా ప్రవహించి గూడూరువద్ద సముద్రములో గలిసియుండును. ఇది రేవుపట్టణమై యుండినందుననే ఇక్కడ జలధీశ్వరాలయమును గట్టియుందురు.

ఈఘంటసాలగ్రామమునకు కంటకశైలము, కటకశాల యను నామాంతరములు గలవు. స్థానికులీ పేరునుగురించి ఒక కథ చెప్పెదరు. పూర్వ మనపత్యుడైన ఒకరాజు ఈప్రాంతపు అడవులకు వేటకై రాగా ఆయన కిచ్చట ఒకబాలుడు దొరికెనట. ఆరాజు ఆ బాలుని వెంటబెట్టుకొని వెళ్లి పెంచి పెద్దచేసెనట. ఆ బాలుడు మహాబలపరాక్రమ సంపన్నుడై రాజానంతరము సింహాసన మధిష్ఠించి దిగ్విజయముచేసి చక్రవర్తి యాయెనట. ఆయన తా నెక్కడ దొరకుటవలన తన కట్టి మహాదశపట్టెనో ఆస్థలమునందు తనకృతజ్ఞతను దెలుపుట కొరకు అన్నసత్రమును గట్టించి, అందులో నొకగంటను కట్టించి, ఆగంట మ్రోగించినవా రందరికిని లేదనక భోజన మిడుదు నని సాటించెనట. తదాదిగా అచ్చట ఆగంట అహోరాత్రములును మ్రోగుచుండెడి దట. ఈపైకారణమువలన అచ్చట నిర్మింపబడిన ఈ గ్రామమునకు గంటసాల యనునామము వచ్చినదట. క్రమేణ ఆ గంటసాల ఘంటసాలగా మారినది.

ఇప్పు డిచ్చట గంజికాలువ, ఘోటకము,కాలభైరవసరస్వతీవిగ్రహములు, జలధీశ్వరాలయము, లంజదిబ్బలు అనునవి ఈ గ్రామముయొక్క పూర్వవైభవమును దర్శింపజేయుటకై మిగిలియున్నవి.

గంజికాలువ ఊరికి దక్షిణముగా నున్నది. నిరతాన్నదాతయగు ఆరాజు శాసనమునుండి పారిన గంజి కాల్వగనైనట.

ఘోటక మనునది ఊరికి ఉత్తరముగా నున్నది. దీని నీ యూరియం దుండిన వేశ్య రాజానుగ్రహమున సంపాదించి పశుగ్రాసమునకై వదలిపెట్టెనట.

జలధీశ్వరాలయము ఈయూరిలో నున్న పెద్ద దేవాలయము. కాని దీనికి పెద్దఆస్తిమాత్రము లేదు. కాలభైరవ సరస్వతీవిగ్రహములలో మొదటిది జలధీ

శ్వరాలయమునం దున్నది. సరస్వతీవిగ్రహము చెరువు గట్టునవున్న గంగానమ్మగుడిలో నున్నది. ఇవి నగ్న విగ్రహములు; రెండున్నర, లేక మూడు అడుగుల యెత్తుండును.

లంజదిబ్బలనుగురించి ఒకకథ గలదు. పూర్వము ఘంటసాలలోను, గుడివాడలోను, భట్టిప్రోలులోను ముగ్గురువేశ్య లుండెడివారు. వీరు ముగ్గురును అక్క చెల్లెండ్రు. వీరు ముగ్గురును మూడుగ్రామములలో ఎత్తయిన దిబ్బలను పోసుకొని వాటిపైన ఇండ్లు కట్టుకొని, రాత్రులందు ఒకరింటి దీపము నింకొకరు చూచుకొని క్షేమములు తెలుసుకొనుచుండెడువారు.

ఇక్కడ దొరకిన బౌద్ధస్తూపము అమరావతి స్తూపమున కన్న ముందు కట్టబడియుండును. ఇది ధాతుస్తూపము. ఈగ్రామమునకు అయిదుమైళ్ళ దూరములో నున్న శ్రీకాకుళము ఆంధ్రచక్రవర్తులకు రెండుమూడు శతాబ్దములు రాజధానిగా నుండెను. ప్రథమమున శాతవాహనుల కిదియే రాజధాని. బౌద్ధులు ప్రథమమున స్తూపములను రాజధానులలోనే కట్టిరి. కనుక ఆదంతము పెట్టి ఇచ్చటనే స్తూపము కట్టియుందురు. తరువాతి శతాబ్దలలో వృద్ధిపొంది పేరెన్నికగన్న అమరావతీస్తూపమునకు ఈకథను జోడించియుందురు.

బౌద్ధస్తూపములకు లంజదిబ్బ లను నామము వచ్చుటకు కారణ మాలోచింపగా నిట్లు తోచుచున్నది. ఆంధ్రదేశమున 4,5 శతాబ్దులలో బౌద్ధమతము క్షీణింప మొదలిడెను. ఇందులకు ముఖ్యకారణము బ్రాహ్మణ మతవిజృంభణ. బౌద్ధసన్యాసులను భిక్కు లనియు, సన్యాసినులను భిక్కునిలనియు నందురు. వారు స్త్రీ పురుష భేదము లేక కలిసియుండెడివారు. స్త్రీ పురుషులు కలిసియుండుట గొప్పకొనని మనవారు దిబ్బల నున్న వీరి సంఘారామములను లంజదిబ్బలని వాడియుందురు. రామానుజ శంకరమతములు ప్రబలిన తరువాత నాస్తికమతమున కాకరములైన సంఘారామములను పూడ్చియుందురు. తరువాత నీ దిబ్బలకు లంజదిబ్బ లను నామము స్థిరపడియుండును.

ఈగ్రామపు పేరునకు జోడించిన కథ శాతవాహనుని కథను పోలియున్నది. దీపకర్ణి కృష్ణానదీపరిసరారణ్యములకు వెళ్లినప్పుడే పవిత్రకృష్ణవేణీపులినసీమల బాలుడు దొరికెను. తరువాత నాబాలుడు (శాతవాహనుడు) మహాపరాక్రమవంతుడై రిపుల నోడించి చక్రవర్తి యగుటయేకాక వంశకర్తకూడ ఆయెను. ఈయనరాజధాని శ్రీకాకుళము. పైకథయే నిజమైనచో ఆరాజు తా నెచ్చోట దొరకుటవలన తన కట్టి మహాభాగ్యము పట్టెనో యచ్చోట నొక పట్టణము గట్టించి దానికి తాను దొరకుటను తెలియజేయునట్టి పేరు పెట్టియుండును. కనుక దీని కా పేరు అట్లు వచ్చియుండునని తోచుచున్నది.

ఇటువంటి అనేకకారణములవలన ఘంటసాల శ్రీకాకుళము లొక్కగ్రామమే యని తోచుచున్నది. ఘంటసాల శ్రీకాకుళమునకు తొలిదిక్కున తోలి బజారమై యుండవచ్చును. శాతవాహనులు తమరాజధానిని ధాన్యకటకమునకు మార్చిన తరువాత నివి రెండును విడివడి, ధాన్యకటకము విడివడి ధరణికోట అమరావతులైనట్లు శ్రీకాకుళము ఘంటసాల లను వేరు వేరు గ్రామములై యుండవచ్చును.

ఈఘంటసాల 13-వ శతాబ్దమువరకును ఉచ్చదశయం దున్నట్లు శాసనములలో నున్నది.

క్రీ. పూ. 4000 నుండి క్రీ. శ. 1800 వరకును సకల సౌభాగ్యములతో విరాజిల్లి ఆంధ్రమాత కంఠహారమున కౌలికిపూసయైన ఘంటసాల యిప్పుడొక పెద్ద పల్లెటూరుగా నున్నది.

---

## శ్రీ స్వామీ నారాయణమహారాజు

ఇహసౌఖ్యములే పరమావధిగా, దానిసర్వతో ముఖాభివృద్ధికి మానవులు శక్తి నంతయు ధారవోయు చున్న యీ శతాబ్దములో ఆధ్యాత్మిక చింతయొక్క యావశ్యకత నాదర్శప్రాయముగ లోకమునకు బోధింప గల మహాత్ము లిప్పటికి నక్కడక్కడ పొడసూపి దీనుల నుద్ధరించుచున్నారు. క్రిందటి శతాబ్దములో శ్రీ రామకృష్ణపరమహంస బెంగాలుదేశమున నవత రించి సర్వమతసామరస్యమును శ్రీ వివేకానందునిచే ఖండఖండాంతరములలోను చాటింపించినాడు. శ్రీ స్వామీ రామతీర్థ యీ మహాసత్యమునే ప్రచారము చేసినాడు. నేడు తిరువణ్ణామలైయందు భగవాన్



శ్రీరమణమహర్షి అద్వైతప్రాశస్త్యమును జగమునకు వెల్లడించుచున్నాడు. సుమారు డెబ్బదిసంవత్సరముల క్రిందట జీవసమాధినొందిన భగవాన్ మాణిక్యప్రభువు దత్తాత్రేయుని అవతార మని మహారాష్ట్ర దేశమం దంతటయు ప్రతీతి. ఆమహాత్ముని సింహాసనమున మూడవ తరపు మహాపురుషుడు ఇప్పుడు భక్తుల ననుగ్రహించు చున్నాడు. బొంబాయిరాజధానిలో అహమ్మదునగరు జిల్లాలోని సాకోరిలో మహాత్మ సాయిబాబాశిష్యు డైన శ్రీ యుపాసనీమహారాజు నేడు లోకసంగ్రహ ముగా మకుటధారియై నిజదివ్యమాహాత్మ్యమును ప్రద ర్శించుచున్నాడు.

ప్రకృతము శ్రీమదనంతకోటిబ్రహ్మాండనాయకు డగు శ్రీ దత్తాత్రేయుని అవతారమై మహారాష్ట్ర దేశములో పూనాజిల్లాకు చెందిన కేడ్గాఁవ్ బేటునందు సంస్థానాధీశ్వరుడైయున్న సద్గురునాథ్ శ్రీనారాయణ మహారాజువారి చరిత్రము మన కిప్పుడు ప్రస్తుతము. ఈ మహాపురుషుడు గుల్బర్గాప్రాంతమున పార్థివాభిక జ్యేష్ఠ శుక్ల పక్షమున గ్రహమాలికాయోగకలితుడై జన్మించినాడు. తండ్రి భీమారావు; తల్లి లక్ష్మీబాయి. పంచశరద్వయస్కు డగువాటికి మాతాపితృవియోగము తటస్థించినది. నరసుండయను గ్రామమున తొమ్మిదేండ్లు వచ్చువఱకు ముత్తవ్వ పెంచినది. బాల్యమునుండియు శ్రీ దత్తాత్రేయదేవునియందు భక్తి కుదిరెను. తొమ్మిదవ యేట నుపనయనము జరిగినది. ఒకనాడు శ్రీనారా యణుడు ఘృతము మిక్కిలిగా వేయుమని కోరగా అవ్వ నిరాకరించినది. అది యొకనెపముగా ఇతడా శ్రేయమునసే గహనముల బట్టెను. అడవులలో ఘోరతప మాచరించెను. పదునాఱవయేట నితడు సౌందత్తియను గ్రామమున కనతిదూరమునందున్న ఎల్లమ్మకొండదరికి చేరెను. ఆప్రదేశము జమదగ్ని మహర్షి తపమాచరించిన స్థల మని ప్రతీతి. అక్కడ కొంతకాలముండి పిమ్మట ఉగరగోళయనుపల్లె చేరెను. అక్కడ నొకనాడు ఒకవిప్రుని నన్నము ప్రార్థింపగా ఆ మూఢబ్రాహ్మణుడు నిరాకరించెను. గత్యంతరము గానక ఇతడు అక్కడి విఠోబా ఆలయములో విఠల నాథుని క్షుద్బాధ నివారింపుమని వేడెను. మందహాస వదనారవిందయగు సుందరి యొకతె బంగారుపళ్లెర ములో పంచభక్ష్యపరమాన్నములు దెచ్చి పుండరీక వరదుని ప్రసాదమని భుజింపబెట్టెను. పిమ్మట అరణ్య ముల గ్రుమ్మరుచు నొకచోట విశ్వేశ్వరాలయమును గాంచి, అందు శివుని ప్రార్థించి, యా దేవాలయావరణ మందున్న ఫలవృక్షములను జూచి కొన్ని పండ్లు కోసి తినబోవుసమయములో నొక క్రూరవ్యాఘ్రము భయంకరముగా నార్చుచు శ్రీమహారాజును సమీపించి సాధుదర్శనముచే తానుగూడ సాధువై యాతని పాదపద్మముల మ్రొక్కొని వెడలిపోయెను. ఇట్లు

కాంతారవాసక్లేశము లన్నియూ అనుభవించుచు నొకనా డీయన త్రాగుటకు నీరు లేక శ్రీ దత్తాత్రేయుని ధ్యానించుసమయమున నొక గుఱ్ఱపురౌతు హఠాత్తుగా వచ్చి చెంతగల సెలయేటిలో దాహము తీర్చుకొమ్మని హెచ్చరించెను. పిమ్మట నితడు త్రిమూర్తిరూపుని భజించుచు కుందగోళ అను గ్రామమందు కొన్నాళ్లుండెను. అక్కడ ఒక యపుత్రకుడైన ధనికుడు పెంపుడుకొడుకవు కమ్మని కోరగా తాను మున్నే శ్రీ అత్రిపుత్రునకు దత్తపుత్రు డని చెప్పి పునహో వెళ్లెను. రిక్తుడైన తనయొద్ద విత్తమేమియు లేకుండుటచే అక్కడ నుత్తరీయ మమ్మి నాగిరమున కొనుట కాలోచించు నీతని నొక వణిక్పతి చూచి జాలిగొని జీవవెచ్చ మిచ్చెను. ఒకనాడు స్నానసంధ్యలనెరవేర్చుకొని యుకమిత్రునితో మాధుకరమునకై పునహోవీధుల యందు తిరుగుచు నొక విప్రునింటికి బోవ వాగృహస్థుడు మహారాజుసఖుని దూషించి కొట్టెను. ఇట్లుండ నొకనా డొక ధనికునకు శ్రీనారాయణునకు ద్రవ్య మివ్వవలసినదిగా స్వప్నమందు శ్రీదత్తాత్రేయు డాజ్ఞాపించుటచే నాతడు ధనముగొని మహారాజువద్దకు వచ్చి సమర్పించెను. ఆ ద్రవ్యముతో శ్రీ నారాయణుడు గాంగాపురి చేరెను. అక్కడ నొకయతీంద్రుడు శ్రీ వారికి మంత్రోపదేశ మొనర్చి ప్రతిగేహముముంగిట నామంత్ర మైదుమా ర్లుచ్చరించి భిక్షకు పడయకున్న దగ్గృహమును త్యజింపవలసినదిగా బోధించెను. శ్రీనారాయణు డొకనాడు మాధుకర మెత్తుటకై గాంగాపురి వీధుల బోవుచు దనకు మంత్రము బోధించిన యతీంద్రుని మఠమునం దొక నూత్న పురుషుని జూచెను. ఆనూతనపురుషుడు శ్రీనారాయణుని మాధుకరాన్నము గొని తెమ్మని యడుగగా నితడొక గేస్తుయిల్లు సొచ్చి, యందు తనగురుని చూచి "స్వామీ, మీ మఠమునం దున్న మహాపురుషుడు నన్ను మాధుకరాన్నము తెమ్మనె" నని పల్కగా నాగురు వాయన యెవరై యుండెనో యని వచ్చి తలుపుతాళము తీసి చూచునప్పటికి వేసిన తాళము వేసినట్లుండెను. కాని తలుపు తెఱచి లోనప్రవేశించిచూచి యెవరో దత్తాత్రేయుని విగ్రహమును షోడశోపచారవిధుల నర్చించినట్లుమాత్రము శ్రీ నారాయణు డెఱిగి యిది దత్తాత్రేయుని మహిమగా దెలిసికొని దత్తుడు భుజించిన నేను భుజింతునని మూడు నాళ్లుపవసించెను. అంతట దత్తాత్రేయుడు స్వప్నములో నివేదనపదార్థము నందుకొని శ్రీనారాయణుని తృప్తునిజేసెను. ఒకనాడు దత్తాత్రేయుడు శ్రీనారాయణుని నివాసమైన నింబవృక్షమూలమున బంగారము కలదనియు, దానిని త్రవ్వి తీసి విక్రయించి నార్వ పల్లెకు బొమ్మనియు సెలవిచ్చెను. తదనుసారముగా వృక్షమూలమునందు ప్రత్యక్షమైన హేమమునుతీసుకొని, పరసన మేమో అనెడి పాపభీతిచే మహారాజు "ఇది మీదికదా, ఇది మీదికదా" అని ప్రజల నడిగెను. అంత పెద్దమ్మచుట్టమైన మనుజు డొకడు ఆ స్వర్ణము నాది యని గైకొని కడుపునొప్పిచే బాధితుడై, దానిని శ్రీనారాయణునకే తిరిగి యిచ్చెను. దానిని గొని శ్రీనారాయణమహారాజు ధూమశకట మెక్కి ధోండుదాకవెళ్లి కాలినడకను నార్వకివెళ్లెను. ఆర్వకొలనులో పద్మాసనస్థుడగుచు, మతియు జనులకు రాలను కలకండగా ప్రసాదమిడుచు, తనయంగుష్ఠము నుండి ప్ర[illegible]ను దివ్యజలములను తీర్థముగా నిచ్చుచు అనేకలీల లొనర్చసాగెను. ఒకఏకాదశి నొకయతీశ్వరుడు వచ్చి శ్రీనారాయణుని దర్శించి ద్వాదశినాడు "ప్రభూ! పండరి కేగెద. ధన మి"మ్మనగా పటకుటీరమునందున్న శ్రీమహారాజు నిజదక్షిణహస్తమును జాచెను. వెంటనే తెరవెనుకనుండి శ్రీదత్తాత్రేయుడు శ్రీవారికరమునిండ రూపికల నుంచెను. శ్రీ నారాయణుడు సంస్థానము నిర్మించుటకై శ్రీదత్తుని ప్రతిష్ఠింపగా నా మహోత్సవమును దిలకించుటకు లక్షలకొలదిభక్తులు ప్రోగయిరి. జనము తండోపతండములుగా త్రొక్కుటచే పైరు చేలు పాడాయెను. రైతులు శ్రీ నారాయణమహారాజుతో మొఱపెట్టుకొనగా శ్రీవారు నష్టము కట్టియిచ్చెదమని చెప్పిరి. చివరకు చూడగా పైరుచెడినను పంట నాల్గురెట్లధికమై హాలికులకు ముదమిచ్చెను. సంస్థానము కట్టు నాటికి శ్రీవారికి ఇరువదైదేండ్లుకూడ సరిగా నిండలేదు. శ్రీవారి యీలీలలు స్థాలీపులాకన్యాయముగా చెప్పినవి. ఈ మహాపురుషుడు ఇప్పటికి ఏబదివత్సరములకు మించిన వయస్సు కలవాడయ్యును బాలునివలె నిరంతరము నుత్సాహపూరితుడై నిత్యానందమును వెలిబుచ్చుమోముదమ్మితో నేటికిని కరుణారసముద్రుడై భక్తుల ననుగ్రహించుచున్నాడు.

— తాడేపల్లి శ్రీరాములు



# విమర్శనము

## పల్నాటి వీరచరిత్ర

కర్త: శ్రీనాథుడు. పరిష్కర్త: శ్రీ ఉమాకాన్త విద్యాశేఖరులవారు. ఖరీదు: ౨-౦-౦. ప్రకాశకులు: వాఙ్మయసమితి, గుత్తికొండ, పిడుగురాళ్ల పోస్టు, గుంటూరుజిల్లా.

అనేకవిధాల ఈ పల్నాటివీరచరిత్ర భారతం లాంటిది. శైవవైష్ణవమతాల శోధింపుకూడా దీనిలోని ప్రత్యేకత.

ఈ పల్నాటివీరచరిత్ర జనక, దేశాభిమానోద్రేకపు రోజులకు ముందూ, నేడూ సరి అయినతరుణానికే అచ్చయి ప్రజోపకారం చేస్తోంది.

ప్రజాహృదయాన్ని ఉర్రూతలూపే పట్లు లెక్కకు మిక్కిలికాగా, గ్రంథం ఎదటివారిని ఆకట్టుకునేదై, తరతరాలుగా తెలుగుల రక్తాన్ని వేడెక్కిస్తున్నది.

నిష్ఠురములైనా నిజములైన వాక్యవీధికలతోటి పరిష్కరణ మేలుగా చేపడి గ్రంథాధిక్యతను గణించుచున్నది. ఉమాకాన్తవిద్యాశేఖరులవారి వాణి దబాయింపుగలదైనా నిజము అయినది.

—శాస్త్రి

## భక్తియోగము

శ్రీ వివేకానందప్రవచనము. మద్రాసు, మైలాపూరు నందలి శ్రీ రామకృష్ణ మఠమువారిచే ప్రకటితము. వెల రు ౦-౮-౦ లు.

శ్రీ స్వామి వివేకానందులవారిచే ఆంగ్లమున వ్రాయబడిన భక్తియోగమున కిది శ్రీ మాధవ చైతన్య బ్రహ్మచారిగారిచే గావింపబడిన ఆంధ్రానువాదము. ఇందులో పందొమ్మిది అధ్యాయములు గలవు. భగవద్గీతలో పన్నెండవదియగు భక్తియోగాధ్యాయమునందు ఎటువంటి లక్షణములు గలవాడు భక్తుడో- భగవత్ప్రియుడో వివరింపబడియున్నది. అట్టి లక్షణములు ఒక్కపర్యాయముగ దేహధారులకందరకు లభింపవు. అందులకు కాలమూ, సాధనా ఇత్యాదు లావశ్యకములు. అట్టి యావశ్యకమార్గములనే శ్రీ వివేకానందుల వారు ఈ భక్తియోగమునందు పేర్కొనియున్నారు.

భగవంతునియెడల గలుగు పరమప్రేమయే భక్తి. అది లభించినచో ఐహిక వస్తువులమీదగల ప్రేమ తుచ్ఛ మనిపించును. కాని ఒకరియెడలగల ప్రేమ అన్యులయెడల ద్వేషభావముగ పరిణమించగూడదు. అట్టి సమాన భ్రాతృభావము కలుగకపోవుటచేతనే ప్రపంచములో అనేక మతవివాదములు, కొట్లాటలు, తుదకు రక్తపాతములుగూడ సంభవించుచున్నవి. ఇట్టి దుష్పరిణామము కలుగకుండులాగున మానవునకు గలుగవలసిన అసలైన భక్తి యెట్లుండవలెనో, ఎట్టిది సహజమో మొదటనే నిర్వచింపబడినది. తరువాత ఈశ్వరతత్త్వమును గురించియు, దానిని సాకల్యముగ అవగాహనముచేసుకొని అనుభవించుటయే భక్తియోగాశయమనియు అందులకుగాను సద్గురువులయవసరమును విశదీకరింపబడినది. అనంతరము గురుశిష్యుల లక్షణములూ, జపానుష్ఠానములకు గావలసిన ఓంకారసహిత మంత్రాదుల స్వభావములూ, ప్రతీక, ప్రతిమా ఉపాసనావిధానములూ, ఇష్టదైవనిర్వచనమూ, తత్ప్రాప్తికి ముఖ్యమైన సాధనక్రమములు వైరాగ్యాదులూ, అవి లభించుటకుగల హేతువులూ, సకలభూతప్రేమ,

ప్రేమయొక్క అసలైన స్వరూపము మొదలగునివి. యములు సరళమగురీతి నుపదేశింపబడినవి. వర్తమాన కాలపు నాగరికతలో కొట్టుకొనిపోవువారికినీ ఇందు సకారణములకు సమాధానములు గలవు.

ఈ గ్రంథము అనువాదమువలెగాక స్వయముగ వ్రాసినదానివలె బ్రహ్మచారిగారి రచనాశైలి పుణ్యముమ విశదీకరించుచున్నది. అనువాదములో స్వాములవారి భావములు స్పష్టమగుటకుగాను శైలివ్యత్యయ త్రిమత భాష్యకర్తల గ్రంథములనుండి సమానముగ ప్రమాణము లనుగ్రహించియున్నారు. ఇవిగాక అవసరమైన స్థలములందు ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణములు, భాగవతము లోనగు గ్రంథములనుసహితము ప్రమాణములుగ గైకొని అనువాదకులు స్వామివారి ఆశయములను చక్కగ కలియపరచియున్నారు. ఆస్తికబుద్ధికల వారికిది సురపారిజాతమువంటి గ్రంథము.

---

# గ్రంథస్వీకారము

## యువజనోద్యమము

రచయిత: శ్రీ కె. వి. రామకృష్ణగారు, అడ్వకేటు, జార్జి పేట, అనంతపురము. వెల రు. ౦-౩-౦.

---

## మతములు : మందిరములు

రచయిత: శ్రీ చిదిరెమఠం వీరభద్రశర్మగారు. శివధర్మగ్రంథమాలలోని ఒక పుష్పము. తపాలా, సజక్‌లాల్ వీధి, సికింద్రాబాదు (దక్కను) అని పుస్తకములనిమిత్తం వ్రాయవలెను. వెల రు. ౦-౨-౦.

---

## వన్నెలవాక

రచయిత: శ్రీ తాపీప్రగడ కృష్ణమూర్తి గారు, పర్లాకిమిడి, గంజాంజిల్లా. గ్రంథకర్తకు వ్రాసిన పుస్తకములు దొరకును.

---

## వేదము వేంకటరాయశాస్త్రిగారి జీవితము

కీర్తిశేషులైన శ్రీ శాస్త్రిలవారి భాషాసేవ లోని ప్రధాన ఘట్టములను నిరూపించుచున్న లఘు గ్రంథము. వారి పౌత్రులు వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్సు (౪, మల్లికేశ్వర గుడిసందు, లింగిసెట్టివీధి, జి. టి. మదరాసు)వారు దీనిని ప్రచురించిరి.

---

## సార్వసాముద్రికము

గ్రంథకర్త: శ్రీ జ్యోతుల సూర్యనారాయణమూర్తి గారు. ప్రకాశకులు: సూర్యసాముద్రికాలయము, జ్యోతులవారివీధి, కాకినాడ. వెల రు 3-0-0.

---

## రెండో ప్రపంచయుద్ధమా?

(రెండవభాగము)

ఆంధ్రకేసరిగ్రంథమాలవారి మూడవప్రచురణము. విలాసము: ౧౭౪, సుల్తాన్‌బజారు, హైదరాబాదు, దక్కను. వెల రు ౦-౬-౦ లు.

---

## గాంధీమహాత్ముడు

మొదటి రెండుభాగములు: గ్రంథకర్త: "విప్లవ చక్రం", ప్రకాశకులు: దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాదు, దక్కన్. ప్రతి ౧కి వెల రు ౦-౬-౦.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.



మైలాపూరు సముద్రతీరము

[చిత్రకారుడు : శ్రీ యస్. శ్రీనివాసరావు]